Bālasubrahmanya Brahmasvāmulu

Bhagavadgītā rahasyārthabōdhini

Cennapuri, 1910

Record no. 641

## Bibliographic Record Target

బాలసుబ్రహ్మణ్య బ్రహ్మస్వాములు.

భగవద్గీతా రహస్యార్థబోధినీ / బాలసుబ్రహ్మణ్య బ్రహ్మస్వాములవారిచే రచియింపఁబడినది.- చెన్నపురి : కలారత్నాకరముద్రాక్షరశాల, 1910.

2v. in 1, (1) leaf of plates : port. ;15 cm.

Record no. 641

Bālasubrahmaṇya Brahmasvāmulu.

Bhagavadgītā rahasyārthabōdhinī / Bālasubrahmaṇya Brahmasvāmulavāricē raciyimpam̐baḍinadi.- Cennapuri : Kalāratnākaramudrākṣaraśāla, 1910.

2v. in 1, (1) leaf of plates : port. ;15 cm.

Record no. 641

శ్రీ

# భగవద్గీతా

# రహస్యార్థబోధినీ.

---

శ్రీమత్పరమహంస

బాలసుబ్రహ్మణ్యబ్రహ్మస్వాములవారిచే

రచియింపఁబడినది.





పుదుచ్చేరియందుండు క్షానిచ్చంబట్టు

లక్ష్మణస్వామిసెట్టి భార్యయైన

ంధరమ్మయొక్క ధనసహాయముచే

ప్రకటింపఁబడినది.

---

చెన్నపురి:

[illegible]రత్నాకరముద్రాక్షరశాల.

1910 [వెల 1—0—0

శ్రీ

# భగవద్గీతా రహస్యార్థబోధినీ.

శ్రీమత్పరమహంస

బాలసుబ్రహ్మణ్యబ్రహ్మస్వాములవారిచే

రచియింపఁబడినది.






పుదుచ్చేరియందుండు కృష్ణానిచ్చంబట్టు

లక్ష్మణస్వామి సెట్టి భార్యయైన

ంధరమ్మయొక్క ధనసహాయముచే

ప్రకటింపఁబడినది.

---

చెన్నపురి:

కళారత్నాకరముద్రాక్షరశాల.

1910 [వెల 1—0—0

శ్రీ

# భగవద్గీతా
# రహస్యార్థబోధినీ.

---

శ్రీమత్పరమహంస
బాలసుబ్రహ్మణ్యబ్రహ్మస్వాములవారిచే
రచియింపఁబడినది.




పుదుచ్చేరియందుండు కన్నానిచ్చంబట్టు
లక్ష్మణస్వామిసెట్టి భార్యయైన
౦ధరమ్మయొక్క ధనసహాయముచే
ప్రకటింపఁబడినది.

---

చెన్నపురి:
కళారత్నాకరముద్రాక్షరశాల.
1910 [వెల 1—0—0



# ఓం

శ్రీకృష్ణాయపరబ్రహ్మణేనమః

# శ్రీభగవద్గీతా రహస్యార్థ బోధినీ.

## పీఠిక.

ప్రపంచమందుండు సమస్తవస్తువులును స్థూల సూక్ష్మ భాగ ములు రెండు స్వరూపములుగ గలిగియున్నవి. [illegible]నిస, [illegible]ండలు, [illegible], [illegible]గలు, ప్రాణులు మొదలగు అనేకవస్తువులు [illegible] కనఁబడు [illegible] రూపములే స్థూలమనఁబడును; దానిని వృద్ధిపరచు శక్తివి[illegible] శేషము (Force) సూక్ష్మమనఁబడును; ఈ స్థూలసూక్ష్మములకు ఆధారమగు కనఁబడని యవిద్యయే కారణమనఁబడును.

# ఓమ్.

శ్రీకృష్ణాయపరబ్రహ్మణేనమః.

# శ్రీభగవద్గీతా రహస్యార్థ బోధినీ.

## ప్రథమోధ్యాయః.

### శ్రీకృష్ణార్జునసంవాదః.

పరమాత్మయగు శ్రీకృష్ణమూర్తికిని, జీవాత్మయను నర్జునునకును జరిగిన సంవాదము.

జన్మాంధుఁడయిన ధృతరాష్ట్రుఁడను అవిద్య (అవివేకము) సంజయుఁడను వివేకమునుగూర్చి ప్రశ్నించియున దేమనఁగా:—

### ధృతరాష్ట్ర ఉవాచ.

అవివేకము చెప్పున దేమియనిన:—

**ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।**
**మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ॥ ౧॥**

అవివేకమునకు స్థానమగు కాఁబడనైన యమధర్మరాజైన నీ శరీరమునందాడిన నాయొక్క (అవివేకముయొక్క) కుమారులగు అహంకారమమకారస్వరూపులైన దుర్యోధనాదులగు దుర్గుణసైన్య



ములకును, నాయొక్క సహోదరుఁడగు (సహోదరుఁడు—దాయాది—విరోధి) పాండురాజుకుమారులగు ధర్మరాజాదిసద్గుణసైన్యములకును, (పాండు—జ్ఞానము. అనఁగా, వివేకముయొక్కకుమారులు ధర్మరాజాదులనెడు సద్గుణములు) ఈ రెండు తెగలవారికిని జరిగిన యుద్ధమందు నీ కేమిచేసిరనుచుయే.. (౧)

### సంజయ ఉవాచ.

వివేకము చెప్పున దేమి యనిన:—

**దృష్ట్వా తు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా।**
**ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్॥ ౨॥**

రాగద్వేషాద్యవివేకసైనికులును, భక్తిశ్రద్ధాదిసద్గుణసైనికులును, యుద్ధరంగమగు నీ ప్రపంచమందు జేరినప్పుడు అవివేకసంతతిలోనివాఁడైన దుర్యోధనుఁడను కాముఁడు, సద్గుణసైన్యమునుజూచి యప్పుడు ద్రోణాచార్యుఁడను వైరాగ్యమును సమీపమునకుఁ బోయి యుప్రకారము పలికెను. (౨)

### దుర్యోధన ఉవాచ.

అవివేకసంతతిలోనివాఁడైన కాముఁడు చెప్పుచున్నది:—

**పశ్యైతాం పాణ్డుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్।**
**వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా॥ ౩॥**

అస్మాకన్తు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ!।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమితే ॥౭॥

ద్రోణాచార్యుఁడనెడు ఓ వైరాగ్యమా! మన సేననుండు శూరులను మన సేనానాయకులను నీజ్ఞాపకముకొఱకుఁ జెప్పెద నవధరింపుఁడు. (౭)

భవాన్భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితిఞ్జయః।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిర్జయద్రథః॥ ౮॥

తాము నను భీష్ముఁడనెడు క్రూరత్వమును, కర్ణుఁడనెడు మమకారమును, కృపాచార్యుఁడనెడు లోభమును, యుద్ధమునందుజయశాలియగు అశ్వత్థామయనెడు మూర్ఖత్వమును, వికర్ణుడనెడు భయమును, కర్మలఫములయం దాసక్తియనెడు సోమదత్తునియొక్క పుత్రుఁడైన భూరిశ్రవుడనెడు ఆశయును జయద్రథుఁడనెడు అల్పత్వమును- (౮)

అన్యే చ బహవ శ్శూరా మదర్థే త్యక్త జీవితాః।
నానాశస్త్ర ప్రహరణా స్సర్వే యుద్ధ విశారదాః॥ ౯॥

మఱియు ననేకశూరులును, నాకొఱకు ప్రాణములవిడుచుటకు (నశించుటకు) సిద్ధముగనుండు, పైనజెప్పబడిన వారందఱు ననేక విధములైన ప్రపంచ విషయము లనెడు ఆయుధములుగలవారుగాను, యుద్ధపరిశ్రమముగల వారుగా నునాన్నారు.



అపర్యాప్తం త దస్మాకం బలం భీష్మాభిరక్షితమ్।
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్॥ ౧౦॥

అయినను, భీష్ముఁడనెడు క్రూరుఁడు మొదలగు మీరందఱున్నను మనయొక్క సైన్యము, పాండవులనెడు సద్గుణముల సేనను జయింపఁదగినంత లేదు. భీముఁడనెడు ధైర్యముచే సంరక్షింపఁబడిన పాండవులనెడు సద్గుణసేనయన్ననో, మనలను జయింపఁదగినంతయున్నది. (౧౦)

అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః।
భీష్మ మేవాభిరక్షన్తు భవ న్తస్సర్వ ఏవహి॥ ౧౧॥

మీరందఱును అన్నివైపుల జాగ్రతగా నిలిచి క్రూరత్వమునే కాపాడవలయును. ఏలననిన, క్రూరత్వమునకు మోసమురాకుండ మీరందఱును గాపాడినయెడల నది శత్రువులఁజంపి జయమును పొంది మీకిప్రపంచ సుఖములఁ గలుగఁజేయును. (౧౧)

సంజయ ఉవాచ.

సంజయుఁడనెడు వివేకము చెప్పునదేమనఁగా:—

తస్యసంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చై శ్శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్॥

ఇట్లు దుర్యోధనుఁడనెడు అవివేకసంతతిలోఁజేరిన కామముద్రోణాచార్యుఁడనెడు వైరాగ్యముతో ముచ్చటించుచుండి, యిరుతెఱఁగుల సైన్యముల వివరములను జెప్పుచుండగా, నాదుర్యోధనుఁడనెడు కామమునకు మిక్కిలి సంతోషమును గలుగఁజేయఁదలఁచి, సద్గుణసేనంజూచి, భయపడునట్టిదియు, అవివేకసంతతిలో గొప్పదియు అవివేకసంతతికిని సద్గుణసంతతికిని తాతయగు భీష్ముఁడనెడు క్రౌర్యము "మా కపజయము గలుగక యుండుగాత" యని సింహగర్జనము వంటి యొక గొప్పధ్వనినిఁ జేసెను. (౧౨)

**తతశ్శఙ్ఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః।**
**సహసైవాభ్యహన్యన్త సశబ్దస్తుములోఽభవత్॥ ౧౩॥**

భీష్ముఁడనెడు క్రూరుఁడు సింహనాదమును జేసిన పిదప శంఖము (మా కపజయము గలుగక యుండుగాత) అనెడు శబ్దములను, శత్రువులయొక్క హృదయములను కలతపెట్టునట్టి శబ్దములను, స్తోత్రశబ్దములను, మేఘశబ్దములవంటి శబ్దములను, వాద్యభాండశబ్దము వంటి శబ్దములను, వెంటనే సైనికులుచేసిరి. ఆశబ్దము లెచ్చటన్ను నిండెను. (౧౩)

**తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ।**
**మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః॥ ౧౪॥**



అవివేకసంతతియొక్క సైనికులు శబ్దములను జేసిన పిమ్మట పరిశుద్ధమైన యింద్రియములతోఁగూడిన గొప్పరథమనెడు శరీరమందుండు (అన్ని ఐశ్వర్యములకును పతియును, మధు=అమృతం, మోక్షము నిచ్చువాఁడని ఛాన్దోగ్యోపనిషత్తు మధువిద్యయందు పొగడఁబడువాఁడును, మౌనము, ధ్యానము, యోగము వీనిని గలవాఁడునునగు) శ్రీకృష్ణమూర్తియనెడు పరమాత్మయు, జ్ఞానసంతతినిఁ జేరిన యర్జునుఁడనెడు ధర్మార్థకామ మోక్షములను సంపాదించుకొనుటకుశక్తిగల సాధనచతుష్టయ సంపత్తితోఁగూడినజీవాత్మయు, శ్రేష్ఠమైన తమతమ జయసూచకములగు శబ్దములను జేసిరి. (౧౪)

**పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనఞ్జయః।**
**పౌణ్డ్రం దధ్మౌ మహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః॥ ౧౫॥**

జడత్వమున కధిపతియగు ధృతరాష్ట్రుఁడనెడు నవివేకమా! తనను స్మరించు వారలహృదయమును బ్రకాశింపఁజేయు (శ్రీకృష్ణ) పరమాత్మ యింద్రియములను దుర్మార్గములయందుఁ బ్రవేశింపకుండునట్లు తెలియఁజేయఁదగిన శబ్దమును, ఆశనుజయింపఁదగిన యర్జునుఁడనెడు జీవుఁడు యింద్రియముచే నివృత్తిమార్గమునఁ జేయఁదగినశబ్దమును, భయంకరములైన కృత్యములఁ జేయఁదగిన వృకోదరుఁడని యపరనామముగల భీముఁడనెడు ధైర్యమును సమస్తములైనమనస్సులఁ గలఁతపెట్టునట్టి యొకగొప్పధ్వనినిఁ జేసెను. (౧౫)

**అనన్తవిజయం రాజా కున్తీపుత్త్రో యుధిష్ఠిరః।**
**నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ॥ ౧౬॥**

సమస్తములో శ్రేష్ఠమయినదియు, కుంతియను మూలప్రకృతి యొక్క ప్రథమసంతతి యైనదియు, రాజయినదిగను నుండు యుధిష్ఠిరుఁడనెడు యుద్ధమందుఁ జలింపనియుల్లము అనేకశత్రువులను శబ్దముచేతనే వెనుదీయఁజేయఁదగిన శబ్దమును; నకులుఁడనెడు సమదృష్టి గొప్పశబ్దమును సహదేవుఁడనెడు సహంకారము నాభి యందుండి రాఁదగిన శబ్దమును. (౧౬)

**కాశ్యశ్చ పరమేష్వాసః శిఖణ్డీ చ మహారథః।**
**ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః॥ ౧౭॥**

కాశీరాజనెడు కీర్తియు, గొప్పశరీరముగల శిఖండి యనెడు ముక్తికాంతను జెందఁగోరు తలంపును, దుర్మార్గులను సన్మార్గమందుఁదెచ్చు దృష్టద్యుమ్నుఁడనెడుహింసయు, సకలమును దాను గాఁదలంచు విరాట్టనెడు మదమును, యుద్ధమునం దపజయము నొందని సాత్యకియనెడు సత్యత్వమును. (౧౭)

**ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే।**
**సౌభద్రశ్చ మహాబాహుః శఙ్ఖాన్దధ్ముః పృథక్పృథక్॥**



ద్రుపదుఁడనెడు ధ్యానమునకు సహాయమగు మనస్సును, ఆయావ శ్లోకమందుఁ జెప్పఁబడిన ప్రతివింధ్యుఁడనెడు నిశ్చయము మొదలు శ్రుతసేనుఁడనెడు భ్రమరాహిత్య పర్యంతముగల సద్గుణసంతతిలో నివారును, సుభద్ర యనెడునావరణశక్తికిఁ గుమారుఁడగు నభిమన్యుఁడనెడు పరాక్రమమును, వీరు మొదలగు సద్గుణసైనికులందఱు వారివారి శబ్దములఁ జేసిరి. (౧౮)

**స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।**
**నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్॥౧౯॥**

సర్వత్రను నిండియుండు సద్గుణసైనికులచేఁ జేయఁబడిన యాశబ్దము లాకాశమందును, (పైలోకములయందును) ఈలోకమందును ప్రతిధ్వనింగలుగఁ జేయుచు నవివేకమునకుఁ గుమారులైన దుర్యోధనాదులనెడు కామాదుల గుండెలను బద్దలుచేసెను. (౧౯)

**అథ వ్యవస్థితాన్దృష్ట్వా ధార్తరాష్ట్రాన్కపిధ్వజః।**
**ప్రవృత్తే శస్త్రసమ్పాతే ధనురుద్యమ్య పాణ్డవః॥ ౨౦॥**
**హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే!॥౨౦½॥**

మాయచేఁ గప్పబడియుండు నవివేకమా! ఇట్లందఱును వారివారి శబ్దములఁ జేసిన పిమ్మట నాయుధప్రయోగము నారంభించినప్పుడు

కపిధ్వజుఁడను చల చిత్తుఁడగు జీవుఁడు యుద్ధమునకు సిద్ధమైయుండు నవివేకసైన్యమును, తనయొక్క గాండీవ మనెడుసాధన చతుష్టయమునుసిద్ధపరచుకొని యుద్ధప్రారంభముఁ జేయఁబోవు సమయమున సారథియైన శ్రీకృష్ణపరమాత్మనుజూచి ముందుఁజెప్పఁబోవు రీతిం జెప్పుచున్నాఁడు. (౨౦౪)

## అర్జున ఉవాచ.

జీవుండిట్లనియె:—

సేనయోరుభయోర్మధ్యే రథంస్థాపయ మేఽచ్యుత! ॥ ౨౧ ॥
యావదేతాన్నిరీక్షేఽహమ్ యోద్ధుకామానవస్థితాన్ ।
కైర్మయాసహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే ॥ ౨౨ ॥
యోత్స్యమానానవేక్షేఽహంయఏతేఽత్రసమాగతాః ॥
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః యుద్ధే ప్రియచికీర్షవః ॥ ౨౩ ॥

ఓ నాశరహితమైన పరమాత్మా! చెడుతలంపుగల కామాదులకు యుద్ధమందు సహాయము చేయఁదలఁచి యీ యుద్ధరంగమందెట్టివారలు వచ్చియున్నారో, వారలలో నెవ్వారలతో నేను యుద్ధము చేయవలసియున్నదో, వారలను చూచి తెలిసికొనువరకును నాయొక్క రథమైన శరీరము నారెండుసేనల మధ్యను నిలుపుము. (౨౩)



## సంజయ ఉవాచ.

(సాక్షియైన) వివేకముచెప్పుచున్నది.

ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ! ।
సేనయో రుభయోర్మధ్యే స్థాపయిత్వారథోత్తమమ్ ।
భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ! పశ్యైతా న్సమవేతా న్కురూ నితి ॥

అవిద్యయొక్క సంతతిలోఁ జేరిన యోయవివేకమా! నిద్రను జయించిన మిక్కిలి జాగరూకుఁడైన యర్జునుఁడగు జీవునిచేఁ జైన జెప్పఁబడియుండు ప్రకారము శ్రీకృష్ణపరమాత్మ యీరెండుసేనలమధ్యమున క్రౌర్యము, వైరాగ్యము మొదలగు ప్రాధాన్యముగల సమస్తమైన రాజుల యెదుట శ్రేష్ఠమైన రథమగు శరీరమును నిలిపి అర్జునుఁడనెడు యోజీవాత్మా! యుద్ధభూమియగు ప్రపంచమందుఁజేరియుండెడి యీకామాదులు మొదలైన యవివేకసంతతిని జూడుము; అని పలికెను. ౨౪, (౨౫)

తత్రాపశ్యత్ స్థితాన్పార్థః పితౄనథ పితామహాన్ ।
ఆచార్యాన్మాతులాన్భ్రాతౄన్పుత్రాన్పౌత్రాన్సఖీంస్తథా
శ్వశురాన్సుహృదశ్చైవ సేనయోరుభయోరపి ॥ ౨౬ ॥

అట్లు శ్రీకృష్ణపరమాత్మ జెప్పినపిదప నర్జునుఁడనెడు జీవాత్మ భూరిశ్రవుఁడనెడు జ్ఞానయజ్ఞ స్వరూపమువంటి తండ్రులను, భీష్ముఁడనెడు క్రౌర్యమువంటి పితామహులను, ద్రోణుఁడనెడు వైరాగ్యమువంటి గురువులను, శల్యుఁడనెడు మోహమువంటి మేనమామలను, దుర్యోధనుఁడనెడు కామమువంటి సహోదరులను, తత్పుత్రుఁడగు లక్ష్మణకుమారుఁడనెడు, చూచునదంతయు గోరునటువంటి కుమారులను, తత్పుత్రుఁడగు లక్ష్మణపుత్త్రిఁడనెడు, విన్నదంతయు గోరునటువంటి మనుమలను, కృతవర్మయనెడు శరీరమును దాచుకొనునటువంటి స్నేహితులను, ద్రుపదుఁడనెడు ధ్యానమునకు సహాయమగు మనస్సను నటువంటిమామలను, ప్రతిప్రయోజనము నపేక్షింపకయే సహాయులై వచ్చియున్న శ్రీకృష్ణ పరమాత్మవంటివారలను జూచెను. (౨౭-౪)

**తాన్ సమీక్ష్య స కౌన్తేయ స్సర్వాన్బన్ధూ నవస్థితాన్।**
**కృపయా పరయాఽవిష్టో విషీద న్నిద మబ్రవీత్ ॥౨౮౪॥**

కుంతియనెడు మూలప్రకృతికిఁ బుత్రుఁడగు నర్జునుఁడనెడు జీవుఁడు యుద్ధమునకు సిద్ధమైన సమస్తబాంధవులఁజూచి, వీరందఱు యుద్ధమునందుఁ జనిపోయెదరుగదా? యను కనికరముతోఁ గన్నీరువిడుచుచు, మిక్కిలి వ్యసనమునొందినవాఁడై, ముందు చెప్పఁబోవురీతిని (శ్రీకృష్ణ) పరమాత్మనుజూచి పలికెను. (౨౮౪)



### అర్జున ఉవాచ.

దృష్ట్వేమంస్వజనంకృష్ణ! యుయుత్సుంసముపస్థితమ్॥
సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి।
వేపథు శ్చ శరీరే మే రోమహర్ష శ్చ జాయతే॥ ౨౯॥
గాణ్డీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే।
నచ శక్నో మ్యవస్థాతుం భ్రమతీ వచ మేమనః॥ 30॥
నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ!! 30౪॥

జీవాత్మ (అర్జునుఁడు) పలికెను.

ఓ శ్రీకృష్ణపరమాత్మా! యుద్ధముఁజేయఁదలంచి, అందుకొఱకై యిచటవచ్చియుండెడి యీ కామక్రోధాదులగు బంధువులఁజూచి, నాయవయవములు దుర్బలములగుచున్నవి; నోరెండుచున్నది, నాయొక్క శరీరము వణకుచున్నది, గొగ్గురుపాటు గలుగుచున్నది, సాధన చతుష్టయ మనెడు గాండీవము జారుచున్నది; శరీరమంతయు మండుచున్నది, రథమను శరీరమందు నిలువ శక్తిలేక యున్నాను; నామనంబు భ్రమనొందినట్టున్నది, బ్రహ్మ,విష్ణు, శివాత్మకమగు నో పరమాత్ముఁడా! అవివేకసంతతియొక్కయు, వివేక సంతతియొక్కయు నాశనసూచకమగు నపశకునములఁ జూచుచున్నాను. (30౪)

నచ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే॥౩౧॥
న కాఙ్క్షే విజయం కృష్ణ! నచరాజ్యం సుఖానిచ।
కిం నో రాజ్యేన గోవిన్ద! కింభోగై ర్జీవితేనవా॥ ౩౨॥
ఏషా మర్థే కాఙ్క్షితం నో రాజ్యం భోగా స్సుఖానిచ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ॥౩౩॥
ఆచార్యాః పితరః పుత్రా స్తథైవచ పితామహాః।
మాతులాః శ్వశురాః పౌత్రా స్స్యాలాః సమ్బన్ధిన స్తథా॥౩౪॥

యుద్ధమునం దవివేకసంతతియు, వివేకసంతతియునైన కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, మనస్సు మొదలగు బంధువులఁ జంపిన పిదప వచ్చు శుభమును, శ్రేయస్సును, నాకు వలదు. ఓ శ్రీ కృష్ణ పరమాత్మా! అట్టి బంధువులఁ జంపుటచేఁ గలుగు జయమును నేనుగోరను. ఆజయముచేనబ్బు రాజ్యమునుగాని, తత్సుఖమునుగాని నేనిచ్ఛగించను. మనస్సు మొదలగు సకలేంద్రియములకుఁ బతియగు నోపరమాత్మా! మనకు మనబంధువులందఱు యుద్ధమందు చనిపోయిన పిదప యీ రాజ్యముచే నేమి ప్రయోజనము, లేక, భోగములవలన గాని జీవించియుండుటచేఁగాని యేమిప్రయోజనము. మన మెవ్వరి కొఱకు రాజ్యమును గోరఁదగియున్నదో భోగములను సుఖములను నెవ్వరి కొఱకుఁ గోరవలసియున్నదో, అటువంటిగురువులును,



తండ్రులును, కుమారులును, తాతలును, మేనమామలును, మామలును, మనుమలును, బావమఱుదులును, వియ్యంకులును, వీరందఱుసు ప్రాణములను, ఐశ్వర్యములను విడనాడుకొని యీయుద్ధరంగమందు వచ్చియున్నారు. (౩౪)

ఏతా న్నహన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన!।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్నుమహీకృతే-౩౫॥

భక్తులయొక్క కర్మములను నశింపఁజేయునట్టి ఓ పరమాత్మా! యుద్ధరంగమందు నన్ను వారుచంపినా, చంపనీ. అనిష్టం, ఇష్టం, మిశ్రమ్, అను కర్మఫలములను గలుగు యీమూఁడులోకములో నాకు సంప్రాప్తమగునదిగ నుండినను, వానికొఱకు వీరలనుజయింపను అను నప్పుడు యీరాజ్యముకొరకుఁగానా, చంపదలంచెదను, ఎన్నడును లేదు. (౩౫)

నిహత్య ధార్తరాష్ట్రాన్నః కాప్రీతి స్స్యాజ్జనార్దన!।
పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతా నాతతాయినః॥౩౬॥

భక్తులకు ముక్తినిచ్చి జన్మరాహిత్యము గలుగఁజేయ నో పరమాత్మా! అవివేక సంతతులఁ జంపినందున మన కేమి సంతోషము గలుగును. వారలు మనల్లఁ జంపునదిగానుండినను వారినిజంపినందు

వలన మనకు పాపమే సంభవించును. 'అహింసాపరమోధర్మః'! అను ధర్మశాస్త్రమునుబట్టి మంచిదానినిగాని చెడుదానినిగాని హింసించవలదుగదా. కాఁబట్టి నే నేమాత్రమైనను జంపను. (౩౬)

**తస్మాన్నార్హావయంహన్తుంధార్తరాష్ట్రాన్సబాంధవా**
**స్వజనం హి కథం హత్వాసుఖినస్స్యామ మాధవ!॥ [న్।**

మాయావిద్యలకు యజమానుఁడగు నోపరమాత్మా! అందుచేతనే మనము కామక్రోధాది బంధువులతోఁ గూడుకొనిన కౌరవులనెడు నవివేక సంతతిని జంపఁదగినవారము కాము. వారు చెడ్డవారైనమన కేమి? మనకును బంధువులుగా నుండువారలను జంపిన మన మెట్లు సుఖులౌదుము? (౩౭)

**యద్యప్యేతే నపశ్యన్తి లోభోపహతచేతసః।**
**కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చపాతకమ్ ॥౩౮॥**

జననమరణములఁ దొలఁగించునట్టి యోపరమాత్మా! యీ భూలోకరాజ్య భోగాశలచేఁ జెడిపోయినమనస్సుగల యీ కామక్రోధాదులు, కులనాశమువలనఁ గలుగుదోషమును, మిత్రద్రోహమువలనఁ గలుగుపాపమును దెలిసికొనలేనివారలుగ నున్నారు. (౩౮)



**కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మాన్ నివర్తితుమ్।**
**కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన!॥ ౩౯॥**

ఓ పరమాత్మా! 'అహింసా పరమో ధర్మః'! అనుసంగతిఁ దెలిసియుండెడిమనము అవివేక వివేకసంతతులఁ జంపుటవలనఁ బాపము గలుగునని యెట్లు తెలిసికొనము? (౩౯)

**కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మా స్సనాతనాః।**
**ధర్మే నష్టే. కులం కృత్స్న మధర్మోఽభిభవత్యుత॥ ౪౦॥**

కామక్రోధాదుల యొక్క కులములను నాశముచేసిన యెడల పరంపరగా వచ్చు కులాచారములు సంపూర్ణముగానశించి పోవును. కులధర్మములునశించినయెడల కులములయం దనాచారము అభివృద్ధిపొందును. ౪౦

**అధర్మాభిభవా త్కృష్ణ! ప్రదుష్యన్తి కులస్త్రియః।**
**స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణసంకరః॥ ౪౧॥**

పాపములనశింపఁజేయునో పరమాత్మా! అనాచారములువ్యాపించినయెడల సత్కులప్రసూతలగు స్త్రీలు చెడుదురు. స్త్రీలు చెడినయెడల, అన్నిటింగా పాడునో పరమాత్మా! వర్ణసంకరముగలుగును.

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ ।
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః॥ ౪౨॥

జాతి చెడినయెడల కులమును జెరిచినవారలకుఁ జెడుకులములనుండువారలకును నరకప్రాప్తియే యగును. ఇంతియకాక కులము చెడినచో శ్రాద్ధాది దినములయందు పిండములును, అమావాస్య మొదలగు దినములయందుఁ దిలోదక తర్పణము మొదలగునవి పితృలకు లేకపోవును. అవి లేకపోవుటవలన పితృదేవతలును నరకప్రాప్తులే యగుదురు. (౪౨)

దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకర కారకైః ।
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥౪౩॥

జాతి సంకరము గలుగఁజేయువారల కులమును చెడినవారియొక్క యీపాపములచేఁ బ్రాచీనముగ వెంబడించివచ్చు జాతిధర్మములును, కులధర్మములును జెడుపఁబడును. (౪౩)

ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన॥
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ॥ ౪౪॥



పాపములఁ బోఁగొట్టు ఓపరమాత్మా! చెడిపోయిన కులాచారములు గల మనుష్యులకు నెల్లప్పుడు నరకమే వాసస్థానమని పెద్దలు చెప్పఁగా వినియున్నాము. (౪౪)

అహో! బత! మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్।
యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజన ముద్యతాః ॥౪౫॥

ఏకారణమువలన నీరాజ్యపరిపాలనసుఖమందాశచే బంధువులఁ జంపసిద్ధముగనున్నామో, ఆకారణమువలననే మహాపాపములనుగూడఁజేయ నుద్యుక్తులమై యున్నాము. ఆహా యేమియాశ్చర్యము? ఏమి కష్టము? (౪౫)

యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః ।
ధార్తరాష్ట్రా రణేహన్యు స్తన్మే క్షేమతరం భవేత్ ॥౪౬॥

చేతులయందాయుధములు గలయవివేకసంతతివారలు యెదిరించకయు, ఆయుధములు లేకయునుండు నన్నుఁ జంపినయెడల నది నాకే క్షేమకరమగును. ఏల ననిన, వారల నెదిరించకయు, ఆయుధప్రయోగము లేకయునుండుటవలన నాకుఁ బుణ్యముగలుగును. నిరాయుధుఁడుగను, తిరస్కారియుగాకయునుండు నన్నుఁజంపినయెడల వారలకుఁ బాపము సంభవించును. (౪౬)

సఞ్జయ ఉవాచ.

ఏవ ముక్త్వార్జున స్సఙ్ఖ్యే రథోపస్థఉపావిశత్।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్న మానసః॥ ౪౭॥

(సాక్షీగానుండు) వివేకము చెప్పినది.

అర్జునుఁడగుజీవుఁడు పైఁ జెప్పినవిధముగఁ జెప్పి, దుఃఖముచేతఁ గలఁతఁజెందిన మనస్సుగలవాఁడై సాధనచతుష్టమనెడు బాణములతోఁగూడిన వింటిని క్రిందవైచి, యుద్ధసన్నద్ధులగు నుభయసేనల మధ్యమున రథమను శరీరమందు దిగులుజెంది చతికిఁల బడెను.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాదయోగోనామ ప్రథమోఽధ్యాయః సమాప్తః.

ఇట్లుపరమాత్మచేఁ జెప్పఁబడినందువలన శ్రీభగవద్గీత యనియు పరమాత్మవద్దకుఁ గొనిపోవుటవలన నుపనిషత్తనియు, పరబ్రహ్మముగఁ జేయుటవలన బ్రహ్మవిద్య యనియు, జీవాత్మ, పరమాత్మలయొక్క ఐక్యత్వమును గలుగఁజేయుటవలనయోగశాస్త్రమనియు చెప్పఁబడు నీగ్రంథమందుఁ 'బరమాత్మ జీవాత్మలనెడు గురుశిష్యసంవాదరూపమై జీవుడు, తత్త్వవిచారణ లేకపోవుటచే దుఃఖమున మునిగియున్నదని చెప్పు నీమొదటి యధ్యాయము ముగిసెను.

ఓమ్, తత్, సత్.

---



శ్రీరస్తు.

రెండవయధ్యాయము.

సాఙ్ఖ్యయోగః.

జీవాత్మ పరమాత్మలయొక్క తత్త్వవిచారణమనెడి
సాక్షీకర్మ సంగతులను జెప్పినది.

సఞ్జయ ఉవాచ.

తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్।
విషీదన్త మిదం వాక్య మువాచ మధుసూదనః॥ ౧॥

(సాక్షియగు) వివేకము, ధృతరాష్ట్రుఁడనెడు నవివేకముతోఁ
జెప్పినదేమనఁగా

బంధువులనెట్లు చంపెదననెడు నవివేకముతోఁ గూడినవాఁడును, నేత్రములయందు నీరువ్యాపించిన మనోవ్యాకులముతోఁ గూడినవాఁడును, దుఃఖాక్రాన్తుఁడుగనుండు నాజీవునిఁ (అర్జుననిఁ) గూర్చి పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) ముందు చెప్పఁబోవు వాక్యములచేఁ బలికెను. (౧)

## శ్రీభగవానువాచ.

కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్।
అనార్య జుష్టమస్వర్గ్య మకీర్తి కర మర్జున!॥ ౨॥

పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) చెప్పిన దేమనగా.

ఓ జీవుఁడా! అర్జునుఁడా!) అవివేకులచే ననుష్ఠింపఁదగినదియు, పరలోకసుఖమున కడ్డమైనదియు, ఇహలోకమునం దపకీర్తిని కలుగఁజేయునదియు నీపాపరూపమునగు మనోవ్యాకుల మేకారణము వలన నిన్నుఁ జెందెను! (౨)

క్లైబ్యం మాస్మ గమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప! ॥3॥

జడత్వమును బరిపాలించెడి ఓ జీవుఁడా! (అర్జునా!) భయములను బొందకుము. నీ కిట్టి మనోవ్యాకులము దగదు. జితేంద్రియుఁడగు నో జీవుఁడా! (అర్జునుఁడా) నీచమగుపిరికితనమును మాని యుద్ధమునకు సిద్ధుఁడవై లెమ్ము. (3)

## అర్జున ఉవాచ.

కథం భీష్మ మహం సఙ్ఖ్యే ద్రోణంచ మధుసూదన!।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హౌ వరిసూదన॥ ౪॥

జీవుఁడు (అర్జునుఁడు) చెప్పిన దేమనఁగా.

శత్రువులను ఖండింపఁదగిన యోపరమాత్మా! (శ్రీకృష్ణమూర్తి!) పూజింపఁదగిన భీష్ముఁడనెడు క్రౌర్యమును, ద్రోణుఁడనెడు వైరాగ్యమును యుద్ధమునందు నేనెటుల నెదిరించి బాణములచే యుద్ధము చేయుదును! (౪)

గురూ నహత్వాహి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే।
హత్వార్థ కామాంస్తు గురూ నిహైవ
భుఞ్జీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్॥

పెద్దలగు నాచార్యులను జంపక యీప్రపంచమందు భిక్షాటనము చేయుట మిక్కిలి మేలైనదిగనున్నది. అట్లుగాక, ఆచార్యులను జంపినను, యీజన్మమందే వారిరక్తములతోఁ బూయఁబడిన యర్థకామరూపములగు భోగములఁ బొందినవాఁడ నగుదును. (౫)

నచైత ద్విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యదివా నోజయేయుః।
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥ ౬॥

ఎవరినిజంపి మనము జీవించఁగోరమో అటువంటి యవివేకసంతతివారైన భీష్ముఁడనెడు ద్రోణాచార్యుఁడు మొదలగువారలు మనయెదుట నున్నారు. పోనిమ్ము, వారలజంపి రాజ్యమును బొందెదమనినను భీష్ముఁడనెడు ద్రోణాచార్యుఁడు మొదలగువారు మిక్కిలి బలశాలులగుటవలన, వారు మనలనే జయించెదరో లేకమనమే వారలఁజయించెదమో, లేక యేమిసంభవించునో యనునదియు తెలియకున్నాము. ఇటువంటి సందిగ్ధస్థితిలోఁ బైనజెప్పఁబడిన రక్తాన్నభిక్షాన్నములలో నెయ్యది శ్లాఘ్యమైనది? ఎన్నివిధముల నాలోచించినను, బంధువులనందఱిం జంపుటమాని, భిక్షమెత్తి భుజించి కాలముగడపుటయే మిక్కిలి శ్రేష్ఠము. (౬)

కార్పణ్య దోషో పహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మ సంమూఢ చేతాః।
యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥ ౭॥



గురువు మొదలగు వారలఁజంపి, మనము జీవించియుండుట యోగ్యముగాదను వ్యసనమే కార్పణ్యము, అట్టివారిని చంపుటచేఁగలుగు పాపమే దోషము, వీనిచే నశించిన స్వభావముగల నేను, యేదిచేయఁదగునో, యేది చేయఁదగదో అనెడు ధర్మవిషయములో సందియము జెందియుండు మనస్సుగలవాఁడనై మిమ్ములనడుగుచున్నాను. ఏది మీచే శ్రేయస్సని నిర్ణయింపఁబడునో, దానిని నాకుఁ జెప్పుము; మీకు నేను శిష్యుఁడను; మిమ్ము శరణుజొచ్చిన నాకేది మేలైనదో, దానిని జెప్పి యాప్రకారము నడుపుమని శాసింపుము ఓపరమాత్మా! (శ్రీకృష్ణమూర్తి!). (౭)

నహి ప్రపశ్యామి మమాపనుద్యాత్
యచ్ఛోక ముచ్ఛోషణ మిన్ద్రియాణామ్॥
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్॥ ౮॥

భూమియందు శత్రువులు లేనిదియు, ఐశ్వర్యముచే నభివృద్ధిఁ జెందియుండునట్టిదియు నగు భూరాజ్యమును దేవేంద్రపదవిని నేను జెందినను, ఇంద్రియములకు మిగుల సంతాపముగలుగఁజేయు నా వ్యసనము నేది. పోఁగొట్టునో, అట్టిసాధనమును దెలియలేకయున్నానుగదా! ఓపరమాత్మా! కనుకనే యట్టిసాధనమును నాకు జెప్పుము. (౮)

## సఞ్జయ ఉవాచ.

**ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరన్తపః।**
**నయోత్స్య ఇతి గోవిన్దముక్త్వాతూష్ణీం బభూవహ॥**

(సాక్షీయగు) వివేకము చెప్పనది యేమనఁగా.

దుర్మార్గమునం దీడ్చుకొనిపోవు శత్రువులైన యింద్రియములఁ దపింపజేయు జితేంద్రియుఁడగు నిద్రను జయించినజీవుఁడు (అర్జునుఁడు) క్షేత్రజ్ఞుఁడగు (హృషీకేశ) పరమాత్మనుజూచి, పైఁజెప్పిన విధముగాఁజెప్పి, కాఁబట్టియే నేను యుద్ధముఁజేయ నని యంతర్యామియగు (గోవిన్దం) పరమాత్మను జూచి జెప్పి యేమియు మాటలాడక యూరకుండెను. ఏమి యాశ్చరము! (౯)

**తముువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత!।**
**సేనయో రుభయో ర్మధ్యే విషీదన్త మిదం వచః॥ ౧౦॥**

ఓ యవివేకమా! రెండుసేనల నడుమ దుఃఖాక్రాంతుఁడై యుండు నా జీవుని (అర్జును) జూచి, యింద్రియముల కీశుఁడైన (హృషీకేశః) పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) పరిహాసముచేయువానివలె చిఱునవ్వునవ్వుచు రాఁబోవువాక్యములఁ బలికెను. (౧౦)



## శ్రీభగవానువాచ.

**అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।**
**గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః॥ ౧౧॥**

(ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి స్వరూపమగు) పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) చెప్పన దేమనఁగా.

జ్ఞానమును సంపాదింపనర్హుఁడవగునో జీవుఁడా! (అర్జునుఁడా!) నీవు దుఃఖింపఁదగని భీష్ముఁడనెడు క్రౌర్యము మొదలగువానిం గూర్చి దుఃఖించితివి. నీవు చెప్పుమాటలో, యన్నింటి దెలిసినపండితుని వాక్కులవలె,నున్నవి. ఆత్మానాత్మావివేకములుగల పండితులు చనిన వారిని గూర్చియు, జీవించువారిని గూర్చియు నీవలె దుఃఖింపరు.

ఓ జీవుఁడా! నేను చెప్పఁబోవుదానిం దదేకాయత్త చిత్తుఁడవై వినుము. నీవు దుఃఖించుట శరీరమునుగూర్చియా? శరీరిని గూర్చియా? లేక, శరీరమే యాత్మ యను తలంపుచేతనా? శరీరము పోవునని యెంచి దుఃఖింతు నందు వేని, ఈ శరీరము ఎప్పుడైనఁ బోవునను నది నీకుఁ దెలిసినదే గదా? దానిని గురించి నీకు దుఃఖ మేల? లేక, నా శరీరి పోవునని దుఃఖించెద నందు వేని, శరీరియగు నాత్మ నశించెడి వస్తువు గాదని శ్రుతి స్మృతులు ఘోషించుచున్నవి. ఇంతియేకాక యీ రెండవయధ్యాయమం దికమీఁద రాఁబోవు

యేబదినాలవ శ్లోకమువరకుఁ గల సంగతులను నీవు చక్కఁగా గ్రహించినయెడల పైఁజెప్పఁబడిన మూఁడుసందేహములును దప్పక వీడిపోవును. గనుక నీవు శరీరిని గూర్చి దుఃఖించుటకుఁ గారణము లేదు. అదిగాదు; ఈ శరీరమే సత్యము, తదితరములు లేవు. గనుక యీ శరీరము పోవుచున్నదిగదా యని దుఃఖింతునందువేని, యదియు సరిగాదు. ఏల ననిన, ఈ శరీరమునకన్న విలక్షణముగ నొక పదార్థము సకలవ్యాపారములను జేయుటను స్వప్నావస్థయందుఁ బ్రతిదినమును ననుభవముగా నీవు జూచుచున్నావుగదా? శాస్త్రములుగూడ శరీరియగు నాత్మ యీ శరీరమునకు విలక్షణ మనియు, అట్టిది యొక్కటియే యనియు చెప్పుచున్నది. నీవుచెప్పిన ట్లీశరీరము దప్ప వేఱే లే దనుపక్షమందు శరీరము లనేకములగుటవలన, నాత్మయు ననేకములుగావలసివచ్చును. అతిశ్రుతివిరుద్ధము. కాఁబట్టి పుట్టిచచ్చుటయే స్వభావముగాఁగల యీశరీరముఁ గూర్చి నీవు దుఃఖించుట కాధార మేమియు లేదని బాగుగఁదెలిసికొనుము.(౧౧)

**నత్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః।**
**నచైవ న భవిష్యామః సర్వే వయ మతఃపరమ్॥ ౧౨॥**

నేనొకప్పుడును లేకుంటిని యనునది లేదు. నీవు భగవంతుఁడవుగావున నట్టివాక్యము నీకుఁ దగును; నావిషయములో నట్లు కాదందువేమో జీవుఁడా! (అర్జునా!) నీవును లేకుంటి వనునది



లేదు. ఇప్పుడునాకుఁ గలిగియుండు వ్యసనము నిన్నును, నన్నును గూర్చియుగాదు. ఇచ్చట యుద్ధరంగమున వచ్చియుండు బంధువులు, గురువులు మొదలగువారు చంపఁబడి లేకపోయెదరందువేమో, యీ రాజులు మొదలగు మనమందఱము యీ శరీరముపోయినను యిఁక మీఁద లేకపోవుననునదియు లేదు. (౧౨)

**దేహినోఽస్మిన్యథా దేహే కౌమారం యౌవనం జరా।**
**తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి॥ ౧౩॥**

దేహాభిమానియైన జీవునికి నీయొకేశరీరమునందు బాల్య, యౌవన, కౌమార, వార్థక్యములనెడు నవస్థలు నొకటితరువాతనొకటిక నట్లు వచ్చుచున్నవో, అట్లే యొకజీవునికి శరీరము లొక్కటి తరువాత నొక్కటిగ వచ్చుచుండును. ఆవిషయమందు శరీర మనిత్యము, ఆత్మ (భగవంతుఁడు) దేహముగా దనెడి యనుభవశాలి యగుజ్ఞాని నీవలె మోహము నొందఁడు. (౧౩)

**మాత్రా స్పర్శాస్తు కౌన్తేయ! శీతోష్ణసుఖదుఃఖదాః।**
**ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వభారత!॥ ౧౪॥**

మూలప్రకృతివంశములోఁ జేరిన ఓ జీవుఁడా! (అర్జునా!) పంచభూతములసంమేళనమువల్లఁగల్గు శ్రోత్రాదులగు నింద్రియములు

శబ్దాదివిషయములయొక్క సంబంధముచే, శీతము, ఉష్ణము, సుఖము, దుఃఖము మొదలగు ద్వంద్వములఁ గలుగఁజేయునవిగాను, రాకపోకలుగలవిగాను, అనిత్యములుగాను నున్నవి. అందుచే నాశీతోష్ణాదులను సంసార మను సముద్రమును దాఁటఁదగిన యోజీవుడా! (అర్జునా!) ఓర్చుకొనుము. (౧౪)

**యం హి న వ్యథయ న్త్యేతే పురుషం పురుషర్షభ ।**
**సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥ ౧౫॥**

శీతోష్ణాదుల నోర్చుకొనుటలో నేమిప్రయోజన మందువేమో, వినుము. పురుషశ్రేష్ఠుఁడగు నో జీవుఁడా! (అర్జునా!) విషయసంబంధమువలనఁగలుగు సుఖదుఃఖములు సమబుద్ధిగల యే పురుషుని బాధింపవో, అట్టివాఁడు గదా మోక్షమున కర్హుఁడగును. (౧౫)

**నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।**
**ఉభయో రపి దృష్టోఽ న్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః॥**

ఏది యుండునది యనుకొనినపిమ్మట లేని దగునో, అది యసత్తు. ఏది యున్నదనుకొనిన పిమ్మట గలది యగునో, యది సత్తు అనగా నీప్రపంచము మొదలగు సమస్తమును జాగరావస్థలో నున్నవి. స్వప్నావస్థలోను నున్నవి. సుషుప్త్యవస్థలో లేవు; గనుక



యీ ప్రపంచ మసత్తు, సమస్తమునకు సాక్షిగనుండు జ్ఞానము (ప్రజ్ఞ) 'నేను చూచుచున్నాను' 'అను జాగరావస్థయందును' 'నేను చూచితిని' 'అను స్వప్నావస్థయందును, 'నేను నిద్రించితిని' అను సుషుప్త్యవస్థయందును యీ మూఁడవస్థలను దెలిసికొనుటవల్లనది సత్తు ఈ సత్తాసత్తలయొక్క నిజమును "సర్వఙ్ఞ ల్విదం బ్రహ్మ" "బ్రహ్మై వేదం సర్వం" ఆత్మై వేధం సర్వం" అనుశ్రుతి వాక్యములను సద్గురుముఖముగా బాగుగఁదెలిసికొని స్వానుభవమనునిష్ఠయందుండుజ్ఞానులు దెలిసికొందురు. (౧౬)

**అవినాశి తు తద్విద్ధి యేన, సర్వ మిదం తతం।**
**వినాశ మవ్యయస్యాస్య నకశ్చి త్కర్తు మర్హతి॥ ౧౭॥**

ఈసమస్తప్రపంచమును యేభగంతునిచే (ఆత్మ=బ్రహ్మ)వ్యాపింపఁబడియున్నదో, అటువంటి పరబ్రహ్మమును నాశరహిత మనియు, ఈ బ్రహ్మమునకు నాశముగలుగఁజేయుటకు నెవ్వఁడును నర్హుఁడు గాఁడనియు నెఱుంగుము. (౧౭)

**అ న్తవ న్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః।**
**అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత!॥౧౮॥**

షడ్భావవికార రహితుఁడును, దేహాద్యుపాధులు నశించినను తాను నశించనివాఁడును, ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము,

శబ్దము, అర్థాపత్తి, అనుపలబ్ధి, యను షట్ప్రమాణములచేతను, కాలదేశములచేతను దెలిసికొనుట కశక్యమైనవాఁడును, దేహి యగువ్యవహారదశలో జీవుఁడుగాను, పారమార్థికదశలోఁ బరబ్రహ్మము గాను నుండెడియాత్మయొక్క యీశరీరములు నాశముగలవిగా నన్నింటిదెలిసిన పెద్దలచేఁ జెప్పఁబడుచున్నవి. కాఁబట్టి ఓ జీవుఁడా! (అర్జునా!) సందేహరహితుఁడవై నీవుయుద్ధమును జేయుము.

య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్।
ఉభౌ తౌ నవిజానీతో నాయం హన్తి నహన్యతే ॥౧౯॥

ఎవ్వఁడీయాత్మను జంపువాఁడుగఁ దెలిసికొనుచున్నాఁడో, వాఁడును, లేక, ఎవఁడీయాత్మను చంపఁబడఁదగినదానిగఁ దెలిసికొనుచున్నాఁడో, వాఁడును యీ యుభయులును నిజమునుదెలిసికొన్నవారుకారు. ఈయాత్మ, కర్తృత్వభోక్తృత్వాది వికారరహితుఁడు గనుక నెరులఁ జంపుటయు, లేక నెరులచేఁ జంపఁబఁడుటయులేదు. (౧౯)

న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః।
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥ ౨౦॥



ఇదివఱకుఁ జెప్పఁబడ్డ యీ యాత్మ యెప్పటికిని బుట్టునదిగాదు; చచ్చునదియుగాదు; లేకయుండి, క్రొత్తగాఁ గలుగునదియు గాదు; గలిగి మఱల లేకపోవునదియు గాదు; కాఁబట్టియే పుట్టుకలేనిది, నాశరహితమైనది, స్థిరమైనది, అనాదియైనది. నాశము గల యీ శరీరము అనేకవిధములైన చావు పుట్టుకలుగలది యైనను యీ యాత్మకు మార్పులేదు. (౨౦)

వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్।
కథం స పురుషః పార్థ! కం ఘాతయతి హన్తి కమ్ ॥౨౧॥

ఓజీవుఁడా! (ఓయర్జునుఁడా!) ఏవ్వఁడీ యాత్మను, పుట్టుకలేనిదిగను, శాశ్వతమైనదిగను, నాశరహితమైనదిగను, మార్పులేనిదిగను, సద్గురు ముఖముగఁ దెలికొనుచున్నాఁడో, అట్టి వివేకి యెవ్వనిఁజంపించును? లేక, ఎవ్వనిఁ జంపును? చంపుట, చంపించుట, మొదలగునవి యవిద్యాకార్యములు గావున అట్టికర్తృత్వాదుల విడువుము. (౨౧)

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥ ౨౨॥

మనుజుఁడు ప్రాఁతవస్త్రమును విడిచి క్రొత్తవస్త్రమును ధరించునప్పుడు, వస్త్రము మాఱునేగాని, మనుజుఁడెట్లు మాఱఁడో, అట్లు ఆత్మ ప్రాఁతదేహమును వదలి క్రొత్తదేహమును దెచ్చుకొన్నప్పుడు దేహముమాఱునే గాని ఆత్మకు నెప్పుడు మాఱ్పులేదు. (౨౨)

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః।
నచైనం క్లేదయంత్యాపో నశోషయతి మారుతః॥ ౨౩॥

ఆయుధము లీ యాత్మను ఛేదింపవు. అగ్ని యీ యాత్మను దహింపదు. నీరు యీ యాత్మను దడపదు. గాలి యీ యాత్మను శుష్కింపఁ జేయదు. (౨౩)

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్యఏవచ।
నిత్యస్సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః॥ ౨౪॥

కాఁబట్టి యే యాత్మ ఛేదింపఁబడఁ దగినవాఁడు కాఁడు; దహింపఁ బడఁ దగినవాఁడును కాఁడు; తడపఁ బడఁ దగినవాఁడును కాఁడు; శుష్కింపఁ బడఁ దగినవాఁడును కాఁడు; గనుకనే యీ యాత్మను త్రికాలములయం దుండువాఁడుగను, సర్వవ్యాపిగను, స్థిరమైనవాఁడుగను, చలన రహితుఁడుగను, ననాదియైన వాఁడుగను నగుచున్నాఁడు. (౨౪)



అవ్యక్తోఽయమచిన్త్యోఽయమవికార్యోఽయముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి॥ ౨౫॥

ఈ యాత్మ కన్నులచేఁజూడఁదగినవాఁడును కాఁడు; అశుద్ధ మనస్సుచేఁ దలంపఁదగినవాఁడును కాఁడు; వికారరహితుఁడు అనియు చెప్పఁబడుచున్నాఁడు. కాఁబట్టి పైఁజెప్పిన విధముగానాత్మను దెలిసికొని నీవు దుఃఖింపఁదగవు. (౨౫)

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్।
తథాఽపి త్వం మహాబాహో! నైనం శోచితుమర్హసి॥

ఒకప్పుడు నీ యాత్మను నడుగడుగునకుఁ బుట్టువానిగను మఱల మఱలఁ జచ్చువానిఁగను దలంచితివేని, ఓ జీవుఁడా! అప్పటికైనను నీవు దుఃఖింప నర్హుఁడవు కావు; ఏలననఁగా, రాత్రి నిద్రించి వేకువ జామున లేఁచువానివలె నీదినమున జచ్చి రేపు బుట్టువానింగూర్చి దుఃఖింప నేల? (౨౬)

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ।
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి॥ ౨౭॥

ఏ కారణమువల్లఁ బుట్టినవానికిఁ జావు నిశ్చయమో, సద్గురువును బొంది జ్ఞానముఁ జెందక, చచ్చినవానికి బుట్టుక నిశ్చయమో,

ఆ కారణమువలనఁ బరిహరింపఁగూడని యిట్టివిషయమును గూర్చి నీవు దుఃఖింపఁదగవు. (౨౭)

**అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత !**
**అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా? ॥ ౨౮॥**

సంసారమును దాటఁదగిన యో జీవుఁడా! (ఓయర్జునుఁడా!) ఈ కనఁబడుచుండు సమస్తరూపములును పుట్టుటకు ముందు కనఁబడని మాయలో లీనములై యుండినవి. పుట్టిన పిమ్మట పుత్ర, మిత్ర, కళత్ర, గురు, బంధు, ధన కనక, వస్తు, వాహనాదులుగాఁ గనఁబడుచున్న యవి. నశించిన పిమ్మటఁ గనఁబడని మాయలో లయమగుచున్నవి. మఱల నెచ్చటఁబోవునో, దెలియదు. అటువంటి యీ శరీరవిషయములో నీవు దుఃఖింపనేల? (౨౮)

**ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన**
**మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః!**
**ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతి**
**శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥ ౨౯॥**

ఒకానొకఁడీ యాత్మను నాశ్చర్యవస్తువువలెఁ జూచుచున్నాఁడు; వేఱొకఁడు నాశ్చర్యవస్తువువలెఁ జెప్పుచున్నాఁడు;



మఱియొకఁడాశ్చర్యవస్తువువలె వినుచున్నాఁడు. ఈ మువ్వురును నిజమును దెలిసికొన్నవారు గారు; ఏల ననిన, ఆత్మయింద్రియగోచరవస్తువు గాదు. (౨౯)

**దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।**
**తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి॥ ౩౦॥**

సంసార సముద్రమును దాటఁగల యో జీవుఁడా! (అర్జునుఁడా!) సకలప్రాణుల శరీరములు జంపఁబడినను, యీ యాత్మ యెప్పటికైనను జంపఁబడఁదగినది గాదు. ఆ కారణమువలననే నీవు క్రౌర్యము (భీష్ముఁడు) మొదలగువారిం గూర్చి దుఃఖింపఁదగవు. (౩౦)

**స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితుమర్హసి ।**
**ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే**

పైఁజెప్పఁబడిన ప్రకారము తత్త్వవిచారణచేసి, దుఃఖము నీవు పొందఁగూడదనునదిమాత్రము గాదు. స్వయముగానే నీవు క్షత్రియోపాధి గలవాఁడవు గావున, రాజులకు ధర్మకరమైన యుద్ధమునకంటె శ్రేయస్కరం బొండు లేదు. (౩౧)

**యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్ ।**
**సుఖినః క్షత్రియాః పార్థ! లభన్తే యుద్ధమీదృశమ్ ॥**

సంసారమునుండి యొడ్డెక్కఁగల యో జీవుఁడా! (అర్జునుఁడా!) నీవుగాఁ గోరక సంభవించినదియు, తెరవఁబడిన స్వర్గద్వారమువంటిదియు నగు నీయుద్ధము నేక్షత్రియోపాధులఁగల జీవులుపొందుచున్నారో, వారలిహపర సుఖము గలవారలగుదురు.

**అథచేత్త్వం ధర్మ్య మిమం సంగ్రామం న కరిష్యసి।**
**తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి॥౩౩॥**

క్షత్త్రియోపాధియందుండు నీకు ముఖ్యధర్మమగు నీయుద్ధమును నీ వొనర్పనియెడల, స్వధర్మత్యాగియని నిన్నందఱును నిందింతురు. ఇంతియగాక పరమాత్మతోఁ (శ్రీకృష్ణమూర్తి) జేరియుండు జీవుఁడు (అర్జునుఁడు) యెంతగొప్పవాఁడు, మహనీయుఁడు అనిం కొనియాడఁబడుచుండిన కీర్తియుఁ బోవును. అవి యెట్లుండిన నుండనిమ్ము. స్వధర్మపరిత్యాగముచే మీదు మిక్కిలి పాపము సంభవించును. అందువలన నిహమునం దపకీర్తిఁ జెందుదువు. పరమునందు సద్గతియు గలుగదు. (౩౩)

**అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్।**
**సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే॥ ౩౪॥**

ఇంతియగాక ప్రజలు నీశాశ్వతమైన యపకీర్తిని వాడుకొనుచుందురు. అనేకకాలముగా శౌర్యధైర్యాది గుణములచేఁ గొనియాడఁబడుచుఁ గీర్తినొందియున్నవానికిఁ గ్రొత్తగావచ్చిన యపకీర్తి మరణమునకన్న నోర్వఁగూడనిది; అనఁగా, మరణము తాత్కాలికా వేదనను గలుగఁజేయును. అపకీర్తి యన్ననో, సూర్యచంద్రాదులుండువఱకును బోవు. (౩౪)



**భయాద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః।**
**ఏషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్॥**

మఱియు కర్ణుఁ డనెడు మమత మొదలగువానితో యుద్ధముచేయలేక, యర్జునుఁడనెడు జీవుఁడు వెనుదీసినాఁడని, కామక్రోధాది దుర్గుణసైనికులు దలంతురే గాని, బంధువులను జంపుట గూడదను కనికరముతో వెనుక దీసినాఁడని తలంపరు; ఏల ననిన, యుద్ధముఁజేయవచ్చిన శూరుఁడు సేనలఁజూచినపిదప నేదోయొకవంకఁ బెట్టుకొని యుద్ధము చేయక, పిఱికితనముచేఁ బారిపోయినాఁడని, యిదివఱకు గొనియాడుచుండిన యా కౌరవులను నవివేకసైనికులు తలంచెదరు. గనుక నవమానము సంభవించునని నామనంబున మిక్కిలి వ్యసనము గలుగుచున్నది. (౩౫)

**అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః।**
**నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్॥ ౩౬॥**

సంసారమునుండి యెడ్డెక్కఁగల యో జీవుఁడా! (అర్జునుఁడా!) నీవుగాఁ గోరక సంభవించినదియు, తెరవఁబడిన స్వర్గద్వారమువంటిదియు నగు నీయుద్ధము నేక్షత్రియోపాధులఁగల జీవులుపొందుచున్నారో, వార లిహపర సుఖము గలవారలగుదురు. ()

అథ చే త్త్వం ధర్మ్య మిమం సంగ్రామం న కరిష్యసి।
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి॥33॥

క్షత్త్రియోపాధియందుండు నీకు ముఖ్యధర్మమగు నీయుద్ధము ను నీ వొనర్పనియెడల, స్వధర్మత్యాగియని నిన్నందఱును నిందింతురు. ఇంతియగాక పరమాత్మతోఁ (శ్రీకృష్ణమూర్తి) జేరియుండు జీవుఁడు (అర్జునుఁడు) యెంతగొప్పవాఁడు, మహనీయుఁడు అని కొనియాడఁబడుచుండిన కీర్తియుఁ బోవును. అవి యెట్లుండిన నుండనిమ్ము. స్వధర్మపరిత్యాగముచే మీదు మిక్కిలి పాపము సంభవించును; అందువలన నిహమునం దపకీర్తిఁ జెందుదువు. పరమునందు సద్గతియు గలుగదు. (33)

అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్।
సమ్భావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే॥ 3౪॥

ఇంతియగాక ప్రజలు నీశాశ్వతమైన యపకీర్తిని వాడుకొనుచుందురు. అనేకకాలముగా శౌర్యధైర్యాది గుణములచేఁ గొనియాడఁ



బడుచుఁ గీర్తినొందియున్నవానికిఁ గ్రొత్తగావచ్చిన యపకీర్తి మరణమునకన్న నెూర్వఁ గూడనిది; అనఁగా, మరణము తాత్కాలికావేదనను గలుగఁ జేయును. అపకీర్తి యన్ననో, సూర్యచంద్రాదులుండువఱకును బోవు. (3౪)

భయాద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః।
ఏషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్

మఱియు కర్ణుఁ డనెడు మమత మొదలగువానితో యుద్ధముచేయలేక, యర్జునుఁడనెడు జీవుఁడు వేనుదీసినాఁడని, కామక్రోధాది దుర్గుణసైనికులు దలంతురేగాని, బంధువులను జంపుట గూడదను కనికరముతో వెనుక దీసినాఁడని తలంపరు; ఏల ననిన, యుద్ధముఁజేయవచ్చిన శూరుఁడు నేనలఁజూచినపిదప నేదోయొకవంకఁబెట్టుకొని యుద్ధము చేయక, పిఱికితనముచేఁ బారిపోయినాఁడని, యిదివఱకు గొనియాడుచుండిన యా కౌరవులను నవివేకసైనికులు తలంచెదరు. గనుక నవమానము సంభవించునని నామనంబున మిక్కిలి వ్యసనము గలుగుచున్నది. (3౫)

అవాచ్యవాదాం శ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః।
నిన్దన్తస్తవసామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్॥ 3౬॥

నీయొక్క శత్రువులగు నవివేకాదులు నీయొక్క సామర్థ్యమును నిందించువారలై యనేకములైన, నోటితోవచింప శక్యములు గాని పలుకులఁ బలుకుదురు. అంతకన్న నధికదుఃఖకరమైనది నీకును, నాకును మఱియొక్కటియు లేదు. (౩౬)

**హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్।**
**తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ! యుద్ధాయ కృతనిశ్చయః॥ ౩౭॥**

మూలప్రకృతిసంతతిలోని వాఁడవగు నో జీవుఁడా! (అర్జునుఁడా!) నీయొక్క శత్రువులగు కామక్రోధాదులవల్లఁ జేయఁదగిన కామ్యకర్మముచేఁ జయింపఁబడిన యెడల, స్వర్గాది లోకములఁ జెందవచ్చును. శత్రువుల నీవు జయించినయెడల, మోక్షసామ్రాజ్యము బొందవచ్చును. ఈ రెండు తెఱంగులును నీకు లాభమే కదా? కనుక ముందువెనుక నాలోచింపక యుద్ధమునకు లెమ్ము. (౩౭)

**సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।**
**తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి॥ ౩౮॥**

యుద్ధమే స్వధర్మముగా నెంచియుద్ధము చేయవలసిననీకు నీ విషయమందు, నీవు తెలిసికొనవలసిన కొన్నియంశములను జెప్పెద; వినుము. సుఖదుఃఖములకుఁ గారణమగు రాగద్వేషాదులఁ జెందక,



లాభాలాభముల నెంచక, జయాపజయములు మనవి కావను నిరభిమానముతో యుద్ధము చేసితివేని, నిన్నే పాపములు వెంబడించవు.

**ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు।**
**బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబన్ధం ప్రహాస్యసి॥ ౩౯॥**

ఓ జీవుఁడా! (అర్జునా!) ఇదివరకు జీవాత్మ పరమాత్మలయొక్క విషయముగా నీకుఁ జెప్పఁబడినది. ఎట్టివివేకముతోఁ గూడినవాఁడవైనయెడల కర్మబంధమును బోఁగొట్టుకొనఁగలదువో, అట్టియాత్మతత్త్వజ్ఞానసాధన మగు నిష్కామకర్మయోగ విషయమై యికఁ జెప్పఁబోవుబుద్ధిని వినుము. (౩౯)

**నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।**
**స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥ ౪౦॥**

ఫలాపేక్షను వదలి భగవదర్పణముగాఁ జేయఁబడు నీ నిష్కామకర్మయోగముయొక్క ప్రారంభ మప్రయోజకము గానేరదు. ఒకప్పుడు మధ్యలో నీకర్మమునకుఁ గించిల్లోపము సంభవించినను, దోషము లేదు. ఇట్లుచేయఁబడిన నిష్కామకర్మము స్వల్పమైనను నేది జనన, మరణ ప్రవాహరూపమైన భయమునుండి విడిపించును.

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన! ।
బహుశాఖాహ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥

అవిద్యచేఁ గలిగిన యో శ్రేష్ఠుఁడగు జీవుఁడా! (అర్జునా!) ఈనిష్కామకర్మముచే (భగవద్భక్తిచే) నీసంసారమను సాగరమును దాఁటుదునను నిశ్చయమే స్వరూపముగాఁగల బుద్ధి (మార్గము) యొక్కటియే యగును. భగవద్భక్తి లేక కామ్యకర్మమునే చేయ నిశ్చయించుకొనియుండు నవివేకులయొక్క బుద్ధియో, యనేక శాఖలు గలదిగాను, గనుకనే యనేకములుగాను నున్నవి. (౪౧)

యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః ।
వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతివాదినః॥ ౪౨॥
కామాత్మానస్స్వర్గపరాః జన్మకర్మఫలప్రదామ్।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥ ౪౩॥
భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ నవిధీయతే॥ ౪౪॥

ఓజీవుఁడా! (అర్జునా!) వేదములలోని ఫలములను గురించి చెప్పు నట్టివాదమందు మిక్కిలి ప్రీతిగలవారును, కామ్యకర్మమున కన్న



వేఱు పురుషార్థసాధనములేదని చెప్పువారును, దారేషణ, పుత్రైషణ, విత్తేషణలచేతను కోరికలచేతను నిండిన మనస్సు గలవారును, స్వర్గమే యన్నిటి కన్న శ్రేష్ఠమైన పురుషార్థముగఁ దలఁచియుండు వారునగు తత్త్వముల నెఱుంగని యల్పబుద్ధిగల యేయవివేకులు, జననమును, కర్మమును, కర్మఫలములను నివ్వఁదగినవియు, నైశ్వర్యమును, భోగమును బొందుట కనేకకర్మభేదములఁ గలవియు, ఫలముల నివ్వక చూచుటకుమాత్రము అందముగాఁ దోఁచు, పూఁచునట్టి చెట్టువలె వినుటకు డంభముగాఁగనఁబడఁదగిన స్వర్గాదులనెడు నల్పఫలము నిచ్చునవియు నగు మోసపుచ్చు మాటలఁజెప్పుచున్నారో, అట్టివచనములచేత నపహరింపఁబడిన మనస్సుగలవారును, నీప్రపంచసుఖానుభవమునందును, నైశ్వర్యానుభవమునందును, నాశగలవారును నగువారికి, నిశ్చలమగు బుద్ధి చిత్తైకాగ్రత యనెడునిష్ఠలో నుండదు. అనఁగా నట్టివారలకు నిష్ఠయనునదియే లేదు. ౪౨।౪౩।౪౪,

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున! ।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥ ౪౫॥

స్వర్గాదులు గర్మఫలములు గానియెడల వేదములచేఁ దత్ఫలము లేల చెప్పఁబడియున్న వనియడిగెద వేమో వినుము జీవుఁడా! (అర్జునా!) ఎవని కెంతెంత యోగ్యతగలదో, దానికి దగినట్టు సత్త్వ

రజ, స్తమోగుణములతో సంబంధించిన కామ్యఫలములను వేదముల యొక్క పూర్వభాగములు చెప్పుచున్నవి. నీవు వానియందు మనస్సు జొరఁబడ నియ్యకుము. వేదాంత భాగములయందు (ఉపనిషత్తుల యందు) నీమనస్సు జొరఁబడునట్లుచేసి, నిత్య శుద్ధ సత్త్వ స్వభావము గలవాఁడవై సద్గురువును జెంది జ్ఞానమును బొందిన పిదప త్రిగుణాతీతుఁడవుగాను, సుఖాసుఖ లాభాలాభ జయాపజయాది ద్వంద్వ రహితుఁడవుగాను, యోగక్షేమ చింతన లేని వాఁడవుగాను కమ్ము. (౪౫)

యావా నర్థఉదపానే సర్వత స్సంప్లుతోదకే।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥ ౪౬॥

స్నానపానాదులకు మాత్రమున కుపయోగముగాఁగల కొంచెపు నీరుమాత్రముండెడి బావివలన నెంత ప్రయోజనమో, అంత ప్రయోజనమును, దాని కనేకరెట్లధికములైన ప్రయోజనములు, విశాలమగు తటాకమువలనఁగలుగు ననునది ప్రసిద్ధము. అటులనే వేదోక్తములగు సకలకర్మముల ననుష్ఠించుటవలన నెంతఫలముగలదో, అంత ఫలమును, తదుపరి యనేకరెట్లధికముగాఁగల ఫలమును నాత్మస్వరూప నిశ్చయానుభవముగల బ్రహ్మజ్ఞాననిష్ఠునికిఁగలుగునని తెలిసికొనుము.



కర్మణ్యేవాధికార స్తే మా ఫలేషు కదాచన।
మాకర్మ ఫలహేతు ర్భూః మా తే సఙ్గోఽ స్త్వకర్మణి॥

నీయొక్క స్థితిని బట్టి చూడఁగా నీకు కర్మములనాచరించుటలోనే యధికారముగలదు. కర్మఫలములయెడల నీకుఁ గొంచెమైన స్వాతంత్ర్యము లేదు. అనఁగా గర్మఫలము నపేక్షింపకుము. కర్మఫలములయందు పేరాశ గలవాఁడుగమాత్రము కాకయుండుము. ఫలముల నిచ్ఛయించఁగూడదని నందువలన, ఫలమును గోరనికర్మము మనకేలయని కర్మమును విడిచిపెట్టుటలో నభిలాష గలవాఁడవుగా నుండకుము. (౪౭)

యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వాధనఞ్జయ!।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥

ఆశను జయింపఁదగిన యో జీవుఁడా! (అర్జునుఁడా!) నీవు సకలమును భగవదర్పణము లనునిశ్చయము గలవాఁడవై, నేను, నాది, యనెడు నహంకార మమకారస్వరూప మగు నభిమానమునువిడిచి, నిష్కామకర్మానుష్ఠానముచే బ్రహ్మజ్ఞాన మను ఫలము గలిగినను గలుగక పోయినను సమబుద్ధి గలవాఁడవై నీకుగలవర్ణాశ్రమ విహితకర్మములను జేయుము. తత్ఫలము గలిగినను, గలుగక పోయినను, సమముగా నుండు మనోధైర్యమే యోగ మనఁబడును. (౪౮)

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనఞ్జయ! ।
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥ ౪౯॥

ఓజీవుఁడా! (అర్జునా!) భగవ దర్పణముగాఁ జేయునిష్కామ కర్మమున కన్న ఫలములం గోరిచేయు కామ్యకర్మము మిక్కిలి నిందితమైనది. కాఁబట్టి నిష్కామబుద్ధియందుఁ గాని, లేక, తత్పరిపాకమువలనఁ గలుగు సాంఖ్యయోగ మనెడు కర్మసాక్షిత్వబుద్ధియందుఁ గాని, నీమనసు ప్రవేశించి, భయరహితముగ నుండఁదగిన స్థితిని బొందునట్లు భగవంతునిఁ బ్రార్థించుకొనుము. ఫలములం గోరి కర్మములఁ జేయువారలు జననమరణాధి దుఃఖపరంపర నెడతెగక చెందఁదగినలోభులు సుమీ. (౪౯)

బుద్ధియుక్తోజహాతీహ ఉభేసుకృతదుష్కృతే।
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥

సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాఁడు, (పుణ్యము ను, పాపమువలె జనన మరణాది దుఃఖములఁగలుగఁ జేయునదిగావున, జ్ఞానులెట్లు పాపఫలముల నపేక్షింపరో, అట్లు పుణ్యఫలముల నపేక్షింపరు గావున, నట్టి) పుణ్యపాపముల రెండింటిని యీ జన్మమందే విడిచిపెట్టును. ఆకారణమువలన నిష్కామకర్మ యోగముకొఱకే ప్రయత్నము చేయుముగాక. తనయొక్కవర్ణా శ్రమకర్మము



లయందు సమబుద్ధిచే బంధ స్వరూపములైన కామ్యకర్మములయందుండి మనసును ద్రిప్పుకొనఁ గలసామర్థ్యమే యోగమని చెప్పఁబడును. (౫౦)

కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మ బన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్॥ ౫౧

సుఖదుఃఖములయందు సమబుద్ధిగల నిష్కామ కర్మయోగులు కర్మములఁ జేయుటచే గలుగుఫలముల నపేక్షింపక, విషయవాసలను విడిచి, చలింపనిజ్ఞానము గలవారలై, చెరసాలలోనుండి విడువఁబడినవానివలే, జన్మ మనెడి బంధములనుండి విడువఁబడి, సమస్త దుఃఖశూన్యమైనమోక్ష మగు పరమ స్థానమును బొందుదురు. (౫౧)

యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి।
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ। ౫౨॥

ఎప్పుడు నీయొక్కబుద్ధి, దేహమేయాత్మయను నజ్ఞానరూపదోషమును దాఁటి, బ్రహ్మస్వరూపానుభవసిద్ధింబొందునో, అప్పుడు వినఁదగిన వేదాంతార్థములయందును, వినిన వేదాంతార్థములయందును, వైరాగ్యమును బొందఁగాత. అనఁగా, నటుపిమ్మట వేదాంత శ్రవణముతోఁబనిలేదనుట. (౫౨)

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి॥౫౩॥

అనేక విధ శ్రవణాదులచేఁ గలఁతఁ జెందియుండెడి నీయొక్క యంతఃకరణము సద్గురూపదేశమును జెంది తత్ప్రకారమనుష్ఠించి చలింపని యాత్మైక్యానుసంధానరూప మగు ధ్యానమందు విషయ ప్రవృత్తిలేనిదై, స్థిరముగా నిలిచి పోవునో, అప్పుడు నిష్కామ కర్మయోగము యొక్క ఫలమగు తత్త్వజ్ఞానరూపమైన జీవన్ముక్తి స్థితినిఁ బొందఁగలవు. (౫౩)

అర్జున ఉవాచ.

స్థితప్రజ్ఞస్య కా భాషా? సమాధిస్థస్య కేశవ! ।
స్థితధీః కిం ప్రభాషేత? కి మాసీత? వ్రజేతకిమ్? ॥ ౫౪॥

జ్ఞానమును సంపాదింపఁదగిన జీవుఁడు (అర్జునుఁడు)
ప్రశ్న చేయునదేమనఁగా.

బ్రహ్మ, విష్ణు, శివాత్మక మగు ఓపరమాత్మా! (శ్రీకృష్ణమూర్తి!) పైనఁ జెప్పఁబడిన జీవన్ముక్తునియొక్క లక్షణ మెట్టిది? భగవంతుని యందు నియమింపఁబడిన మనస్సుగల పురుషుఁడు మనవలె మాటలాడుచుండునా? లేక, వేఱుగా నుండునా? అట్టివాఁడేమి చేయుచుండును? వానినడత యెట్టిది? (౫౪)



శ్రీభగవానువాచ.

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥ ౫౫॥

పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) చెప్పునదేమనఁగా.

ఓజీవుఁడా! (అర్జునుఁడా!) స్థితప్రజ్ఞలక్షణములఁ జెప్పెద, వినుము. ఎవ్వఁడెప్పుడు మనస్సునందుండునట్టి యన్నికోరికలను (కామక్రోధాదులను) విడిచిపెట్టునో, పంచకోశవిలక్షణుండుగను, అవస్థాత్రయ సాక్షిగను అసంగ సచ్చిదానంద రూపుఁడుగను నుండు తన్నుఁ దనయొక్క శుద్ధాంతఃకరణమువలనఁ దాను దెలుసుకొని సదానందమున మునిఁగినవాఁడగునో, అప్పుడు స్థితప్రజ్ఞుఁడని (నిశ్చలజ్ఞానముగలవాఁడని) చెప్పఁబడును. (౫౫)

దుఃఖే ష్వనుద్విగ్న మనాః సుఖేషు విగతస్పృహః।
వీతరాగభయక్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే॥ ౫౬॥

ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవములనెడు దుఃఖములచే క్షోభము నొందని మనస్సుగలవాఁడును, ఇహపరసుఖములయం దాశ

లేనివాఁడును, ప్రీతి, భయము, కోపము మొదలగునవి లేనివాఁడును, భగవద్విషయముగా నెల్లప్పుడు మననముచేయువాఁడును నెవ్వఁడో, వాఁడే, స్థితప్రజ్ఞుఁడని చెప్పఁబడును. (౫౬)

**యస్సర్వత్రానభిస్నేహః తత్తత్ప్రాప్య శుభాశుభమ్।**
**నాభినన్దతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ ౫౭॥**

ఎవ్వఁడు తనయొక్క శరీరము మొదలుకొని పుత్త్ర, మిత్ర, కళత్రాది సమస్తములోను నభిమానములేనివాఁడో, మంచిది సంభవించినప్పుడు సంతోషమును, చెడువు సంభవించినప్పుడు దుఃఖమును నెవ్వఁడుపొందఁడో, అట్టివానియొక్క వివేకము (జ్ఞానము) స్థిరమైనదని చెప్పఁబడును. (౫౭)

**యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః**
**ఇంద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్యప్రజ్ఞాప్రతిష్ఠితా॥ ౫౮॥**

తాఁబేలు తనయొక్కతలను, కాళ్ళను, ఎట్లుముడుచుకొనునో, అట్లుజ్ఞాననిష్ఠయందుఁ బ్రవృత్తిగలవాఁ డింద్రియములను సమస్త విషయప్రవృత్తులలోనుండి యెప్పుడు మఱలించుకొనునో, అప్పుడట్టి జ్ఞానియొక్క వివేకమే (జ్ఞానము) మిక్కిలి స్థిరమైనదిగాఁ జెప్పఁబడును. (౫౮)



**విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః।**
**రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥ ౫౯॥**

ఇంద్రియములను విషయములలోఁ బ్రవర్తింపనీయక విషయవైరాగ్యముగల జీవునికి విషయవాసన దప్ప ఇంద్రియములచేఁ గలుగు విషయానురాగము లన్నియు నిలిచి పోవును. పరబ్రహ్మస్వరూపమును గురు శాస్త్రోపదేశానుభవములచే దెలిసికొనిన పిదప, నీ స్థిరప్రజ్ఞునికి విషయవాసనగూడ నివర్తించును. (౫౯)

**యతతో హ్యపి కౌన్తేయ! పురుషస్య విపశ్చితః॥**
**ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥ ౬౦॥**

మూల ప్రకృతిసంతతియగు ఓ జీవుఁడా! (అర్జునా!) జననమరణ ప్రవాహములోఁ జిక్కి దుఃఖముఁ బొందియుండువాఁడు గనుకనే, అందునుండిదరిచేరి మోక్షమును బొందవలయుననెడి నిశ్చయప్రయత్నముచేయువాఁడును, ఆత్మానాత్మవివేకము గలిగిన వాఁడునునగు వివేకియొక్కమనస్సునుగూడ భగవంతునియందు నిలువనీయకచేనెడి యింద్రియములు బలాత్కారముగా విషయములయందుఁ బ్రవర్తింపఁజేయుచున్నవనునది యనుభవసిద్ధము. (౬౦)

**తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।**
**వశేహి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ ౬౧॥**

కనుక నట్టివిషయములలో నీడ్చుకొనిపోవు సకలేంద్రియములను గుర్వాజ్ఞవలన స్వాధీనముచేసికొని, నిష్ఠను బొందినవాఁడుగాను, బహిర్ముఖసమయమందు సమస్తమును "బ్రహ్మ" (భగవత్) స్వరూపమగుటంజేసి, 'నేనును నందుఁజేరినవాఁడనే' యని దేహాత్మబుద్ధిఁ దొలఁగించి, అహంకార మమకారముల విడనాడి, యెల్లప్పుడు భగవంతునియందు మనస్సు నిలిపినవాఁడుగ నుండవలయును. ఇవ్విధముగా నెవ్వనియొక్క యింద్రియములు స్వవశములై యుండునో, అట్టివానియొక్క జ్ఞానముగదా యభ్యాసబలముచే మిక్కిలి స్థిరమైన దగును. (౬౧)

**ధ్యాయతో విషయాన్ పుంస స్సఙ్గ స్తేషూపజాయతే।**
**సఙ్గా త్సఞ్జాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥**

ప్రపంచమునందుండు వస్తువులను దలంచుటవలన జీవునికి నట్టివిషయములయందుఁ బ్రేమగలుగుచున్నది; విషయాసక్తివలన నాశ గలుగును; తా నాశపడిన వస్తువుమీఁద మఱియొక్కఁ డాశపడినను, లేక, ఆ వస్తువు తనకుఁగిట్టకుండునట్లడ్డము వచ్చినను అట్లడ్డము వచ్చినవానిమీఁద నీ యాశ క్రోధముగాఁ బరిణమించును. (౬౨)

**క్రోధాత్ భవతి సంమోహః సంమోహాత్స్మృతివిభ్రమః।**
**స్మృతిభ్రంశా ద్బుద్ధి నాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి-౬౩॥**



ఆ క్రోధమే, తనయొక్క శరీరము తనకుఁదెలియకుండఁజేయునట్టి మోహమైన యవివేకముగాఁ బరిణమించును; అవివేకమే, గురూపదేశమువలనఁ దెలిసికొనిన సన్మార్గమునుండి దొలంగించెడి మఱుపుగాఁ బరిణమించును. ఆ మఱుపే, కార్యాకార్యవివేకమునకు యోగ్యమైన ప్రజ్ఞకాధారమగు నంతఃకరణమును జెడుపును; అంతఃకరణము చెడుటవలన పరమపురుషార్థమైన భగవంతునియొక్క జ్ఞాపకమే రాకుండ ప్రపంచవిషయాభిముఖుఁడై యెందుకు పనికిరాక చెడిపోవును. (౬౩)

**రాగద్వేషవియుక్తై స్తు విషయా నిన్ద్రియైశ్చరన్।**
**ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి॥** ౬౪

ప్రియాప్రియ రహితములైనవియు, స్వాధీనములైనవియు నగు నింద్రియములచే శరీరధారణ మాత్రమునకుఁ దగిన యన్నపానాదులను (ఇఁకను నిదియు నివర్తించలేదే యని) అనుభవించువాఁడుగ నుండినను, స్వాధీనమైన మనస్సుగలవాఁడు మనస్సమాధానమును (మనసు యెల్లప్పుడు భగవంతునియందే యుండుస్థితిని) బొందుచున్నాఁడు. (౬౪)

**ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే।**
**ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి॥** ౬౫

మనస్సమాధానము గలిగిన పిమ్మట యీనిశ్చయజ్ఞానియొక్క సమస్తదుఃఖములును, నాశమును బొందును. శుద్ధమైన మనస్సుగల వానికి శీఘ్రముగా భగవంతునియందే నిలుకడగలబుద్ధి స్థిరముగాఁ గలుగును అనఁగా:—ఆకాశమెట్లు వ్యాపకముగను, స్థిరముగను నున్నదో, అట్లు యీస్థిరప్రజ్ఞునియొక్క చిత్తము, అఖండ బ్రహ్మాకారస్థితిగలదిగ నిలుచును. (౬౫)

నాస్తి బుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా।
నచాభావయత శ్శాన్తి రశాన్తస్య కుతః సుఖమ్?॥ ౬౬॥

ఇంద్రియ నిగ్రహము లేనివానికి నాత్మానాత్మ వివేకము గలుగదు; ఆత్మానాత్మ వివేకములేనివానికి నిశ్చయజ్ఞానము గలుగదు; నిశ్చయజ్ఞానములేనివానికి విషయ వాసనరహితమైన చిత్తసమాధానము గలుగదు; విషయ వాసనారహితమగు చిత్త సమాధానములేనివానికి సుఖమెక్కడిది? (౬౬)

ఇన్ద్రియాణాం హిచరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివామ్భసి॥ ౬౭॥

విషయములలో బ్రవర్తించెడి యింద్రియములలో నేయింద్రియమును మనస్సనుసరించి వెళ్లునో, అట్టి మనస్సు ఈ పురుషుని



యొక్క యాత్మానాత్మ వివేకమును జెడుపును. ఎట్లు నీటిమీఁద నుండునట్టి యోడను గాలి తనయిచ్ఛవచ్చినచోటికిఁ దీసుకొనిపోవునో, అట్టు యీ సంసారమనెడు సముద్రమునందు మనస్సనెడి యోడను, విషయవాసన యనెడి గాలి తనకిష్టమైన యపమార్గములయందీడ్చుకొనిపోవునది ప్రసిద్ధము. (౬౭)

తస్మా ద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥౬౮॥

శత్రువులజయించెడి యో జీవుఁడా! (అర్జునా!) ఇంద్రియము లిట్టిదుర్మార్గప్రవృత్తి గలవి గావున, ఎవనియొక్క మనస్సు మొదలగు నింద్రియములు విషయములనుండి త్రిప్పంబడునో, వాని యొక్క జ్ఞానముమిక్కిలి స్థిరమైనదని చెప్పఁబడును. (౬౮)

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తిసంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సానిశాపశ్యతో మునేః॥౬౯॥

అట్టి యింద్రియమనో నిగ్రహముగలవారలకును, సామాన్యులైన మనుజులకుఁ గల వ్యత్యాసము చెప్పెద, వినుము. రాక్షసుల వలె నవివేకమును బొందియుండు సకలప్రాణులకును నేబ్రహ్మనిష్ఠ, తెలిసికొన నందున రాత్రివలె నప్రకాశముగానుండునట్టి యవివేక

నిద్ర యగునో, ఆబ్రహ్మనిష్ఠలో నింద్రియనిగ్రహము గల వివేకి, గురూపదేశ శ్రవణ మనన నిదిధ్యాసనములయొక్క యనుభవముచేఁ గలిగిన నిష్ఠవలన నాత్మానుభవమగు జాగ్రదవస్థయం దుండును. అహంకారము, అభిమానము మొదలగునవి గల యేజాగ్రదవస్థయం దు నవివేకులు విషయాసక్తులై ప్రవర్తించుచుందురో, అట్టి జాగరావస్థ, యాత్మ స్వరూపదర్శియగు నాత్మైక్యానుసంధానముగల జ్ఞానికి దృశ్యప్రపంచ మంతయు నవిద్యాస్వరూపమగుటంజేసి రాత్రివలె నప్రకాశముగ నుండును. అనఁగా, విషయస్ఫూర్తి రహితమై యుండును. (౬౯)

**ఆపూర్యమాణ మచలప్రతిష్ఠమ్ సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్ । తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే సశాన్తి మాప్నోతి న కామకామీ॥ ౭౦॥**

ఉదకముచే నిండినదియు, గట్టుదాఁటఁగూడనిదియు నగు సముద్రమును, ప్రవాహముగల నదులు మొదలయినవి ప్రవేశించి యెట్లు నామరూపములు లేనివగునో, అట్లు సకలకామక్రోధాదులును, కోరికలును, సంపూర్ణమైన బ్రహ్మైక్యాను సంధానము గలిగినవాఁడును, భగవద్ధ్యానమందు నిశ్చలస్థితిగలవాఁడును నగు నేబ్రహ్మనిష్ఠునిఁ జెంది



నామరూపరహితము లగునో, అట్టిబ్రహ్మనిష్ఠుఁడు, విషయవృత్తిరూపమైన మోక్షమును బొందును. విషయాసక్తిగల సంసారి మోక్షము నెప్పటికైన బొందఁజాలఁడు. (౭౦)

**విహాయకామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతినిస్పృహః నిర్మమో నిరహఙ్కార స్స శాన్తిమధిగచ్ఛతి॥ ౭౧॥**

ఎవ్వఁడు సకలవిషయముల విడిచి కించి దభిలాషయుగూడ లేనివాఁడును, తనయొక్క శరీరమునందుఁగాని తనశరీర సంరక్షణార్థము గ్రహించుపదార్థములయందుఁగాని, అహంకార మమకారాభిమానములు లేనివాఁడును, 'నేను బ్రహ్మనిష్ఠ చేయుచున్నానను నావలె నిష్ఠలో నుండ నెవ్వరికిఁ దగును? అను నీ మొదలగు నహంకారములు లేనివాఁడును, 'నే నీ క్షేత్రయాత్ర తీర్థయాత్ర వెళ్ళవలయు నను నదిలేక, ప్రారబ్ధానుసారముగ సంచరించుచుండువాఁడును నెవ్వఁడో, అట్టివాఁడు సకలదుఃఖనివృత్తమగు మోక్షమును బొందును. (౭౧)

**ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి। స్థిత్వాఽస్యామంత కాలేఽపి బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి॥**

సంసారమును దాఁటఁదగిన యో జీవుఁడా ! (అర్జునా !) ఇది వఱకుఁ జెప్పఁ బడినదే బ్రహ్మజ్ఞాననిష్ఠావివరము. ఇట్టి బ్రహ్మజ్ఞాన

నిష్ఠను బొందినజ్ఞాని మోహమును జెందఁడు. అంత్యకాలమునం దుఁగూడ నీ బ్రహ్మజ్ఞాననిష్ఠలోనుండిన యెడలఁదప్పక మోక్షము నొంధిచును. (౭౨)

ఇట్లు సాంఖ్యయోగశ్రవణమనఁబడు

రెండవయధ్యాయము

ముగిసెను.

బ్రహ్మార్పణమస్తు.

ఓం, తత్, సత్

---



ఓమ్.

శ్రీరస్తు.

## మూడవయధ్యాయము.

కర్మ శ్రవణి విషరముంగూర్చి చెప్పనట్టి యధ్యాయము.

అర్జునఉవాచ.

**జ్యాయసీ చే త్కర్మణ స్తే మతా బుద్ధిర్జనార్దన!!**
**త త్కింకర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ!!౧!!**

జీవాత్మ (అర్జునుఁడు) ప్రశ్న చేయుచున్నాఁడు.

ఓపరమాత్మా! (శ్రీకృష్ణమూర్తీ!) రెండవయధ్యాయము యేఁబదియైదవ శ్లోకము మొదలుకొని డెబ్బదిరెండవ శ్లోకమువఱకును నివృత్తిమార్గమునుగూర్చి యుపదేశించితివి. రెండవయధ్యాయము నలువదియేడవ శ్లోకములచేతను, మఱికొన్ని శ్లోకములచేతను, ప్రవృత్తిమార్గముందెలియపరచితివి. ఈప్రవృత్తిమార్గముచే మోక్షముసిద్ధించునని నీవుచెప్పలేదు. నివృత్తిమార్గముచేతనే మోక్షప్రాప్తి యగునని చెప్పి, ఓపరమాత్మా! (శ్రీకృష్ణమూర్తీ!) యిప్పుడునన్నుఁ బ్రాణి

హింసారూపమైన కర్మమగుయుద్ధమునం దేల ప్రవర్తింపఁజేయు చున్నావు. (౧)

వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే
తదేకంవదనిశ్చిత్యయేన శ్రేయోఽహమాప్నుయామ్॥ ౨॥

మనస్సును కలఁతపెట్టునదగు నీయొక్కవాక్యములచే నాబుద్ధిని మోహింపఁజేయు నట్లున్నావు. అట్లుకాక కర్మముజ్ఞానము యీ రెండింటిలో దేనిచే నన్ని శ్రేయస్సులలో శ్రేష్ఠమగు మోక్షమును బొందుదునో, అట్టికర్మమునుగాని లేకజ్ఞానమునుగాని నీవే నిశ్చయించుకొని నాకుఁజెప్పుము. (౨)

శ్రీభగవానువాచ.

లోకేఽస్మిన్ద్వివిధానిష్ఠా పురాప్రోక్తామయాఽనఘ॥
జ్ఞానయోగేనసాఙ్ఖ్యానాం కర్మయోగేనయోగినామ్॥ ౩॥

పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) ప్రత్యుత్తరముచెప్పునదేమనగా:—

పాపరహితుఁడైన ఓ జీవుఁడా! (అర్జునా!) ఈ లోకములో మొట్టమొదట బ్రహ్మవిద్యాసంప్రదాయమును వెల్లడిచేసినప్పుడు తత్త్వవిచారణపూర్వకముగా బ్రహ్మనిష్ఠనుజెందఁ బ్రయత్నపడు



సాంఖ్యులకు జ్ఞానసిద్ధిం బొందునిమిత్తము చేయవలసిన తత్త్వవిచారణరూపమగు శ్రవణ మననాదులగు జ్ఞాన యోగాభ్యాసము వలనను, కర్మముల నాచరించి తన్మూలముగా చిత్తశుద్ధిని (నిర్మలమైన మనస్సును) జెంది, యావలతత్త్వవిచారణఁజేయ నిచ్ఛగల కర్మయోగులకు నిష్కామ కర్మయోగమువలనను ఈ రెండు తెఱంగులగు ననుష్ఠానక్రమములు నాచేజెప్పఁబడియున్నవి. (౩)

నకర్మణామనారమ్భాత్ నైష్కర్మ్యంపురుషోఽశ్నుతే।
నచ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥ ౪॥

మనుజుఁడు సకలపాపములఁ బోగొట్టి చిత్తశుద్ధిని గలిగించు నిష్ఠకు హేతువులగు సత్కర్మముల ననుష్ఠింపక పోవుటచే జ్ఞాననిష్ఠ వలనఁ గలుగు నాత్మానుభవమును బొందఁజాలఁడు. జ్ఞానికానివాఁడు కర్మములను విడుచుటమాత్రమువలన నిష్కామ కర్మసిద్ధి నెప్పటికిఁ బొందశక్తుఁడుగానేఱఁడు. (౪)

నహి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః॥ ౫॥

ఒకానొకఁడెటువంటి యవస్థలోను క్షణకాలమైనను కర్మమును జేయకుండుటకు శక్యముగాదుగదా? ఏలననఁగా ఇంద్రియనిగ్ర

కాము లేక యస్వతంత్రులైన యవివేకులగు నందఱిచేతను మాయచేఁ గలిగినట్టి యాశ, ద్వేషము, మొదలగు సాత్త్విక, రాజస, తామస గుణములవలన బుట్టిన కర చరణాది చేష్టారూపమగు కర్మము బలాత్కారముగాఁ జేయబడుచున్నది. (౫)

**కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।**
**ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే॥ ౬॥**

ఎవ్వఁడు వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలనఁబడు కర్మేంద్రియములను జక్కఁగా నణఁచి మనస్సుచే శబ్దాదివిషయములఁ జింతించువాఁడుగ నున్నాఁడో, వివేకములేనిమనస్సుగల యట్టి వాఁడు గపటాచారముగలవాఁడు (కర్మభ్రష్టుఁడు—కర్మములనువిడిచి, జ్ఞానివలె నటించువాఁడు) అని చెప్పఁబడుచున్నాఁడు. (౬)

**యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున!**
**కర్మేన్ద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే॥ ౭॥**

ఓ జీవుఁడా! (అర్జునా!) కాఁబట్టి యవివేకియగు నెవ్వఁడు జ్ఞానేంద్రియములను మనస్సుచే నిగ్రహించి వాక్కు మొదలగు కర్మేంద్రియములచేఁ జిత్తశుద్ధిని గలుగఁజేయు సత్కర్మములను ఫలాపేక్షలేక చేయఁ బ్రారంభించుచున్నాఁడో, అటువంటివాఁడు పైశ్లోక



మునఁ జెప్పఁబడిన కపటాచారవంతునికంటె నుత్తముఁడని చెప్పఁబడుచున్నాఁడు. (౭)

**నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః।**
**శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః॥ ౮॥**

వారివారి వర్ణాశ్రమములకుఁ దగినట్లు వేదములచే నియమింపఁబడియుండెడి సంధ్యావందనాది సత్కర్మములను జేయవలసినది. జ్ఞానమును బొందక కర్మమును మాత్రము చేయకుండుటకన్న చిత్తశుద్ధికొఱకుఁ గర్మముల నాచరించుట శ్రేష్ఠమేగదా?

జ్ఞానమును బొందక కర్మమును జేయకుండుటలోఁ దలంపుగల నీబోటివారలకుఁ గర్మరూపములగు భోజనమలజలవిసర్జనాదులయిన శరీరములు నిలుచుటకు సాధనములుగానుండు కార్యములుగూడ సిద్ధింపవు. (౮)

**యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః।**
**తదర్థంకర్మ కౌన్తేయ! ముక్తసంగ స్సమాచర॥ ౯॥**

మూలప్రకృతి సంతతిని జేరిన ఓ జీవుఁడా! (అర్జునుఁడా!) జ్ఞానయజ్ఞరూపమగు కర్మమునకంటె వేఱైన కామ్యకర్మమందుఁ బ్రవర్తించెడి జనులు గర్మముచేఁ గట్టఁబడుచున్నారు. గనుక జ్ఞాన

యజ్ఞరూపములయిన కర్మములను ఫలాపేక్షలేనివాఁడవై యతి భక్తితో నాచరింపుము. (౯)

సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్॥ ౧౦॥

అంతఃకరణ మటువంటియజ్ఞాదిసత్కర్మముల్లతోఁ గూడినబ్రాహ్మణాది (శమదమాది) సద్గుణములను సృష్ట్యాది కాలములయందు సృష్టించి, "యీసత్కర్మరూపములగు యజ్ఞాదులచేఁ బ్రజలను బుట్టించుఁడీ; ఈ యజ్ఞము (సత్కర్మము) మీకుఁ గోరినకోరికల నిచ్చుఁగాత" యని పలికెను. (౧౦)

దేవాన్ భావయతాఽనేన తే దేవా భావయన్తువః।
పరస్పరం భావయన్తః శ్రేయః పర మవాప్స్యథ॥ ౧౧॥

ఈయజ్ఞముచేఁ (సత్కర్మముచే) మీ రింద్రియముల నపమార్గములయందుఁ బ్రవర్తింపనీయక కాపాడుఁడీ. మిమ్ము నీయింద్రియములు గాపాడునుగాత. అనఁగా మీయిష్టప్రకారము ధ్యానకాలమునం దీయింద్రియములు మీవశమున నుండును. ఇట్లొకరికొకరు తోడ్పడువారలై యుండిన యెడల శ్రేష్ఠమైన మోక్షమును బొందఁగలరు. (౧౧)



ఇష్టా న్భోగా న్హి వో దేవాః దాస్యన్తే యజ్ఞభావితాః।
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేనఏవ సః॥౧౨॥

సత్కర్మములచేఁ బ్రవర్తిపఁజేయఁబడిన యింద్రియము లిష్టమైనయిహలోక సుఖములను మీ కిచ్చునుగదా? ఆ యింద్రియములచే సంపాదించి యివ్వంబడిన పదార్థముల నాయింద్రియముల కివ్వక ఆర్జించినద్రవ్యమును దానధర్మముల కుపయోగింపక, తాను ననుభవింపక, యెవ్వఁడు పాతిపెట్టి, లెక్కచేసుకొని చేసుకొనిసంతోషించునో, వాఁడింద్రియములచేఁ గష్టపడిసంపాదించిన దానిని యాయింద్రియములకు భోజనరూపముగాఁ బెట్టకయు, లేక సజాతీయములైయుండు సింద్రియములుగలసత్పురుషులకు సద్విషయములలో నుపయోగింపఁదగినసందర్భములలో నివ్వకయునుండుట వలన నితరులసొమ్మునపహరించిన దొంగయేయగును. (౧౨)

యజ్ఞశిష్టాశినః సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః।
భుఞ్జతే త్వఘం భుఞ్జ తే పాపాః యేపచ న్త్యాత్మ కారణాత్ ॥౧౩॥

సత్కర్మములను భగవదర్పితములుగఁజేసి మిగిలినయన్నమును భుజించెడిస్వభావముగల సత్పురుషులు సకలపాపములనుండి విడువఁబడుదురు. ఎవ్వరు సత్కర్మములను జేయకయు, భగవంతుని

దలఁచి యారాధింపకయు నిట్లారాధించి తానను భవింపకయు ద్రవ్యమును మూటగట్టి పెట్టుదురో వారుపాపములను ద్రవ్యమును మూటగట్టిన వారలగుదురు. (౧౩)

అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్న సంభవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః॥ ౧౪॥
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవం।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం॥ ౧౫॥
ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।
అఘాయురింద్రియారామో మోఘం పార్థ! సజీవతి॥ ౧౬॥

అవివేకముచేఁ బ్రాణులు (జన్మములు) కలుగును. అనేకములగు తలంపులచే (అస్థిరబుద్ధిచే) నవివేకముగలుగును. యజ్ఞమగుఫలాపేక్షచేత నస్థిరబుద్ధికలుగును. కర్మములచేత యజ్ఞమగుఫలాపేక్ష గలుగును. వేదమువలనఁ గర్మము గలుగును. కూటస్థబ్రహ్మవలన వేదములుగలుగును. ఈప్రపంచసుఖమందాశగలవాఁడు వేదముచేఁ గలిగినకర్మసమూహమగు సృష్టిచక్రమును ననుసరింపని యెడల, ఓజీవుఁడా! (అర్జునా!) వాఁడు పాపమయమగు జీవనము గలవాఁడుగనుని ంద్రియములకు లోఁబడినవాఁడుగను, విషయాశక్తిగలవాఁడుగనునగు



ను గావున, నిష్ప్రయోజనముగాఁ గాలముగడపినవాఁడగు నని తెలిసికొనుము. (౧౪, ౧౫, ౧౬)




యస్త్వాత్మరతిరేవస్యాదాత్మ తృప్తశ్చమానవః ।
ఆత్మన్యేవచసన్తుష్టః తస్యకార్యంనవిద్యతే॥ ౧౭॥

ఈప్రపంచమందాశలేనివాఁడెట్లుండునని యడిగెదవేమో, వినుము. ఓజీవుఁడా! (అర్జునా!) ఎవ్వఁడు సద్గురూపదేశముద్వారా తనయొక్క యంతర్యామియగు నాత్మను (భగవంతుని) దెలిసికొని అట్లు తెలిసికొన్నస్వానుభవమునందే యాసక్తిగలవాఁడును స్వానుభవమందుఁ దృప్తిగలవాఁడును, స్వానుభవమందు మగ్నుఁడై యానం

దించుచుండువాఁడు నెవ్వఁడో, అట్టిబ్రహ్మవేత్తకుఁ జేయవలసినది యొక్కటియు లేదు. (౧౭)

నైవ తస్య కృతే నార్థో నాకృ తేనేహ కశ్చన।
నచాస్య సర్వభూ తేషు కశ్చి దర్థవ్యపాశ్రయః॥ ౧౮॥

పైనఁజెప్పఁబడినబ్రహ్మ వేత్తకు నీప్రపంచమందుఁ గర్మను జేయుటచేఁగలుగు పుణ్యమనుప్రయోజనము గొంచెమైనను లేదు. కర్మమును జేయకుండుటచే దోషము గొంచెమైనను లేదు. ఈబ్రహ్మ వేత్తకు బ్రహ్మాదిమొదలుకొని స్థావరాంతముగల సకల భూతముల నేప్రయోజననిమిత్త మనుసరింపవలసినపనిలేదు. అట్లనుసరించి తెచ్చికొనఁదగినపదార్థము లేవియునులేవు. కాఁబట్టి కోరికలేవియులేవు. (౧౮)

తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర।
అసక్తో హ్యాచర న్కర్మ పర మాప్నోతి పూరుషః॥౧౯॥

జ్ఞానికిఁ గర్మాచరణ మనావశ్యకము. జ్ఞానము లేని నీబోటివానికిఁ గర్మమావశ్యకము. గనుక నీవుఫలాపేక్ష లేనివాఁడవై యెల్లప్పుడును జేయవలసిన వర్ణాశ్రమకర్మములను చేయుము; ఏలయనిన, సత్కర్మమును జేయు పురుషుఁడు పరంపరాక్రమమున మోక్షమును బొందును. (౧౯)



కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః।
లోకసఙ్గ్రహ మేవాపి సమ్పశ్య న్కర్తు మర్హసి॥ ౨౦॥

ఎప్పుడు నాత్మయందే యభిలాసగలదనెడు నిక్ష్వాకు వంశమందు, నిమిషమైన నాత్మనుమఱచుట లేదనెడి నిమియను రాజునకుఁ బుత్రుఁడునగు, ధ్యానమనెడి జనకుఁడు మొదలగువారు నిష్కామకర్మముచేతనే చిత్తశుద్ధిని, తద్ద్వారా జ్ఞానమును బొందిరిగదా? ఇప్పుడు నీ ప్రపంచరాజ్యాధిపతివి గనుక ఓజీవుఁడా! (అర్జునుఁడా!) జనులను దుర్మార్గప్రవర్తకులుఁ గాకుండఁజేయు ప్రయోజనముకొఱకైనను, కర్మమునుజేయటయందే యర్హుఁడవైయున్నాఁడవు.

య ద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే॥ ౨౧॥

పెద్దలుగానుండు వారు దేని నాచరించుదురో, దానినే యవివేకులగు సామాన్యజనులు నాచరించుదురు. పెద్దలేయేవేదశాస్త్రములఁ బ్రమాణముగఁ దలఁచియుందురో, దానినే పామరులును ప్రమాణములుగఁదలంచియుందురు. (౨౧)

న మే పార్థా! స్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥ ౨౨॥

ఓజీవుఁడా ! (అర్జునా !) సమస్తావాప్తుఁడగు (సకలములు నేనుగా నేయుండు) నాకుఁ జేయవలసినకర్మ మేదియు లేదు. దేవ, పితృ, మనుష్యలోకములలో నేనుబొందకయుండి యిఁకమీఁద గ్రొత్తగఁ బొందవలసిన వస్తువు లేవియు లేవు. అట్లుండియు నీకు సారథ్యము చేయుట మొదలగు కర్మములయందుఁ బ్రవర్తించుచునే యున్నాను.

**యదిహ్యహం నవర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః।**
**మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ ! సర్వశః॥ ౨౩॥**

ఓజీవుఁడా ! (అర్జునా !) నేనెప్పుడు జాగరూకుఁడనై కర్మమ్మును జేయక పోతి నేని, ప్రజ లన్నివిధముల నన్నే యనుసరించెదరుగదా?

**ఉత్సీదేయు రిమే లోకా నకుర్యాంకర్మ చేదహమ్।**
**సఙ్కరస్యచకర్తాస్యా ముపహన్యామిమాః ప్రజాః॥ ౨౪॥**

నేను సత్కర్మములను జేయకపోతి నేని, నన్నుఁజూచి, నావలెనే కర్మముల మాని జనులు కర్మభ్రష్టులగుదురు. వర్ణసంకరమునకు నేనే కారణమగుదును. కాఁబట్టివీరలను కులమునుండి చెడిపినవాఁడనగుదును. ఈవిధముగా నేను పర్యాలోచనచేసి యీప్రపంచమందు ధర్మమును స్థాపించుటకొఱకవతరించి యందుకుఁగావలసిన పనులను జేయు



చుండఁగా నాసంగతిని జక్కఁగాఁ దెలిసికొనని మూఢజనులు తప్పు తాత్పర్యపడి యపమార్గ ప్రవర్తకులయి చెడిపోవుచున్నారుగదా?

**సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత!।**
**కుర్యా ద్విద్వాం స్తథా సక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్॥**

ఓజీవుఁడా! (అర్జునుఁడా !) కాఁబట్టి:—ఆత్మజ్ఞానము లేనివారలు కర్మమందుఫలాపేక్షగలవారలై యెట్లు చేయుదురో, అట్లాత్మజ్ఞుఁడును ఫలాపేక్ష లేనివాఁడై ప్రజలనపమార్గములయందుఁబోకుండ నిలుపుట యనుప్రయోజనముకొఱకుఁ దాను సత్కర్మములఁ జేయవలయును.

**నబుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్।**
**జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్॥**

ఆత్మజ్ఞుఁడు కర్మాసక్తిగలవారలకా యాసక్తిని జెడఁగొట్టఁ గూడదు. అట్టివారియెదుటఁ దానునుకర్మాసక్తిగలవాఁడువలె కర్మముల నాచరించి,యితరుల నాచరింపఁజేయవలసినది. ఏలననిన, కర్మఫలమందాశగలవారలను, అందునముక్తిలేదు, కావుననిష్కామముగాఁ జేయుమనిగాని లేక, నిష్కామముగాఁ జేయువారిని, కర్మముచే మోక్షము లేదు గనుకకర్మమును విడిచిపెట్టవలసినదనిగాని చెప్పిన యెడల, కర్మఫలాశగలవారి బుద్ధియుచెడును నిష్కామ కర్మములను

జేయలేరు. కామ్యముతో జేరిన కర్మముల వదలిపెట్టును. అట్లే నిష్కామముగాఁ జేయువాఁడును జ్ఞాననిష్ఠయం దభ్యాసములేక పోవుటవలన మనసు నిష్ఠయందు నిలువదు. నిష్కామముగాఁ జేసి కొనుచుండిన ఫలమునుగూడ వదలిపెట్టును. గనుక నిట్లిరువురు నుభయ భ్రష్టులగుదురు. (౨౬)

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః।
అహఙ్కారవిమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే॥ ౨౭॥

మాయచేఁగలిగిన కార్యకరణరూపములగు నింద్రియములచేతను, వానియొక్క వికారములచేతను, నానావిధములుగాఁ జెప్పఁబడిన కర్మములచేతను, దేహమే తాననుతలంపువలన వివేకరాహిత్యమును బొందియుండు పురుషుఁడు, 'నేనుచేయుచున్నాననని' తలంచును.

తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః।
గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే॥ ౨౮॥

ఓ మహాబాహో! (అర్జునా!) ఇంద్రియములు శబ్దాదివిషయములలోఁ బ్రవర్తించుచున్నవని తెలిసికొని సత్త్వాది త్రిగుణములయొక్కయు వానివేఱుబడు కర్మములయొక్కయు, వ్యత్యాసమును జక్కఁగాఁ దెలిసికొనిన వివేకి యభిమానమును గాని, లేక, వానితో సంగమును గాని పొందఁడు. (౨౮)



ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు।
తానకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవిన్న విచాలయేత్॥ ౨౯॥

ఎవ్వారలు సత్త్వాదిగుణములచే మోహముఁజెంది యింద్రియ వ్యాపారములయం దభిమానముగలవారలగుదురో, యేమి తెలియని యటువంటి కామ్యకర్మిష్ఠులను, యన్నిటిని, దెలిసినవారలవలె నుండు వారలు, కర్మభ్రష్టులన్నుగఁ జేయఁగూడదు. (౨౯)

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥ 30॥

సకలసత్కర్మఫలంబుల నాకర్పించి, యజమానునిచే నేర్పరచఁబడిన పనులను భృత్యుఁడెట్లు మాఱుమాటలాడక, ఫలములయెడల మనస్సునుంచక చేయునో, అట్లు భగవంతునిచే వేదమూలముగా విహితములయిన కర్మములను జేసి, తత్ఫలములయెడల నపేక్ష లేనివాఁడవై, మమకారమును దొలగించి, జయాపజయములయందు మనస్సునుంచక యుద్ధముఁ జేయుము. (30)

యే మే మతమిదం నిత్యమనుతిష్ఠన్తి మానవాః।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః॥ 3౧॥

ఎవరు, ఫలాపేక్షనువిడిచి సత్కర్మములను చేయవలసినదనెడు నాయభిప్రాయముననుసరించి నాయొక్క వాక్యములయందు విశ్వాసముగలవారలుగను, "ఇతఁడుదుఃఖమునకుగారణముగనుండు యుద్ధమునందుఁ బ్రవర్తింపఁజేయుచున్నాఁడుగదా" యనునసూయలేనివారుగను నుండి యెల్లప్పుడు నేను జెప్పినప్రకారము చేయుదురో అప్పుడు వారును పుణ్య పాపకర్మములనుండి విడువఁబడుదురు. (3౧)

యే త్వేత దభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్।
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధినష్టా నచేతసః॥ 3.౨॥

ఎవరు నాయభిప్రాయమును ద్వేషించువారలై యనుసరింపరో, వారలనవివేకులనుగాను, బ్రహ్మవిషయమందుఁగాని, లేక,కర్మవిషయమందుఁగాని, యేమియు తెలియని జ్ఞానహీనులనుగాను, అన్నివిషయముల చేతను జెడిపోయిన వారలనుగాను దెలిసికొనుము. గనుక నిదివఱకు నే నుపదేశించిన ప్రకారము నడచుట మంచిదో లేక నడవకుండుటమంచిదో, నీవే యాలోచించుకొని చేయుము.

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి।
ప్రకృతిం యాన్తిభూతాని నిగ్రహః కిం కరిష్యతి॥ 33॥

మంచి చెడ్డలను దెలిసికొను జ్ఞానము గలవాఁడుగ నుండినను, పూర్వజన్మమందుఁ జేసినకర్మముల ననుసరించియే, ప్రతిమనుజుఁడును బ్రవర్తించువారలయిన ప్రాణులు జన్మాంతరసంస్కారము నే యనుసరించి నడుతురు. గనుక నింద్రియ నిగ్రహమువలనఁగాని, లేక పెద్ధలయొక్క యాజ్ఞవలనఁగాని, ఒరుల కట్టుబాటు వలనఁగాని, పైనఁజెప్పఁబడిన సిద్ధాంతముగలవారల నేమిచేయవచ్చును? అని తలంచుట సరిగాదు. ఏల ననిన, మార్కండేయుఁడు తనయొక్క దృఢమైనభగవద్భక్తిచేఁ బూర్వజన్మమందుఁజేసిన కర్మఫలముప్రకారము దనకు పదునాఱుసంవత్సరంబు వయసని నిర్ణయింపఁబడియుండినను, దానినతిక్రమించి పూర్ణాయస్సుగలవాఁడాయెను. భక్తిచేతనే పూర్వ జన్మ కర్మఫల మతిక్రమింపవచ్చుననునది యనుభవసిద్ధముగ నుండునప్పుడు, జ్ఞానముచేఁ బూర్వకర్మశేషమును దాలంగించుటలో నేమి యాక్షేపముగలదు? కాఁబట్టి జ్ఞానముచేత నతిక్రమింపఁదగని దేమియు లేదని తెలిసికొనుము. (33)

ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌవ్యవస్థితౌ।
తయో ర్నవశ మాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ॥ 3౪॥

సకలేంద్రియవిషయములయొక్క ప్రీతియగు రాగమును, అప్రీతియగు ద్వేషమును, నేర్పడియున్నది. (స్వతస్సిద్ధముగా నేయున్నవి.) అట్టి రాగద్వేషరూపములుగ నుండు నింద్రియములకు వశముకాఁ

గూడదు. ఏలనననిన పైనం జెప్పఁబడిన రాగద్వేషములే సదసద్వివేకముగల జ్ఞానికి శత్రువులనునది యనుభవసిద్ధమైనదిగను, శాస్త్రప్రసిద్ధమైనదిగ నున్నది. (౩౪)

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ ౩౫॥

మనఃపూర్వకముగా భక్తితోఁ జక్కఁగా ననుష్ఠింపఁబడినతనయొక్క వర్ణాశ్రమములకుఁదగిన, యన్యధర్మాచరణమునకన్న మేలైనదిగాఁ గనఁబడసి సజాతిధర్మము శ్రేష్ఠమైనది. స్వవర్ణాశ్రమధర్మమందుండు వానికి సంభవించు మరణమైన మేలగును. ఏలనని, స్వధర్మమును నిష్కామముగాఁ జేయుటచేఁ జిత్తశుద్ధికిని పరంపరాక్రమముగా జ్ఞానమునకు, పిమ్మట జననమరణ రాహిత్యముగలమోక్షమునకును సాధనమగును. ఇతరవర్ణాశ్రమముయొక్క యోగ్యమైనధర్మములుగూడ నరకభయంబును గలుగఁజేయును. (౩౫)

అర్జున ఉవాచ.

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః?।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ! బలాదివ నియోజితః॥ ౩౬॥



జీవుఁడు (అర్జునుఁడు) ప్రశ్నచేయునదేమనఁగా:—

ప్రార్థించువారలయొక్క జన్మమును గడతేర్చునట్టి ఓ పరమాత్మా! (శ్రీకృష్ణమూర్తీ!) అట్లయినచో నీప్రపంచముననుండుజనులిదివఱకుఁ జెప్పఁబడినరాగద్వేషములలో దేనిచేతఁ బ్రేరేపించఁబడినవారై, విషయానుభవము నిచ్ఛయింపని వారైనను బలాత్కారముగా, రాజుచేత నాజ్ఞాపించఁబడిన భృత్యునివలె విషయానురూపములగు దుష్కర్మములను జేయుచున్నారు. (౩౬)

శ్రీభగవానువాచ.

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్॥ ౩౭॥

పరమాత్మ(కృష్ణమూర్తి)ప్రత్యుత్తరమిచ్చుచున్నాఁడు.

కారణము చెప్పెదనుజీవుఁడా! (అర్జునుఁడా!) వినుము. రజోగుణముచేఁ గలుగుకోరిక (తనకులేని వస్తువులయందుఁ గోరిక) ఒకటి; యీకోరికను సిద్ధింపకచేయు పదార్థములయెడఁ గలుగుచిత్తవృత్తియను క్రోధము (కోపము) మఱియొక్కటి. ఇవి రెండును తృప్తిని బొందనియ్యనివియు, మహాపాపములకన్నిటికిఁ గారణముల

యినవియునగును గావున కామక్రోధాదులను మోక్షమార్గమున నడ్డపడుశత్రువులనుగాఁ దెలిసికొనుము. (౩౭)

ధూమేనావ్రియతే వహ్నిః యథాఽఽదర్శో మలేనచ।
యథోల్బేనావృతో గర్భః తథా తేనేదమావృతమ్॥ ౩౮॥

ప్రకాశాత్మకముగానుండు నగ్నితనయందు సహజముగనుండు పొగచేత నెట్లావరింపఁబడునో, అద్దముధూళిచేఁ బ్రతిబింబమ్ముగనఁబడకుండ నెట్లావరింపఁబడునో, గర్భమునందు శిశువు మావిచేత నెట్లావరింపఁబడునో, అట్లు జ్ఞానము కామాదులచేత నావరింపఁబడియున్నది. (౩౮)

ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణానలేనచ॥ ౩౯॥

మూలప్రకృతియొక్క సంతతినిఁజేరిన ఓ జీవుఁడా! (అర్జునా!) సంపూర్తిచేయ శక్యముగానిదియు, ఎన్నికట్టెలు మొదలగునవివైచినను, తృప్తినిబొందని యగ్నివంటిదియు, కోరికలేస్వరూపముగాఁగలదియు బ్రహ్మనిష్ఠునియొక్క నిత్యశత్రువైనదియునగు నీ కామముచే నాత్మస్వరూపమగుజ్ఞానము కప్పఁబడియున్నది. (౩౯)



ఇన్ద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠానముచ్యతే।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్ ॥౪౦॥

ఓజీవుఁడా! అర్జునా! ప్రపంచమందు శత్రువులుండు చోటుదెలుసుకొన్న యెడల ధీరులగువారెట్లు వారలను జయింతురో, అట్లా శకధిష్ఠానమగు చోటును నీవు దెలిసికొనుటకై నీకుఁజెప్పెదవినుము. ఇంద్రియములును, అశుద్ధమనస్సును, అశుద్ధబుద్ధియు, నీకామమునకు నివాసస్థలములని చెప్పంబడును. ఈకామమింద్రియాదులచేత నాత్మజ్ఞానము నావరించి దేహముగల జీవుని ననేక విధములుగా మోహింపఁజేయుచున్నది. (౪౦)

తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ!।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥౪౧॥

కాఁబట్టి సంసారభావమును బోఁగొట్టుకొనునట్టి ఓ జీవుఁడా! (అర్జునా!) నీవుజ్ఞానసాధనమగు నిష్కామకర్మమును జేయుటకుఁ బ్రారంభించుటకు మునుపే వాక్పాణి పాద పయూపస్థముల నెడు కర్మేంద్రియములను త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణముల నెడు జ్ఞానేంద్రియములను నీదశేంద్రియములను స్వాధీనముచేసికొని, శాస్త్రములను గురుముఖముగాఁ దెలుసుకొని, స్వానుష్ఠా

నముచేయుటకు యనెడు జ్ఞానమును, అనుభవముచే స్థిరపరచుకొనుట యను విజ్ఞానమును నీరెండింటిని నశింపఁజేయునదియు, సమస్తపాపములకుఁ గారణమయినదియునగు నీకామమును సంపూర్తిగ విడిచిపెట్టుముసుమీ. (౪౧)

ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః।
మనస స్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరత స్తు సః ॥౪౨॥

శ్రోత్రాదులగు నింద్రియములు, (జ్ఞానేంద్రియములు) శరీరము యొక్క యితర భాగములగు చేతులు కాళ్లు మొదలగువానికంటె (కర్మేంద్రియములకంటె) శ్రేష్ఠమయినవనియు, జ్ఞానేంద్రియముల కన్న మనసు శ్రేష్ఠమయినదనియు, సంకల్పవికల్పాత్మకమగు మనస్సుకన్న నిశ్చయాత్మకమగు బుద్ధిశ్రేష్ఠమనియు జ్ఞానులగు పెద్దలు చెప్పుచున్నారు. ఎవ్వఁడు బుద్ధికన్న శ్రేష్ఠుఁడుగను, సాక్షిస్వరూపుఁడుగనున్నాఁడో, యతఁడే యాత్మయని తెలిసికొనుము. (౪౨)

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సం స్తభ్యాత్మాన మాత్మనా।
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్॥

ఇంద్రియబలము గల ఓ జీవుఁడా! (అర్జునుఁడా!) ౪౨-వ శ్లోకమందు జెప్పఁబడిన ప్రకారము బుద్ధినిగూడ దాఁటి యుండు



వస్తువునుగా నాత్మనుఁ దన్నుదానుఁ దెలిసికొని, నిశ్చయాత్మకమగు బుద్ధిచే మనస్సును చలింపకయుండునట్లుచేసి, జయింపనసహ్యమైనదియు, ఆశాస్వరూపమయినదియు నగుశత్రువును జయించుఁగాత. (అనఁగా సంహారముఁజేయుఁగాత.) (౪౩)

ఇట్లు

కర్మశ్రవణయోగమనెడు,

మూడవయధ్యాయము

ముగిసెను.

ఓం, తత్, సత్.

---



శ్రీరస్తు.

# నాలవ యధ్యాయము.



## జ్ఞానశ్రవణయోగము.

శ్రీభగవానువాచ.

**ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్।**
**వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్ ॥౧॥**

పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) చెప్పుచున్నాఁడు.

జననమరణములను బోఁగొట్టఁ దగిన మోక్షఫలమునిచ్చు నీ జ్ఞానయోగమును నేను సృష్టిప్రారంభమగు నప్పుడు వివస్వత్తనెడు మాయకుపదేసించినాను. ఆమాయ తన పుత్త్రుఁడగు నంతఃకరణమున కుపదేశించెను. ఆయంతఃకరణము తనయొక్క పుత్త్రుఁడగు నిక్ష్వాకువనెడు సుఖస్వరూపియగు విజ్ఞానమునకుపదేశించెను. (౧)

**ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః।**
**సకాలేనేహ మహతా యోగో నష్టః పరంతప॥ ౨॥**

శత్రువులను దపింపఁజేయునట్టి ఓజీవుఁడా ! (అర్జునా !) ప్రథమ శ్లోకమునఁ జెప్పఁబడిన విధముగాఁ బరంపరా క్రమముగా నుపదేశింపఁబడుచు వచ్చిన నీ జ్ఞానయోగమును రాజర్షులనెడు సన్మార్గప్రవర్తనగల జీవులుతెలిసికొనిరి. సృష్టియై యనేక కాలము గడచినందున నట్లు పరంపరగా వచ్చిన జ్ఞానయోగము నీప్రపంచ మం దనేకశాఖోపశాఖలుగా చీలి భిన్నమై తుదకు నిప్పుడు నష్టమైన దేయాయెను. (౨)

**స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః।**
**భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్॥౩॥**

నీవు నాయొక్క భక్తుఁడవుగాను, స్నేహితుఁడవుగాను నుండుటం జేసి పూర్వమునాచేత నుపదేశింపఁబడి పరంపరగా వచ్చుచుండిన యీ జ్ఞానయోగమే నాచేత నీ కిప్పుడు చెప్పఁబడెను. శ్రేష్ఠమగు నీజ్ఞానయోగము మిక్కిలి రహస్యమైనది సుమీ. ౩॥

అర్జున ఉవాచ.

**అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః।**
**కథ మేతద్విజానీయాం? త్వమాదౌ ప్రోక్తవా నితి ॥౪॥**

జీవుఁడు (అర్జునుఁడు) ప్రశ్నచేయుచున్నాఁడు.

ఓ పరమాత్మా! (శ్రీకృష్ణమూర్తీ!) నీయొక్క యవతారమిటీవలది. వివస్వత్తనెడుమాయయో యనేక కాలముగనుండునది. సృష్టిప్రారంభమునందు నీవీ వివస్వత్తనెడుమాయకుఁ జెప్పితి వని యెట్లునమ్మవచ్చును? (౪)

శ్రీభగవానువాచ.

**బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున!।**
**తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప! ॥౫॥**

పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) చెప్పుచున్నాఁడు.

ఆగామి సంచిత ప్రారబ్ధకర్మముల నార్జనచేసియుండువాఁడును, వానినిఁబోఁగొట్టుటకుఁదగినజ్ఞానమును సంపాదించుచుండు వాఁడు నగు ఓ జీవుఁడా! (అర్జునా!) నేనుదుష్టనిగ్రహ శిష్టపరిపాలనకొఱకనేకములగు నవతారములెత్తినందున నాకును ననేకజన్మములు గడచినవి. నీవు జ్ఞానమును బొందనందున నీకు ననేక జన్మములు గడచినవి. నీవో యజ్ఞానముచేత నెత్తితివి. కాఁబట్టి నాయొక్కజన్మవివరములును, నీయొక్కజన్మవివరములును నే నెఱుఁగుదును. నీకో నీయొక్కజన్మవివరములును దెలియదు. నాయొక్కజన్మవివరమంత కుమునుపే తెలియదు. (౫)



**అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్।**
**ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవా మ్యాత్మమాయయా॥౬॥**

ఎల్లప్పుడును భగవత్స్వరూపముగనుండు నీకు ధర్మాధర్మ సంస్కారములు లేని యెడల జన్మ మెట్లు వచ్చునని యడిగెదవేమో వినుము జీవుఁడా! (అర్జునా!) నేను పుట్టుక లేనివాఁడైనను, క్షీణింపని జ్ఞానశక్తిగలవాఁడనైనను, బ్రహ్మమొదలుకొని స్తంభము పర్యంతముగల సమస్తము నేలువాఁడనైనను, స్వకీయమాయను స్వాధీనముచేసికొని స్వశక్తిచేత నవదరింతును. (౬)

**యదాయదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!।**
**అభ్యుత్థానమధర్మస్యతదాఽఽత్మానం సృజామ్యహమ్ ॥౭॥**

అట్లైన నెప్పు డవతరింపవలయునని యడిగెదవేమో జీవుఁడా! (అర్జునా!) ఎప్పుడు వర్ణాశ్రమధర్మములకు నాశమును అధర్మమున కభివృద్ధియుఁగలుగునో, అప్పుడు నన్ను నేనే సృష్టించుకొనుచున్నాను. అనఁగా నవతరించెదను. (౭)

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥ ౮॥**

ఎప్పు డెప్పు డవతరింతునని యడిగెదవేమో వినుము జీవుఁడా! (అర్జునా!) సాధువుల సంరక్షించుటకొఱకును, పాపాత్ములయొక్క నాశముకొఱకును, చక్కనిధర్మ మభివృద్ధియగుటకు బ్రతియుగమున నవతరించుచున్నాను. (౮)

**జన్మ కర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః।**
**త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున!॥౯॥**

జ్ఞానమును సంపాదింపఁదగిన ఓ జీవుఁడా! (అర్జునా!) అసాధారణమగు నాయొక్కయవతారమును, సాధువులను రక్షించుట మొదలగు సత్కర్మప్రవృత్తిని యెవ్వఁడు పైనఁజెపఁబడినట్లు యథార్థముగా దెలిసికొనుచున్నాఁడో, వాఁడీశరీరమును వదలిన పిమ్మట మఱల జననమరణ రూపమయిన సంసారమును బొందఁడు. వానిగతి మఱియేమగుననిన, నన్నే బొందును. (౯)

**వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః।**
**బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః ॥౧౦॥**

ఒక పదార్థమందపేక్షయు, అది గిట్టునో, లేదో, యనుభయమును, అదితనకు గిట్టకుండఁ జేయువారియెడల పరిణమించు చిత్తవృత్తియగు ద్వేషము మొదలగునవి లేనివారును, పరమాత్మయగు



నాతో నభేదస్థితిని బొందినవారును, నన్ను ధ్యాననిష్ఠచే దెలిసినవారు నగు ననేకసత్పురుషులు బ్రహ్మైక్యానుసంధాన మనెడి తపస్సను నిష్ఠచే బరిశుద్ధులయి మోక్షమును సంసారదుఃఖనివృత్తిని బొందుదురు.' (౧౦)

**యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్**
**మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః॥ ౧౧॥**

ఓ జీవుఁడా! (అర్జునా!) ఎవ్వరు ఫలాపేక్షతోఁగాని, ఫలాపేక్షలేకగాని నన్ను పూజించుచున్నారో, వారలనుగూడ వారివారికిఁదగినట్లు నే ననుగ్రహించుచున్నాను. మనుజులు నాయొక్క పూజారూపమగు మార్గమును కీర్తన, భక్తి, జ్ఞానము మొదలగు సత్కర్మములచేత ననువర్తించుచున్నారు. (౧౧)

**కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః।**
**క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా॥౧౨॥**

ఈ భూలోకమందుఁ గర్మఫలముల నపేక్షించువారు, ఇంద్రాది దేవతలను గూర్చి యాగము మొదలగుకర్మములచేత నారాధించెదరు. మనుష్యసంబంధమగు ప్రపంచమందుఁ గర్మములచే సంభవించుఫలప్రాప్తి శీఘ్రముగాఁ గలుగును. (౧౨)

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః।
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్ ॥౧౩॥

మాయచేఁ గలిగిన సత్త్వ రజ స్తమోగుణముల చేతను, శమ దమాదులతోఁ గూడిన తపస్సు మొదలగు సత్కర్మముల చేతను, బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్రజాతులు నాచే సృష్టింపఁబడినవి. అనఁగా, వాక్కు ఎల్లప్పుడు సద్వచనములనే వచించుచుండు ననెడి తనయొక్క స్వధర్మమగు క్రియలను జేయువారలను బ్రాహ్మణులనుగాను, చేతులు ఎల్లప్పుడు దానధర్మముల జేఁయుచు దీనులను గాపాడుచు పెద్దలను, దైవములను నమస్కరించుచు దైవములకును పెద్దలకును కైంకర్యము, లేక, శుశ్రూష చేయుచుండుననెడి తనయొక్క స్వధర్మమగు క్రియలను జేయువారలను క్షత్త్రియులనుగాను, వర్తకము మొదలగుపనులను జేయుట యనెడుతన స్వధర్మములను జేయువారలను వైశ్యులనుగాను, పరిచర్య మొదలగుపనులఁ జేయుటయనెడు తనయొక్క స్వధర్మముగు క్రియలఁ జేయువారలను శూద్రులనుగాను, అట్టి గుణకర్మవిభాగములచే నేర్పరచఁబడిన సృష్టికి నేనుకర్తగాఁ గనఁబడినను నన్ను కర్తనుగాను నాశరహితుని గాను దెలిసికొనుము. (౧౩)



న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మ ఫలే స్పృహా।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న సబధ్యతే ॥౧౪॥

సృష్ట్యాది కర్మము లాగామి సంచిత ప్రారబ్ధకర్మ స్వరూపములుగా నన్ను (తన్ను = పరమాత్మను = శ్రీకృష్ణమూర్తిని) అంటవు. నాకు (తనకు = పరమాత్మకు = శ్రీకృష్ణమూర్తికి) కర్మఫలములయం దిచ్ఛయు లేదు. • ఇవ్విధముగా నెవ్వఁ డెఱుంగునో, వాఁడు, కర్మఫలము చేతఁ గట్టుపడఁడు. (౧౪)

ఏవంజ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః।
కురుకర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్॥

పైనఁ జెప్పఁబడ్డవిధముగాఁ దెలుసుకొని పూర్వికులైన మోక్షాపేక్షగలవారలచేతను గర్మము చేయఁ బడినది. ఈ కారణము వలన పూర్వికులయిన జనకాదులచేఁ జేయఁబడినదియు, ప్రాచీనముగాఁ పరంపరాక్రమముగా వచ్చునదియు నగుకర్మములను నీవును చేయుము. (౧౫)

కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః।
తత్తేకర్మ ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥

కర్మ మనఁగనేమి? అకర్మమననేమి? అను నీకర్మజ్ఞాన విషయములలోఁ బండితులుగూడ మోసపోయిరి. ఏకర్మాకర్మమును దెలిసి యనుష్ఠించి సంసారబంధమునుండి విడువఁబడుదువో, అట్టి కర్మాకర్మములనుగూర్చి నీకు సవిస్తరంబుగాఁ జెప్పెద, వినుము. ()

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః॥
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః॥ ౧౭॥

వేదములచేఁ జెప్పఁబడిన సత్కర్మములయొక్క నిజస్వరూపము దెలిసికొనఁదగినది. చేయఁగూడదని వేదములచే నిషేధింపఁబడిన కర్మస్వరూపమును దెలిసికొనఁదగినది. కర్మము లేకయుండుధ్యాననిష్ఠ మొదలగువానియొక్క నిజస్థితియుఁ దెలిసికొనఁదగినది. కర్మ వికర్మ అకర్మమనెడి మూడింటియొక్క నిజస్థితిని యవివేకులచేఁ దెలిసికొనుట కసాధ్యముగదా? (౧౭)

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః।
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్॥

కర్మము యొక్క స్వభావము బంధమును గలుగఁజేయు నదిగ నున్నది. అట్టికర్మము నెవ్వఁడు ఫలాపేక్షరహితముగాను, 'నేను సత్కర్మములఁ జేయుచున్నాను,' అనెడు నహంకారమును, ఈ సత్కర్మములన్నియు నావి యను మమకారమును విడిచి భగవదర్పణముగాఁ జేయునో, అప్పు డట్టివానికి నాకర్మము బంధమును గలుగఁజేయక, నిష్కామముగా నాచరింపఁబడుటవలన ననేకజన్మములుగా వెంబడించు ప్రాచీనకర్మమును గూడఁ బోఁగొట్టి, చిత్తశుద్ధినిత ద్ద్వారా జ్ఞానమును పిమ్మట జననమరణరహితమగు మోక్షమును గలుగఁజేయును. గనుక బంధస్వభావముగల కర్మమందు నిష్కామకర్మ మగు నివృత్తిస్వరూపమును జూచుటయే, కర్మమందకర్మమును జూచుటయని తెలుసుకొనుము. నిష్కామకర్మముచేఁ బూర్వజన్మముల యందుఁ జేసినకర్మము యెట్లు నశించు ననియెదవేమో, వినుము. ఆగామి (ఇఁకమీఁదరాఁబోవు కర్మఫలము) సంచితము (ఇంతవరకుఁ జేయఁబడిన కర్మఫలము) ప్రారబ్ధము (ఈశరీరమెత్తుటకాధారముగానుండు కర్మఫలము.) అని కర్మము మూడు తెఱంగులుగలదిగనున్నది. ఎవ్వరు కర్మములను ఫలముల నపేక్షింపక నిష్కామముగా జేయునో, వానికి నేను చేయుచున్నాను అను కర్తృత్వమును 'నేననుభవించుచున్నాను' అనుభోక్తృత్వమును లేమిచేనింకరాఁబోవుకర్మఫలమనెడు "ఆగామి" లేదు. కర్తృత్వభోక్తృత్వరహితు నెవ్వరుభూషింతురో, వారువానియొక్క సత్కర్మఫలములను భాగించుకొనుదురు. ఎవ్వరు వానిని దూషింతురో, వానియసత్కర్మఫలములను భాగించుకొందురు. ఇట్లు నిష్కామకర్మానుష్ఠానపరునియొక్క పూర్వజన్మఫలములరాశి సముహాము భాగిం

పఁబడినందున, సంచితమగుకర్మఫలములును లేవు. "ప్రారబ్ధంభోగతో నశ్యేత్" అనుశ్రుతిప్రకారము ప్రారబ్ధస్వరూప మగు నీశరీర మనుభవముచే ముగియును, గనుక పైఁజెప్పఁబడినమూఁడు కర్మములు వీనికి లేనందున నిష్కామ మన్నికర్మములకన్న శ్రేష్ఠమైనది.

మనస్సు ప్రపంచవిషయములయందుఁ బ్రవేశింపక, భగవంతుని యందే లయించియుండుటయే యకర్మమనఁబడును. అటువంటి మనోలయమును బొందక కష్టము నాలోచించియు దోషబుద్ధిచేతను తాను జేయవలసినవర్ణాశ్రమ ధర్మకర్మముల విడిచి నేను కర్మములవిడిచి సుఖముగానున్నాను; నేనే యాత్మ; నేనే యీశ్వరుఁడు; నేనేయచలబ్రహ్మము "శివోఽహమ్" "బ్రహ్మైవాహమ్" "అచలబ్రహ్మోహమ్" అని వాచామాత్రముగ వచించుచు తదనుభవమేమియు లేక పాపపుణ్యకర్మములను జేసికొనుచు సుఖము తటస్థించినప్పుడు సంతోషమును దుఃఖము తటస్థించినప్పుడు వ్యసనమును బొందుచు వేషధారులయి యుండు నవివేకుల యొక్క దుర్మార్గమును వివేకి తెలిసికొని అవివేకులచే నకర్మ మని జెప్పఁబడు పైనఁజెప్పఁబడిన స్థితిలోఁ గర్తృత్వభోక్తృత్వాదు లుండుట వలన బంధమును గలుగఁజేయఁదగినకర్మమును జూచుచున్నాఁడు. గనుకనిదియే యకర్మమందుఁ గర్మమునుజూచుట యనఁబడును. కాఁబట్టి యెవ్వరు పైనఁజెప్పఁబడిన ప్రకారము కర్మమందకర్మ



మును అకర్మమందుఁ గర్మమును దెలిసికొని తదనుష్ఠానము గలిగియుండునో, వాఁడే నిశ్చయాత్మకమైన బుద్ధిమంతుఁ డనియు వాఁడే మనోనివృత్తిని జెందినయోగియనియు వాఁడే సకలకర్మముల నాచరించువాఁడనియు నెఱుంగుము. (౧౮)

యస్య సర్వే సమారమ్భాః కామసఙ్కల్ప వర్జితాః।
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం త మాహుః పణ్డితఁబుధాః॥౧౯॥

ఎవ్వనియొక్క యన్నికర్మములును ఫలాపేక్షలేని వగునో, జ్ఞానాగ్నిచేత దహింపఁబడి నశించిన కర్మములుగలయట్టివానిని జ్ఞానులు వివేకియని చెప్పుదురు. (౧౯)

త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించి త్కరోతిసః॥ ౨౦॥

పైనఁజెప్పఁబడినవిధముగు ననుష్ఠానమందుండు బ్రహ్మనిష్ఠుఁడును కర్మములయందుఁ గర్తృత్వా ద్యభిమానమును కర్మ ఫలములయందాశను విడిచి, యెల్లప్పుడు స్వాత్మానందానుభవముచేఁ దృప్తిని జెందియుండువాఁడును, ఎట్టిప్రయోజనమునకైన నితరుల ననుసరించకయుండి కర్మములయందుఁ బ్రవర్తించు చుండినను, వాఁడు కర్మములఁ జేసినవాఁడు గానేరఁడు. (౨౦)

నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః।
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ ॥౨౧॥

ఆశలేని వాఁడును స్వాధీనమైనమనస్సు, ఇంద్రియములు గల వాఁడును తనకై యొరులవద్ద నేవస్తువును గ్రహింపని వాఁడును, శరీరము నిలిచియుండుటమాత్ర ముపకారమగు భిక్షాటనము మొదలగు కర్మములఁ జేయుచుండువాఁడును. పుణ్యపాపముల మూలమగు సంసారమును జెందఁడు. (౨౧)

యదృచ్ఛాలాభసన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః।
సమ స్సిద్ధావసిద్ధౌచ కృత్వాఽపి ననిబధ్యతే॥ ౨౨॥

తానుగాఁగోరకతనకుసంభవించువానితోఁ దృప్తిజెందినవాఁడును, శీతము ఉష్ణము మొదలగు ద్వంద్వములకు జలింపని వాఁడును, ఒకఁడు సుఖముగానుండఁగఁజూచి యోర్వలేమియను మత్సరము లేనివాఁడును, ఆహారాదులుగిట్టినను గిట్టకయుండినను సమబుద్ధి గలవాఁడునై యుండు వివేకి భిక్షాటనము మొదలగు కర్మములఁ జేయుచుండినను కర్మబంధమగు సంసారమును బొందఁడు. (౨౨)

గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే॥ ౨౩॥



అభిమానములేనివాఁడును, కామ క్రోధములు మొదలగు దుర్గుణములనుండి విడువఁబడినవాఁడును, బ్రహ్మజ్ఞానస్థయందుఁజలింపని మనస్సుగలవాఁడును, భగవదర్పణముగా సత్కర్మములను జేయువాఁడునగు బ్రహ్మజ్ఞానియొక్క కర్మము ప్రాచీనకర్మములతోఁ గూడ నశించిపోవును. (౨౩)

బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మ కర్మ సమాధినా॥ ౨౪॥

యజ్ఞమందు హోమముచేయునప్పుడు అన్నము మొదలగునవి దేనివలన హోమముచేయఁబడునో, దానికి స్రుక్కని పేరు. నేయి మొదలగునవి దేనిచేత హోమముచేయఁబడునో, దానికి స్రువమని పేరు. ఇవి రెండును బ్రహ్మమే. బ్రహ్మరూపమగు నగ్నియందు బ్రహ్మస్వరూపుఁడగు యజమానునిచే జేయఁబడు హోమమును బ్రహ్మమే. సకలము బ్రహ్మస్వరూపమే. యను చిత్తైకాగ్రతతో యజ్ఞాదికర్మములఁ జేయునట్టిబ్రహ్మజ్ఞానిచేఁ బొందఁదగినదియు బ్రహ్మమే.

దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥ ౨౫॥

బ్రహ్మానుభవస్వరూపమగు జ్ఞానయజ్ఞము ఇతరములగు నన్ని యజ్ఞములకన్న శ్రేష్ఠమైనది. ఎట్లనిన కర్మనిష్ఠగల కొందఱు ఇం

ంద్రాదిదేవతల నుద్దేశించి చేయఁబడు జ్యోతిష్టోమాది యజ్ఞమునే ఫలమును గోరి చేయుదురు. మఱికొందఱు బ్రహ్మమం దైక్యమును బొందుటయను భావనచేత నుపాధితో గూడుకొనిన యాత్మను జీవుని నిరుపాధిక బ్రహ్మమనెడి యగ్నియందు హోమము చేయుదురు. (౨౫)

**శ్రోత్రాదీ నీన్ద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।**
**శబ్దాదీన్ విషయా నన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి॥ ౨౬॥**

మఱికొందఱు శ్రోత్ర మొదలగు నింద్రియములను నిగ్రహమనెడి యగ్నియందు హోమము చేయుదురు. అనఁగా బ్రహ్మచారి ఇంద్రియముల నణఁచుటయే యజ్ఞమని చెప్పఁబడును. అగ్నియందు హోమముచేయఁబడినపదార్థము లన్నియునామరూపరహితము లగును. అట్లే యింద్రియనిగ్రహముచే నింద్రియవ్యాపారములు నశించును. మఱికొందఱు శబ్దము మొదలగు విషయములను, ఇంద్రియములనెడు నగ్నియందు హోమముచేయుదురు. అనఁగాగృహస్థాశ్రమమందుండు వానికి విషయసంబంధము విడుచుటయే యజ్ఞమనఁబడును. ఎట్లనఁగా శబ్దాదివిషయముల ననుభవించినను, ఆవిషయముతోఁజేరు సంబంధమునే హవిస్సుగాను, ఇంద్రియముల నగ్నిగాను భావించి, ఆవిషయసంబంధ మనెడిహవిస్సునింద్రియము లనెడునగ్నియందు



హోమముచేయుదురు. ఆయాయింద్రియము లేయేవస్తువులను గ్రహించినప్పటి కావస్తువులతోఁ గలసంబంధమునునశింపఁజేయుట యే హోమమనఁబడును. (౨౬)

**సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే।**
**ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥ ౨౭॥**

మఱికొందఱు త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వా ఘ్రాణములనెడు జ్ఞానేంద్రియపంచకముయొక్కయు, వానివ్యాపారములగు శబ్దస్పర్శరూపరసగంధములయొక్కయు, వాక్ పాణి పాద పాయూ పస్థలనెడి కర్మేంద్రియపంచకములయొక్కయు, వానివ్యాపారములగు వచన దాన గమన విసర్జనానందములయొక్కయు, ప్రాణాపానవ్యానోదానసమానంబులనెడు పంచప్రాణములయొక్కయు, వానివ్యాపారములగు జ్ఞానేంద్రియములద్వారా శ్వాసరూపముగాఁ గొంచెముపైకివెళ్ళి లోపలఁబ్రవేశించుట, ఆసనముద్వారా లోపలఁబ్రవేశించుట, శరీరమంతయు సంచరించి రక్తమునువ్యాపింపఁజేయుట, నాభి మొదలు బ్రహ్మరంధ్రమువరకుఁ బోయివచ్చుచుండుట, ఆహారాదులను జీర్ణముచేయించి, వానిరసమును జేరవలసినస్థలములలో జేర్పించియసత్తగు మలమూత్రాదులను వెలుపలఁద్రోయుట మొదలగువానియొక్కయు, నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయములనెడి యుపప్రాణ

ములయొక్కయు వాని వ్యాపారములగు వమనముచేయుట, రెప్పలు వాల్చితెఱచుట, తుమ్ముట, ఆవలించుట, ప్రాణముండునప్పుడును, లేనప్పుడును శరీరమునుండి వాపు మొగలగునవి గలుగుట యను వ్యాపారములయొక్కయు ఇవి మొదలగు సమస్తములైనచేష్టలను, గురువుచేతనుపదేశింపఁబడి తెలిసికొని వానియందు మనస్సునుంచక, గురువుచే నుపదేశింపఁబడిన లక్ష్యమందు మనసునిలుపుటవలనఁ గలుగు స్వానుభవ వివేకముచేఁ బ్రకాశించెడి యాత్మవిషయికమగు సమాధియను బ్రహ్మజ్ఞాన యోగాగ్నియందు హోమముచేయుదురు. (౨౭)

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః॥ ౨౮॥

మఱికొందఱు ద్రవ్యమును మంచిక్షేత్రము, మంచితీర్థము, మొదలగు స్థలములయందు సత్పాత్రమునెఱిఁగి దానముచేయుటయే యజ్ఞమనితలఁచిచేయుదురు. మఱికొందఱు కష్టములగువ్రతములను, వృద్ధిచంద్రునివలె ప్రతిదినంబున నాహారము నొక్కొక్క కబళముగా హెచ్చించుటయు, క్షీణచంద్రునివలె ప్రతిదినంబున నొక్కొక్క కబళముగాఁ దగ్గించుటయు నగు చాంద్రాయణవ్రతము మొదలగు తపస్సులనే యజ్ఞముగాఁ జేయుదురు. ప్రాణాయామము, ప్రత్యాహా



రము మొదలగునష్టాంగయోగమునే యజ్ఞములనుగాఁదలఁచి కొందఱు చేయుదురు. ఆలాగుననే మఱికొందఱు వేదాధ్యయనముచేయుటయే యజ్ఞమనియు వేదాంగములను జదువుటయేయజ్ఞమనియు చేయుదురు. పైనఁజెప్పబడిన యజ్ఞములఁ జేయుటకుఁబ్రయత్నము చేయువారలు కఠినహృదయులని చెప్పఁబడుదురు. (౨౮)

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః॥ ౨౯॥

ప్రాణాయామము నభ్యసించు మఱికొందఱు ప్రాణాపానవాయువులయొక్క గతులను నిలిపి అనఁగా కుంభకమును, అపానవాయువ్యాపారమును ప్రాణవాయువ్యాపారమందును, అనఁగాపూరకమును, అట్లేప్రాణవాయువ్యాపారము నపానవాయువ్యాపారమందును, అనఁగా రేచకమును యజ్ఞముగాఁదలఁచిచేయుదురు. (౨౯)

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః॥ ౩౦॥

మఱికొందఱుఆహారనియమముగలవారుగాను, ఒకయింద్రియముయొక్క ప్రవృత్తిరూపమగు వ్యాపారమును, తనకువశముగానుండు మఱియొక యింద్రియమునందులయముచేయుటయను హోమముచే

యుదురు. ౨౫-వ శ్లోకము మొదలుకొని యిదివరకుఁగల సకలవిధము లయిన యజ్ఞముల నాచరించువారు కర్మయజ్ఞమును దెలిసినవారు. వారు వానిని భగవదర్పణముగాఁజేయుటచే నశింపఁజేయఁబడిన పాపము గలవారలగుదురు. (30)

యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ!॥

హోమము వైశ్వదేవము, బలిహరణము, స్వామినివేదనము, అతిథి పూజలనెడియజ్ఞములను భగవదర్పణముగాఁజేసి మిగిలిన యన్నము నెడియమృతమునుభుజించువారు, సత్కర్మముల నహంకార మమకారాభిమానములనువిడిచి, భగవదర్పణముగాఁజేసి చిత్తశుద్ధిని జెందిసద్గురులాభమునుబొంది యాగురుముఖముగాశ్రవణమనననిదిధ్యాసనసమాధులనుబొంది కృతార్థులగుదురు. సన్మార్గమునందే ప్రవర్తించు ఓజీవుఁడా!(అర్జునా!)పైనఁజెప్పఁబడినయజ్ఞములలో నొక్కటియైన భగవదర్పణగాఁజేయని వానికి నల్పసుఖమునుగలుగఁజేయు ధర్మార్థకామానుభవము గల యీలోకమే లేదనునప్పుడు స్వర్గాదులగు లోకములెక్కడివి? స్వర్గమేలేనప్పుడు మోక్షమును గూర్చిచెప్పవలయునా? (3౧)



ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే।
కర్మజాన్ విద్ధి తాన్ సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥

పైనఁజెప్పఁబడినప్రకారము పలువిధములైన యజ్ఞములు వేదము నందు సవిస్తరముగాఁ జెప్పఁబడియున్నవి. అట్టియన్ని యజ్ఞములును మనోవాక్కాయములచేఁ గలిగినవిగాఁదెలిసికొనుము. ఈ విధముగా యజ్ఞము మొదలగుకర్మములు మనో వాక్కాయముల యొక్క వ్యాపారములనితెలిసికొని గురువుచే నుపదేశింపఁబడినయాత్మజ్ఞానసనిష్ఠలో నీవుప్రవర్తించునెడల సంసారకర్మబంధమునుండివిడువఁబడుదువు. (3౨)

శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప!।
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే॥ 33॥

కామ క్రోధాది శత్రువులను దహించునట్లుచేయు ఓ జీవుఁడా! (అర్జునా!) ద్రవ్యసాధ్యమగుయజ్ఞమునకన్నఁ గర్మజ్ఞానేంద్రియముల యొక్కనిగ్రహము, సద్గురూపదేశము, శ్రవణమనన నిదిధ్యాసములు యివిమొదలగునవియిమిడియుండు జ్ఞానయజ్ఞముమిక్కిలి శ్రేష్ఠమైనది. ఓ జీవుఁడా! (అర్జునా!) భగవదర్పణముగాఁజేయఁబడు నన్ని కర్మములును ఫలములతోఁగూడ జ్ఞానయజ్ఞమగు బ్రహ్మజ్ఞానమందు నంతర్భూతములైయున్నవి. (33)

త ద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥ ౩౪॥

జ్ఞానసంతతిలోఁ జేరిన ఓ జీవుఁడా! (అర్జునా!) పైనఁ జెప్పఁబడిన శ్లోకమందుండుజ్ఞాన మెట్లుకలుగునని యడిగెదవేమో, చెప్పెద వినుము. ఆత్మానుభవముఁజెంది యుండుజ్ఞానులు యేబ్రహ్మజ్ఞానము నీ కుపదేశించుదురో, అట్టి జ్ఞానమును వారలకు సాష్టాంగ నమస్కారమగు నన్ని యింద్రియములయొక్క కర్తృత్వ భోక్తృత్వాదులను సంపూర్ణముగా విడిచిపెట్టి యా యింద్రియములను వారలకుస్వాధీనముగ సమర్పించుటచేతను, తనకుఁగల సంశయములను శాస్త్రోక్తముగా నడుగుటచేతను వారలయొక్క యాజ్ఞను దప్పక నెఱవేర్చుటచేతను దెలుసుకొనుము. (౩౪)

యజ్జ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాణ్డవ!।
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి॥

ఏస్వానుభవజ్ఞానమును బొందినపిమ్మట బంధువులను (కామక్రోధాదులను) ఎట్లుచంపుదును? ఎట్లు యెదిరించుదును? ఎట్లుబాణప్రయోగముచేయుదును? అను నీ మొదలగు మోహములనుబొందవో, ఏజ్ఞానముచే సకలప్రాణులను నీయందును, (నీవు అనిచెప్పనప్పుడు) ఆత్మే నాయందును (నేను అని చెప్పనప్పుడును) అనఁగాఁ దన్నువలె నెరులను, ఒరులవలెఁ దన్నుఁజూచెదవో, అజ్ఞానమును పైనఁజెప్పిన శ్లోకముప్రకారము తెలుసుకొనుము. (౩౫)



అపి చే దసి పాపేభ్య స్స ర్వేభ్యః పాపకృ త్తమః।
సర్వం జ్ఞానప్ల వే నైవ వృజినం స న్తరిష్యసి॥ ౩౬॥

పాపముగలవారిలో నందఱిలోను నీవధికమైన పాపమును జేసినవాఁడవుగానుండినను, సకలమైన పాపసముద్రములను జ్ఞానమనెడి తెప్పచేఁ గించిదపాయము గూడలేకుండ దాఁటఁగలవు. (౩౬)

యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున!।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా॥ ౩౭॥

ఓ జీవుఁడా! (అర్జునా!) బాగుగాఁ బ్రజ్వలించునట్టి యగ్నికట్టెలనెట్లు భస్మముచేయునో, అట్లు జ్ఞానమనెడియగ్ని యాగామిసంచిత ప్రారబ్ధ స్వరూపములగు సమస్త కర్మములనెడు కట్టెలనుసంపూర్ణముగా భస్మముచేయును. (౩౭(

నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి॥ ౩౮॥

ఇదివఱకుఁ జెప్పఁబడుచు వచ్చిన యజ్ఞములలో జ్ఞానయజ్ఞమునకు సమానమైనదియు, పాపములను బోఁగొట్టి చిత్తశుద్ధిని గలుగఁజేయునదియునగు మఱియొక్కటి లేదుగదా? కర్మయోగసిద్ధిని బొందినవాఁడు కర్మములను భగవదర్పణముగాఁజేసికొనుచు రాఁగారాఁగా చిత్తశుద్ధిని, సద్గురు లాభమునుబొంది తదుపదేశమూలముగా శ్రవణ మనన నిదిధ్యాసలను జేసికొనుచు క్రమముగాఁ దనయం దంతర్యామిగనుండు నాత్మస్వరూప జ్ఞానమును దనకుఁ దానేబొందును. అనఁగా స్వానుభవముగలుగును. (౩౮)

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేన్ద్రియః।
జ్ఞానం లబ్ధ్వాపరాం శాన్తి మచిరేణాధిగచ్ఛతి॥ ౩౯॥

సద్గురువుచే నుపదేశింపఁబడిన వాచ్యార్థ లక్ష్యార్థములయందు నమ్మకముగలవాఁడును, వారు చెప్పునట్లనుష్ఠించుటచేఁ గలుగుజ్ఞానమును సంపాదించుకొనువాఁడును, జ్ఞాన కర్మేంద్రియములను వశపరచుకొనిన వాఁడును, స్వానుభవసిద్ధమైన బ్రహ్మజ్ఞానమును బొందుచున్నాఁడు. అట్టిజ్ఞానమును బొందినపిమ్మట యుత్తమమగు చిత్తోపరతియను మోక్షము శీఘ్రముగాఁగలుగును. (౩౯)

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి।
నాయం లోకోఽస్తినపరో నసుఖం సంశయాత్మనః॥౪౦॥



సద్గురూపదేశమును దెలిసికొననివాఁడును, మనస్సు నితరవిషయములయందుఁ బ్రవేశింపనివ్వక గురువాక్యముల విననివాఁడును, సద్గురు వుపదేశించినవిషయములు ఫలించునో, ఫలించవో, యనెడు సంశయముగలవాఁడును, చెడిపోవును. సంశయముగలవాని కిహలోకసుఖములేదు, ఇహలోకసుఖమే లేనప్పుడు చిత్తసమాధానమెక్కడిది? అదిబొత్తుగాఁ గలుగనేరదు. (౪౦)

యోగ సన్న్యస్తకర్మాణం జ్ఞానసఞ్ఛిన్న సంశయమ్।
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ!॥ ౪౧॥

కామక్రోధాద్య వివేకములను జయింపఁదగిన ఓ జీవుఁడా! (అర్జునా!) పరమాత్మజ్ఞానముచే నన్నికర్మముల విడిచినవాఁడును. అనఁగా ఫలాపేక్షను విడిచి సకలసత్కర్మములను భగవదర్పణముగాఁ జేయువాఁడును, సద్గురువుచే నుపదేశింపఁబడిన శ్రవణమనననిదిధ్యాసలవలన సకలసందేహములను బోఁగొట్టుకొన్నవాఁడును, దానివలన స్వానుభవముఁజెందియుండు వాఁడు నగువానిని కర్మములు బంధింపవు. (౪౧)

తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః।
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత!॥

ఆగామి సంచిత ప్రారబ్ధముల మోఁతలను దొలఁగించుకొనఁగల ఓ జీవుఁడా ! (అర్జునా !) ఫలాపేక్షరహితమై భగవదర్పణముగాఁ జేయఁబడుకర్మయోగానుష్ఠానమువలనఁ జిత్తశుద్ధిని బొందినవాఁడును, గురువుచే నుపదేశింపఁబడిన శ్రవణ మనన నిదిధ్యాసలచేఁగలిగిన జ్ఞానమువలన సంశయవిపర్యయములఁ బోగొట్టుగొనినవాఁడును సంసారమువలన కట్టుబడఁడు. సద్గురువాక్యమునందు నమ్మకములేనిసంశయిత చిత్తముగలవాఁడు ఇహపరములకుఁ బనికిరాక చెడిపోవును గనుక, నీయొక్క హృదయమందుండునదియు, నవివేకముచేఁ గలిగినదియునగు శాఖోపశాఖలతోఁగూడిన నీయొక్క సంశయమను వృక్షమును జ్ఞానమనెడి కత్తిచేఁ దుత్తునియలుచేసి, యట్టి జ్ఞానయోగమునకు సాధనముగానుండు నిష్కామకర్మయోగము నాచరింపుము. ప్రస్తుతమందు క్షత్త్రియధర్మమగు యుద్ధమను కర్మమును నిష్కామముగాఁ జేయుటకొఱకై యాలస్యముచేయక మాఱుమాటలాడక లెమ్ము. (౪౨)

ఇట్లు

జ్ఞానశ్రవణయోగమను

నాల్గవ యధ్యాయము.

ముగిసెను.

---

శ్రీరస్తు.

## అయిదవ యధ్యాయము.

---

### కర్మసన్న్యాసశ్రవణయోగము.

అర్జునఉవాచ,

సన్న్యాసం కర్మణాం కృష్ణ ! పునర్యోగఞ్చ శంససి।
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥

జ్ఞానమును సంపాదింపఁదగిన జీవుఁడు (అర్జునుఁడు.)
ప్రశ్న చేయునదే మనఁగా:—

సకలపాపములఁ బోఁగొట్టునట్టి ఓ పరమాత్మా! (శ్రీకృష్ణమూర్తీ!) శాస్త్రీయములైన కర్మములయొక్క పరిత్యాగమును, మఱల నిష్కామకర్మయోగమును జెప్పుచున్నావు, వీటిరెండింటిలో నెయ్యది శ్రేష్ఠంబైనదో, దానిని నీవే నిర్ణయించుకొని నాకుఁజెప్పుము. (౧)

శ్రీభగవానువాచ.

సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ।
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే॥ ౨॥

పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) చెప్పునదేమనఁగా:—

బ్రహ్మజ్ఞాననిష్ఠను బొందిన జ్ఞాని చేయవలసినకర్మపరిత్యాగమును, కుటుంబజ్ఞాని భగవదర్పణముగాఁ జేయవలసిన నిష్కామకర్మానుష్ఠానమును ఇవి రెండును శ్రేష్ఠములైనవియే. ఎట్లనిన:—మొదటిదగు కర్మపరిత్యాగరూపమైన జ్ఞానయోగము సాక్షాత్తుగాను, రెండవదియగు నిష్కామకర్మానుష్ఠాన రూపమైన కర్మయోగము పరంపరాక్రమముగాను మోక్షమును, లేక, దుఃఖనివారనిరూపమగు చిత్తవిశ్రాంతిని గలుగఁజేయునవి. వానిలో జ్ఞానమును బొందకయునుపేక్షితకర్మములమాత్రము విడిచిపెట్టుటకన్న సంసారమందుండువానికి ఫలాపేక్షరహితముగా భగవదర్పణబుద్ధితోఁ జేయవలసిన నిష్కామకర్మయోగమే శ్రేష్ఠమైనది. (౨)

**జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి।**
**నిర్ద్వన్ద్వో హి మహాబాహో! సుఖం బన్ధాత్ప్రముచ్యతే॥**

ఇంద్రియనిగ్రహముగల ఓ జీవుఁడా! (అర్జునుఁడా!) ఏనిష్కామకర్మయోగి, దన కొకఁడపకారముఁ జేసినను, తానువానికిఁ బ్రత్యపకారముఁ జేయవలసినదను తలంపులేక ద్వేషరహితుఁడుగను, కోరికలులేనివాఁడుగను, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములులేనివాఁడుగ నగునో, వాఁడు భగవదర్పణబుద్ధితోను, కర్తృత్వ భోక్తృ



త్వములు లేక కర్మములను నిష్కామముగాఁ జేసినయెడల నెల్లప్పుడును గర్మపరిత్యాగము చేసినవాఁడనియే చెప్పఁబడుచున్నాఁడు. వాఁ డెట్టి యాయాసమును లేక సంసారబంధమునుండి విడువఁబడుచున్నాఁడు. (౩)

**సాఙ్ఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః।**
**ఏక మప్యాస్థిత స్సమ్య గుభయో ర్విన్దతే ఫలమ్॥ ౪॥**

జ్ఞాన కర్మయోగములను వేర్వేఱుఫలంబులఁగలవానిఁగా నవివేకులు నెప్పుదురు. వివేకు లట్లుచెప్పరు. రెండింటిలో నొకదానిని జక్కఁగ ననుష్ఠించువారలు రెండింటియొక్క ఫలమగు మోక్షమునే పొందుదురు. (౪)

**య త్సాఙ్ఖ్యైః ప్రాప్యతే స్థానం త ద్యోగైరపి గమ్యతే।**
**ఏకం సాఙ్ఖ్యఞ్చ యోగఞ్చ యః పశ్యతి స పశ్యతి॥ ౫॥**

జ్ఞాననిష్ఠులగు పరమార్థ సన్న్యాసులచేత నేమోక్షము పొందఁబడునో, ఆ మోక్షము నిష్కామకర్మానుష్ఠానపరులచేతను బొందఁబడుచున్నది. జ్ఞానమును, నిష్కామ కర్మయోగము నొకేఫలము గలవిగా నెవ్వఁడెఱుంగునో, వాఁడేనిజమును దెలిసికొనినవాఁడని చెప్పఁబడును. (౫)

సన్న్యాసస్తు మహాబాహో! దుఃఖ మాప్తుమయోగతః।
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి॥ ౬॥

ఓ జీవుఁడా! (అర్జునా!) పరమార్థజ్ఞానముతోఁగూడిన సన్న్యాసము, నిష్కామకర్మయోగము ననుష్ఠింపకయే పొందుట యశక్యము. నిష్కామకర్మయోగము ననుష్ఠించెడి (సద్గురువును జెంది, వారియిష్టానుసారంబుగ నడచి వారిచే నుపదేశింపఁబడిన లక్ష్యమందు మనస్సును నిలుపఁదగిన) మననశీలుఁడు బ్రహ్మమును (పరమార్థసన్న్యాసియొక్క స్థితిని=పరమార్థనిష్ఠను) పరంపరాసాధనముచే శీఘ్రముగాఁబొందును. (౬)

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే॥ ౭॥

నిష్కామకర్మయోగము ననుష్ఠించువాఁడును, పరిశుద్ధమైనమనస్సుగలవాఁడును, తనస్వాధీనతయం దుండునింద్రియములు దేహముగలవాఁడును సకలభూతములలోఁదన్ను, దనయందు సకలభూతములను అనఁగా, తానే సకలభూతస్వరూపముగను సకలభూతములు దనస్వరూపముగ నున్నవియని తెలిసికొనువాఁడెవ్వఁడో, వాఁడు కర్మముఁ జేసినను కర్మపాశముచేఁ గట్టుపడఁడు (౭)



నైవ కిఞ్చిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర న్నశ్నన్గచ్ఛన్స్వపన్శ్వసన్॥ ౮॥
ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిష న్నిమిషన్నపి।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్॥ ౯॥

నిష్కామకర్మానుష్ఠానము గలవాఁడు సద్గురూపదేశముమూలము గాఁబరమార్థ తత్త్వజ్ఞానము గలవాఁడై, తాను కన్నులచేఁ జూచుచున్నను చెవులచే వినుచున్నను, శరీరముచే స్పృశించుచున్నను, ముక్కుచే నాఘ్రాణించుచున్నను, నాలుకచే రుచిచూచి భుజించుచున్నను కాళ్లచే నడుచుచున్నను బుద్ధిచేనిద్రించుచున్నను, ప్రాణవాయువుచే నుచ్ఛ్వాసనిశ్శ్వాస రూపములగు శ్వాసములవిడుచుచున్నను, నోటిచేమాటలాడుచున్నను అపానముచే మలమును, ఉపస్థముచే జలమునువిడుచుచున్నను, కూర్ముఁడనెడు వాయువుచేఁ గన్నులరెప్పల మూయుచు దఱచుచున్నను, ఇంద్రియములు శబ్దాదివిషయములయందుఁ బ్రవర్తించుచున్నవి యని నిశ్చయించుకొన్నవాఁడై "నేను చేయుచున్నాఁడను" నహంకారస్వరూపముగు కర్తృత్వాదులు లేనివాఁడై యన్నియు భగవదర్పణముగా భగవత్కృపవలన జరుగుచున్నవని తలంచును. (౮,౯)

బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః।
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివామ్భసా॥ ౧౦॥

ఎవ్వఁడు కర్మములను పరమాత్మయగు భగవంతుని కర్పణము నేసి ఫలాపేక్షను (మోక్షాపేక్షనుగూడ) విడిచిపెట్టునో; వాఁడు, ఎట్లు తామరాకు నీటిలోనే పుట్టి నీటివల్లనే పెరిగినను, నీటితో సంబంధముఁజెందదో, అట్లు పాపపుణ్యముల రెండింటియొక్క మిశ్రకర్మములచేఁ దాను పుట్టి, యాకర్మములవలనే తాను పెరిగించినను, ఆపాప పుణ్యకర్మములచేఁ గట్టంబడఁడు. (అనఁగా నవిపీని నంటవు.)(౧౦)

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రిన్ద్రియై రపి।
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గంత్యక్త్వాఽఽత్మశుద్ధయే॥౧౧॥

నిష్కామ కర్మయోగులు ఫలాపేక్షనువిడిచి, చిత్తశుద్ధిని బొందుటకై యభిమానశూన్యమైన శరీరముచేతను, మనస్సుచేతను, బుద్ధిచేతను, ఇంద్రియములచేతను, కర్మములఁజేయుచుందురు. (౧౧)

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥ ౧౨॥



నిష్కామకర్మయోగి కర్మఫలాపేక్షనువిడిచి, యాత్మ నిష్ఠచేఁ గలుగు నాత్మానుభవ సుఖమును బొందును. ఫలాపేక్షతోఁ గర్మములఁజేయు వాఁడు, ఫలవిషయికమగు నాశయొక్క ప్రేరణచేఁ గర్మఫలములయం దాశగలవాఁడై కర్మపాశముచేఁ గట్టఁబడును.

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాఽఽస్తే సుఖంవశీ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్ ॥౧౩॥

ఇంద్రియ నిగ్రహముగలవాఁడు వివేకముగల శుద్ధ మనస్సుచే (రెండుచెవులు, రెండుకన్నులు, రెండుముక్కురంధ్రములు; నోరు, గుదము, ఉపస్థము) అనుదొమ్మిదివాకిళ్లుగలపట్టణమగు శరీరమందు నాత్మయను ప్రభువు నాత్మనిమిత్తముగా సకలకార్యములఁ జేయు నింద్రియములు; మనస్సు, బుద్ధి, యనెడి పరిజనములతోఁ గూడి, కర్తృత్వరూపమగు నహఙ్కారమును, ప్రవృత్తిసాధనమగు మమకారమునువదలినవాఁడై, (అనఁగాఁదానుగ నొక్కటియుఁజేయక యొరులచేఁ జేయించక సాక్షీభూతుఁడై సుఖముగనుండును. (౧౩)

న కర్తృత్వం నకర్మాణి లోకస్య సృజతి ప్రభుః।
న కర్మ ఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥ ౧౪॥

దేహియగునాత్మ, దేవ, మనుష్య, పశు, పక్షి, స్థావర, జంగమ రూపములైనదియు, ప్రవృత్తి సంబంధమయినదియునగు నీ ప్రపం

చమునకు వానివానికి, లేక, దానిదానికి వేఱువేఱయిన కర్తృత్వమును గలుగఁజేయదు. వాని వానికి లేక, దాని దానికి వేఱు వేఱు గర్మములను గలుగఁజేయదు. ఆయా కర్మములచేఁ గలుగు ఫలములయందు, వానివానికి, లేక, దానిదానికిఁ దగిన వేఱు వేఱు సంబంధము గలుగఁజేయదు. అనేకదినములుగాఁ బ్రవాహ రూపమయి యనాదిగా వెంబడించుచుండు దేవమనుష్యాది దేహాభిమానమునకు మూలమగు మాయయయిన యవివేకమే దీనికిఁ గారణము. దాని చేతనే కర్తృత్వాద్యభిమానములు గలుగుచున్నవని యెఱుంగుము.

**నాదత్తే కస్యచి త్పాపం నచైవ సుకృతం విభుః।**
**అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః॥ ౧౫॥**

ఆత్మ (భగవంతుఁడు=బ్రహ్మము) ఎవ్వనియొక్క పాపమును స్వీకరించఁడు. ఎవ్వనియొక్క పుణ్యమునుగూడ స్వీకరించఁడు. వీని నిజమును సద్గురువుమూలముగాఁ దెలిసికొనని యవివేకముచే, నాత్మజ్ఞానవివేకము కప్పఁబడియున్నది. అందువలన నవివేకులగు ప్రాకృత మనుష్యులు మోహమును జెందియున్నారు. (౧౫)

**జ్ఞానేనతు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః।**
**తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతితత్పరమ్॥ ౧౬॥**



బ్రహ్మజ్ఞానముచే నెవ్వరియొక్క యజ్ఞానము నశించునో, వారలయొక్క జ్ఞానము సూర్యప్రకాశమువలెఁ దనకుఁదానే ప్రకాశించును. అనఁగా స్వానుభవమును గలుగఁజేసి జననమరణములకు మూలమగు నవివేకమును (అవిద్యయగు నంధకారమును) పోఁగొట్టును.

**తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః।**
**గచ్ఛ న్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూత కల్మషాః॥**

సకలమును వాసుదేవ స్వరూపమేయను నిశ్చయమైన బ్రహ్మజ్ఞానముగల వారలును, అన్నిటిలోను భగవంతుఁడెట్లంతర్యామిగ నున్నాఁడో, అట్లుతనలో, నంతర్యామిగనున్నాఁడనునిశ్చయముచేఁ దాననువస్తువు నాత్మయగు భగవంతుఁడను నిశ్చయముగల వారలును, ఇట్టి నిశ్చయములవలన బ్రహ్మనిష్ఠను జెందిన వారలగు స్వానుభవజ్ఞులు జ్ఞానముచేఁ బోఁగొట్టఁబడిన పాపముగలవారలై, తిరుగ నీ సంసారమునకు మఱలని స్థానమగుమోక్షమును బొందుచున్నారు.

**విద్యావినయసమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తిని।**
**శునిచైవ శ్వపాకేచ పణ్డితా స్సమదర్శినః॥ ౧౮॥**

లెస్సఁగా వేదములఁబఠించి, యుపశమమును బొంది యుండు వారలగు బ్రాహ్మణులయందును, (అనఁగా సద్గుణముల యందును)

సత్తు, అసత్తు వీటియొక్క వ్యత్యాసమును దెలిసికొనఁదగనిపశువుల యందును, (అనఁగా మూఢత్వము నందును) అహంకారము గల యేనుఁగునందును (అనఁగా అహంకారస్థితియందును) క్రోధస్వభావముగల కుక్కయందును (అనఁగా క్రోధమునందును) చండాలుని యందును (అనఁగా కుతర్కబుద్ధియందును) బ్రహ్మమును ఆత్మను — భగవంతుని) సమముగాఁ జూచువాఁడు స్వానుభవముగల జ్ఞాని యని చెప్పఁబడును. (౧౮)

ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః॥

ఎవ్వరియొక్క మనస్సు బ్రహ్మ మొదలు స్తంబపర్యంతము గాఁ గల వస్తువు లన్నియు భగవత్స్వరూపము లేయను విషయమందు స్థిరముగా నిలుచునో, వారలచే నీశరీరముండునప్పుడే జననమరణ స్వరూపమగునీసంసారము జయింపఁబడినది. ఏలయనిన, “భజే ద్భ్రమరకీటవత్” అర్థము:—ఎట్లు తుమ్మెద పురుగునుదాను గాఁజేయునో, అట్లు సమస్తమును భగవంతునిగాఁజూచువానిని భగవంతుఁడుతనలో నైక్యము చేసుకొనును గాన, నైక్యము నొందినవానికి జననమరణములు లేవు. ఆత్మ (భగవంతుఁడు) సకలపాపపుణ్య రహితమైనదియు సమస్తములో నంతర్యామియయినదియు, సమమయి



నదియునగువస్తువుగదా? (సముద్రమందుగొండలు, జలజంతువులు, ముత్యపుచిప్పలు, పవడపుతీగెలు మొదలగు స్థావరజంగమరూపము లైన యనేకపదార్థములుండినను, వీనినన్నిటిం జేర్చి సముద్రమని మాత్రమెట్లు చెప్పఁబడునో) అట్లుసమస్తమును భగవంతుఁడగు సముద్రముగానే చూచువారలు భగవంతునియందే యున్నారని చెప్పుట కేమిసంశయము. (౧౯)

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య
నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్।
స్థిరబుద్ధి రసమ్మూఢో
బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః॥ ౨౦॥

పరబ్రహ్మమందు (ఆత్మయందు — భగవంతునియందు) నిశ్చయబుద్ధిగలవాఁడును, మోహమనునది గొంచెమైన లేనివాఁడును, నిష్ఠ గలవాఁడునునగు బ్రహ్మజ్ఞాని తనకిష్టమైనవానిని బొందినప్పుడు సంతోషింపఁడు. తన కనిష్టమైనది సంభవించినప్పుడు దుఃఖింపఁడు అనఁగా బ్రహ్మజ్ఞాని కిష్టమైనవి సద్విషయములు. అట్టి సద్విషయములు సంభవించిన యెడల వానింగూర్చి తాను దలఁచిన సద్విషయము నెఱవేరినది యని సంతోషమును బొందఁడు. బ్రహ్మజ్ఞాని కనిష్టమైనది ద్వేషము లేక యసద్విషయములు. అనిచ్ఛాప్రారబ్ధము

వలన, అనఁగా తనయిచ్ఛగాని, ఇతరులయొక్క యిచ్ఛగాని లేకనే యకస్మాత్తుగా సంభవించు శోకాదులఁగూర్చి దుఃఖింపఁడు. (౨౦)

**బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్।**
**స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ్యమశ్నుతే॥ ౨౧॥**

ప్రపంచమందుండెడి వస్తువులగు శబ్దాదివిషయములలో నాశలేని మనస్సుగలవాఁడు దనయొక్క యంతఃకరణమం దుపశమమును నేసుఖమును బొందునో, అట్లు ఆత్మ సత్తయందు (భగవంతుని యందు) ఐక్యమును బొందిన మనస్సు గలవాఁడు నాశములేని చిత్తోపరతిని మోక్షమును బొందుచున్నాఁడు. (౨౧)

**యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।**
**ఆద్యన్తవన్తః కౌన్తేయ! న తేషు రమతే బుధః॥ ౨౨॥**

మూలప్రకృతిసంతతిఁ జేరిన జీవుఁడా! (అర్జునా!) విషయములయం దింద్రియములు ప్రవర్తించుటచేఁగలుగుసుఖము లేవి కలవో, అవి యన్నియు దుఃఖకారణములుగా ముగియును. ఏల యనిన, అవి యన్నియు నాద్యంతములుగలవి; కాఁబట్టి యనిత్యములైనవి. వాని నిజమును సద్గురుమూలముగాఁ దెలిసికొన్న వివేకి వానియం దాశ నుంచఁడు. (౨౨)



**శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్।**
**కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః॥ ౨౩॥**

ఆశచేతను, కోపముచేతను గలుగు మనస్సాంచల్యము నిచ్చటనే (ఈజన్మమందే) శరీరమును విడుచుటకుమునుపే యణఁచుట కెవ్వఁడు సమర్థుఁడో, వాఁడే మనస్సమాధానము గలవాఁడును, వాఁడే గురువుచే నుపదేశింపఁబడిన లక్ష్యమందు నిలుపఁదగిన మనస్సుగలవాఁడుగనుక వాఁడే యాత్మానుభవముగలవాఁడనియుఁ జెప్పఁబడును. (౨౩)

**యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథాఽన్తర్జ్యోతిరేవ యః।**
**స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి॥ ౨౪॥**

తనలోనే తాను సుఖించువాఁడును, తనలోనే తానురమించువాఁడును, తనలోనే తానుప్రకాశించుచుండువాఁడు నెవ్వఁడో, జీవన్ముక్తుఁడైన యాబ్రహ్మనిష్ఠుఁడు బ్రహ్మమందు లయమును (బ్రహ్మానందస్థితియగు సాయుజ్యమును) బొందును. (౨౪)

**లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః।**
**ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితేరతాః॥ ౨౫॥**

నశించిన పుణ్యపాపములు గలవారును, నశించిన సంశయమును, అజ్ఞానముగలవారును, మనస్సు మొదలగు సకలేంద్రియములను స్వాధీనముచేసుకొన్నవారును, సకలప్రాణులయొక్క హితమును గోరినవారును నగుజ్ఞానులు (పరమార్థసన్న్యాసులు) బ్రహ్మమందులయము నుబొందుదురు. (౨౫)

**కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్।**
**అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్॥ ౨౬॥**

ఆశ, కోపము మొదలగువానిచే విడువఁబడిన వారును, మనోనిగ్రహముగలవారును, ఆత్మతత్త్వమును గురూపదేశము మూలముగాఁ దెలిసికొనినవారును, ప్రథమమందు సకలకర్మఫలములను, మనస్సు నిష్ఠలోఁ బ్రవేశించినపిమ్మట సకలకర్మములఁ బరిత్యజించిన బ్రహ్మనిష్ఠులు నగు పరమార్థ సన్న్యాసులు బ్రహ్మానందమైన బ్రహ్మమందు లయమునుబొందుట యనుసాయుజ్యమును స్వశరీర మందున్నప్పుడును, లేనప్పుడును, బొందినవారలే యగుదురు. (౨౬)

**స్పర్శాన్కృత్వాబహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాన్తరేభ్రువోః**
**ప్రాణాపానౌ సమౌకృత్వానాసాఽభ్యన్తరచారిణౌ॥ ౨౭॥**
**యతేన్ద్రియ మనో బుద్ధి ర్ముని ర్మోక్షపరాయణః।**
**విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః॥ ౨౮॥**



బాహ్యవిషయములను చెవులచేవిని, మనోబుద్ధిచిత్తాహంకారములు మొదలగునవి గల యంతఃకరణ మందుఁ బ్రవేశించి యుండు శబ్దాదివిషయములను వెలుపలఁద్రోసి, తనయొక్కదృష్టిని భగవంతు నియందుంచి పదార్థములు వేఱువేఱుగాఁ గనఁబడుచుండినను, కనఁబడునదంతయు భగవత్స్వరూపమేయను సమబుద్ధిగలవాఁడై స్వాధీనమైన మనస్సు, బుద్ధి యింద్రియములు మొదలగునవిగలవాఁడును, ఆశ, కోపము, భయము, మొదలగునవిలేనివాఁడును, జననమరణరూపమగు సంసారమునుండి విడువఁబడుటయగు దుఃఖనివృత్తి యను మోక్షముకంటె నితరములైనకోరికలు లేనివాఁడును, ఎల్లప్పుడును భగవద్విషయమైన మననముగలవాఁడు నెవ్వఁడో, వాఁడు శరీరముతోనుండినను, ముక్తుండేయగును. (౨౭,౨౮)

**భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్।**
**సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాంశాన్తిమృచ్ఛతి-**

యజ్ఞము, తపస్సు మొదలగువానియొక్కఫలములకుఁ దగినజన్మముల నిచ్చెడికర్తగాను, సత్కర్మముల యొక్క ఫలములకు భోక్తగాను, సకలప్రపంచములకు నియామకుఁడుగాను సకలప్రాణులకు

నుపకారిగానుండెడి (అంతర్యామిగా సమస్తము లోను, అట్లే నీయందు నుండెడి నన్ను (తనను) సద్గురూపదిష్టమగు స్వానుభవరూపసమాధిచేఁ దెలిసికొని సమస్తదుఃఖనివృత్తియగు మోక్షమును బ్రహ్మనిష్ఠుఁడు బొందుచున్నాఁడు. (౨౯)

ఇట్లు కర్మసన్న్యాస శ్రవణయోగమను

నైదవయధ్యాయము

ముగిసెను.

---



శ్రీరస్తు.

## ఆ ఱ వ య ధ్యా య ము.



### ఆత్మ సంయమ శ్రవణయోగము.

శ్రీభగవానువాచ.

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః।
స సన్న్యాసీచ యోగీచ న నిరగ్ని ర్నచాక్రియః॥ ౧॥

పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) (జీవునికి—అర్జునునకు)
ఉపదేశించుచున్నాఁడు.

ఎవ్వాఁడు తాను జేయవలసినకర్మమును ఫలాపేక్షరహితముగాఁ జేయునో, వాఁడే కర్మపరిత్యాగముచేసిన సన్న్యాసియు, నిష్కామ కర్మయోగియు నగును. జ్ఞానమును బొందుటకుమునుపే కొన్ని వేదాంతగ్రంథములఁ జూచుటవలనను, వినుటవలనను తానుజ్ఞాని యైనట్లు తలంచుకొని తనయొక్క వర్ణాశ్రమధర్మములగు నగ్ని హోత్రాదుల వదలినవాఁడును, నిత్యనైమిత్తిక తపోదానవ్రతములు మొదలగు కర్మములను జ్ఞానమును బొందుటకుమునుపే విడిచినవాఁ

డును, సన్న్యాసియు, యోగియు కాఁడు. అనఁగా, దీనివివర
ఘును జెప్పెద వినుము జీవుఁడా ! (అర్జునా !) కర్మఫలమం దాశగల
వాఁడు కర్మఫలాశ్రితుఁ డనఁబడును. అటువంటి యాశ లేనివాఁడు
కర్మఫలానాశ్రితుఁడనఁబడును. గనుక ఫలమునపేక్షింపక తాను
చేయవలసినదియు కామ్యకర్మమందుఁ జేరనిదియునగు నగ్నిహో
త్రాదులను శాస్త్రోక్తముగాఁ జేయువాఁడు, ఫలాపేక్షతో సత్క
ర్మములను జేయువారలకన్నను, నిజముగా జ్ఞానమును బొందుటకు
మును పే తాము చేయవలసిన యాశ్రమకర్మముల విడిచిన యపర
మార్థ (వేషధారులగు) సన్న్యాసులకంటెను నుత్తముఁడని పొగడఁ
బడుటవలన నితరాశ్రమములయందుండు నర్జునుఁడను జీవుని వం
టివారు తమవర్ణాశ్రమధర్మములను విడువక చేయుదురనియు, వేష
ధారులుమాత్రముగా నుండు సన్న్యాసులు దీనిఁ దెలిసికొనుటవలన
నట్టి వేషబుద్ధిని మాని సన్న్యాసములకుఁ గావలసిన నడతలఁ దెలిసి
కొని నిజమగు సన్న్యాసస్థితిని పొందుదురనియు తలఁచి పరమదయాళు
వును, దీనరక్షకుఁడును నగు శ్రీకృష్ణమూర్తియను పరమాత్మయొక్క
తాత్పర్యమని గ్రహింప వలసిదే గాని, ఒరులను హెచ్చించి గాని, లేక,
తగ్గించి గాని చెప్పినట్లు చెప్పుటకును, తలంచుటకును గూడదు. ఏలయ
నిన, పరమాత్మయగు శ్రీకృష్ణమూర్తికి సృష్టియందు నొక్క పదార్థము
హెచ్చనియు, మఱియొకటి తక్కువ యని యునుండదు గదా? శ్రుతు
లనట్లే ఘోషించుచున్నవి.



అట్లయితే యితరాశ్రమముల యందుండువారలను, సన్న్యాసు
లనియు, యోగు లనియు నెట్లు చెప్పవచ్చును? అనిన, వినుము జీ
వుఁడా! (అర్జునా!) కర్మఫలత్యాగమును విడిచినవారుగాన, సన్న్యా
సితుల్యులనియు, ఎప్పుడు కర్మఫలాశ లేదో, అప్పుడు దానిచేఁగలుగు
సుఖదుఃఖములయందు పట్టుఁదల లేదుగాన, చిత్తస్థైర్యము గలవారు
నునగుదురు. అట్టి చిత్తస్థైర్యమును బొందినవాఁడు గనుక యోగితోఁ
దుల్యుఁడని ప్రోత్సాహము చేయఁబడుచున్నదని తెలిసికొనుము.

**యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాణ్డవ!**
**న హ్యసన్న్యస్తసఙ్కల్పో యోగీ భవతి కశ్చన॥ ౨॥**

జ్ఞానసంతతిఁ జేరిన ఓజీవుఁడా ! (అర్జునా !) జ్ఞాననిష్ఠులు దేనిని
కర్మత్యాగము (కర్మఫలత్యాగము) అని చెప్పుదురో దానినే నిష్కా
కర్మయోగమని దెలిసికొనుము. ఏకారణమువలన ననిన, ఫలాపే
క్షను వదలని (కామక్రోధాదులను వదలని) యెవఁడును నిష్కామ
కర్మయోగి కానేరఁడు. (౨)

**ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణముచ్యతే।**
**యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే ॥3॥**

ధ్యానయోగాభ్యాసస్థితిని బొందఁగోరెడియోగికి నిష్కామ కర్మము సాధనమని చెప్పఁబడినది. ధ్యానయోగాభ్యాసస్థితిని బొంది శ్రవణమననాదులను సంపూర్తిగాఁజేసి ముగించినవానికి సర్వ కర్మనివృత్తి స్థిరమైనధ్యానమునకు సాధనమని చెప్పఁబడుచున్నది. (౩)

**యదా హి నేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే।**
**సర్వసఙ్కల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥ ౪॥**

ఎవ్వఁడు శబ్దాదివిషయములలోను, కర్మములలోను ప్రియము నుంచఁడో అప్పుడు వాఁడు ఇహాముత్రార్థ కామహేతువులగు సకలాపేక్షలను విడిచినవాఁడనియు, యోగాభ్యాసస్థితిని బొందినవాఁడనియుఁ జెప్పఁబడుచున్నాఁడు. (౪)

**ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్।**
**ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః॥ ౫॥**

విషయములలో నాశలేనిపరిశుద్ధమనస్సుచేత సంసార సాగరమందు మునిఁగియుండెడి తన్నుఁ గడదేర్చుకొనవలయును. తన్ను దుర్గతిని జెందునట్లు చేసికొనఁగూడదు. ఏలయనఁగ ప్రపంచమునం దొకానొకనియొక్క పుత్రమిత్ర కళత్రములు మొదలగుబంధువులు



స్నేహపాశములకుఁ గారణమగుదురేకాని మోక్షమునకు సాధకులుకారు. కనుక తనకువశమునయుండు తనమనస్సే తనకు బంధువు. విషయములయందుఁ బ్రవేశించి తనకు వశముగాక యుండు తనయొక్కమనస్సే తనకు శత్రువని తెలిసికొనుము. (౫)

**బన్ధురాత్మాఽఽత్మన స్తస్య యేనాత్మైవాఽఽత్మనా జితః।**
**అనాత్మన స్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్॥ ౬॥**

ఎవఁడు తనయొక్కవివేకజ్ఞానముచే దేహేంద్రియ సంఘములతోఁ గూడినప్రపంచ విషయములలోను, స్వర్గాదివిషయములలోను ప్రవర్తించెడిమనస్సును నిలిపి తనవశపరచుకొన్నవాఁడెవ్వఁడో, అట్టిమనస్సు వానికి బంధువనచెప్పఁబడును. మనోజయము లేని వానికి వాని యపరిశుద్ధమనస్సు శత్రువువలె నపమార్గమందే ప్రవర్తింపఁజేయును. (౬)

**జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః।**
**శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః॥ ౭॥**

మనోజయము గలవాఁడును, కామక్రోధాది దుర్గుణముల విడిచినవాఁడును నగువానియొక్కమనస్సు శీతోష్ణసుఖదుఃఖాది ద్వన్ద్వ

ద్వములు సంభవించినను, అట్లే దూషణభూషణములు సంభవించినను, బ్రహ్మానుభవధ్యానయోగ సమాధిలోనే యుండును గాని ప్రపంచాభిముఖుఁడుగా నుండఁడు. (౭)

**జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః।**
**యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః ॥౮॥**

ఆత్మానాత్మవిషయికములగు శాస్త్రములలోనుండు సంగతులను పరిశీలన చేయుట యనెడు జ్ఞానముచేతను అట్టిశాస్త్రపరిశీలనముచేసినయంశముల గురూపదేశమూలముగా నాత్మానుభవముచేయుటయనెడు విజ్ఞానముచేతను, తృప్తిని బొందిన మనస్సుగలవాఁడును మనోవికారములేనివాఁడును, ఇంద్రియనిగ్రహము గలవాఁడును, మంటిపెళ్ళలు, రాయి, బంగారు, వీని నన్నిటిని సమముగాఁజూచువాఁడును నగుజ్ఞాని యాత్మానుభవముగలవాఁడని చెప్పఁబడును. (౮)

**సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబన్ధుషు।**
**సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే॥**

ప్రతిప్రయోజనము నపేక్షింపక యుపకారముఁజేసెడి సుహృత్తులు, ప్రతిప్రయోజనము నపేక్షించి స్నేహముచేసెడి మిత్రులు,



అపకారముఁజేసెడి శత్రువులు, వివాదముగల యిరుతెఱంగులవారికిని సాధకబాధకములఁ దాను జేయఁదగిన వాఁడైనను యిద్దరిలోనొకరికైనను సాధకబాధకములఁజేయక యుండు నుదాసీనులు, వివాదముగలయిద్దరికిశ్రేయస్సునుగోరు మధ్యస్థులు, తననువిరోధించినద్వేషులు, తనయందువిశ్వాసముగల బంధువులు మొదలగు వీరందరియందును, సద్గుణములుగల సత్పురుషులయందును దుర్మార్గులయందును, పాపులయందును, సమబుద్ధిగలవాఁడు శ్రేష్ఠుఁడని (యోగారూఢులలో నుత్తముఁడని) చెప్పఁబడుచున్నాఁడు. (౯)

**యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః।**
**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః॥ ౧౦॥**

మనస్సును, ఇంద్రియములను స్వాధీనముచేసుకొన్నవాఁడును, ఆశలేనివాఁడును, తనకని యొకవస్తువునుంచుకోననివాఁడును నగు ధ్యానోపాయమైన యోగము నభ్యసించువాఁడు, ఒకఁడుగా నుండఁదగిన సన్న్యాసాశ్రమమును జెంది, కొండలు, గుహలు మొదలగు నేకాంత స్థలములవంటి స్థలముల యందుండు వాఁడై మనస్సును ఎల్లప్పుడునిశ్చలముగాఁజేయవలసినది. (౧౦)

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్॥ ౧౧॥
తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః।
ఉపవిశ్యాసనే యుఞ్జ్యా ద్యోగ మాత్మ విశుద్ధయే॥ ౧౨॥

పరిశుద్ధస్థలమందు మిక్కిలియున్నతముగానిదియు, మిక్కిలిపల్లము గానిదియునగు దర్భాసనము, వానిపైన కృష్ణాజినము, లేక, పులిచర్మము, దానిపైన వస్త్రముతోఁగూడిన యాసనముగలవాఁడై, అడుగడుగుకుఁ దానుపూర్చకయుండెడి (అనఁగా దానుకే యాసనమున మఱింతసేపు గూర్చుండఁదగిన) యాసనమునఁ గూర్చుండి అట్టి స్థిరాసనమునందుండునప్పుడు మనస్సును నిశ్చలముచేసి మనస్సు యొక్కయు ఇంద్రియముల యొక్కయు వ్యాపారములు లేనివాఁడై మనస్సు శుద్ధతనుబొందుట కొఱకు బ్రహ్మధ్యానము నభ్యసింపవలయును. (౧౧, ౧౨)

సమం కాయశిరోగ్రీవం ధారయన్న చలః స్థిరః।
సమ్ప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥౧౩॥
ప్రశాన్తాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః।
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః॥ ౧౪॥



ధ్యానాభ్యాసము చేయువాఁడు శరీరము, శిరస్సు, కంఠము, వీనిని కదలకుండ సమముగా నిలిపి, కొంచెము కాలమట్లుసమముగా నిలుపఁదగిన స్థిరిగలిగినప్పుడు ఇతరదిక్కులను జూడక తనయొక్క నేత్రములను మధ్యముననుండు భ్రూమధ్యమును జూచువాఁడువలెఁ జూపును నిలిపి, మనసును విషయములలో బ్రవేశింపక యరిగట్టి తనకుఁగల వ్యవహారముల యందును గూడ మనసును బ్రవేశింపనీయక, ఆత్మను జెందఁజేసి జననమరణ భయములు లేనివాఁడై, స్త్రీలను విషయాసక్త బుద్ధితోఁ జూడకుండుట, లేక, తలంపకుండుట, భిక్షాటనము చేసి భుజించుట, గురుశుశ్రూష, వేదాధ్యయనము బ్రహ్మవిచారణ చేయుట మొదలగు బ్రహ్మచర్య వ్రతముల యందుండువాఁడై, తనకుసద్గురువుపదేశించిన లక్ష్యార్థముగునాయందుఁ (ఆత్మయందు) చిత్తమును నిలిపినవాఁడుగను, నాయందే (పరమాత్మయందే) మనోలయమును బొందుటయను ధ్యానాంతమైన నిష్ఠను గలవాఁడుగను నుండవలెను. (౧౩, ౧౪)

యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః।
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి ॥౧౫॥

విషయములనుండి మఱలింపఁబడిన మనస్సుగల ధ్యానాభ్యాసి యెప్పుడు పైనఁజెప్పఁబడిన ప్రకారము మనస్సును నిశ్చలముగాఁ

జేయుటవలన జననమరణ సంసారనివృత్తియంతముగాఁగలదియు, పరమాత్మయందు లయమును బొందఁగూడినదియునగు చిత్తవిశ్రాంతిని బొందుచున్నాఁడు. (౧౫)

**నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాన్తమనశ్నతః।**
**నచాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున॥ ౧౬॥**

ఓజీవుఁడా ! (అర్జునా !) ధ్యానయోగాభ్యాసి యెట్టి విధములగు నాహార నియమములు గలవాఁడుగా నుండ వలసినదో, చెప్పెద వినుము. ధ్యానయోగము, శరీరము నిలిచియుండుటకు దగినసాధనమగు పరిమాణమునకన్న నధికముగా భుజించు వానికిఁ గలుగ నేరదు. శరీరమునిలిచియుండుటకుఁ దగిన సాధనమగు పరిమాణమున కన్నఁ దక్కువగాభుజించువానికినిఁ గలుగ నేరదు. అతినిద్రాళువునకును, బొత్తిగా నిద్రలేనివానికినిఁ గలుగనేరదు. (౧౬)

**యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు।**
**యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥౧౭॥**

అయితే యెట్టివానికి ధ్యానాభ్యాస సిద్ధి గలుగునని యడిగెదవేమో, చెప్పెదవినుము. మితమగునాహార సంచారములు గలవాఁడును, మితమైన కర్మములు గలవాఁడును, మితమైననిద్రగలవాఁడును నగు



ధ్యానాభ్యాసికి జననమరణ రూపమగు సంసార దుఃఖమునుబోఁగొట్టఁదగిన ధ్యానయోగము సిద్ధించును. (౧౭)

**యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే।**
**నిస్స్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥**

ఎప్పుడు యోగాభ్యాసి యొక్క మనస్సు బాహ్యవిషయసంబంధములనువిడిచి యేకాగ్రతగలదియై పరమాత్మ యందే (తన స్వరూపమునందే) నిలుచునో, ఎప్పుడు సకలవిషయములయందును గలుగు నాశనుండి విడువఁబడునో, అప్పుడు ధ్యానాభ్యాసమున కర్హుఁడని చెప్పఁబడును. (౧౮)

**యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా।**
**యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః॥**

ఆత్మధ్యానము నభ్యసించువాఁడును, స్వాధీనమైన మనస్సు గలవాఁడు నగు వానియొక్క నిష్ఠ, గాలిలేని స్థలమందట్లు దీపము కొంచెము కూడఁ గదలక నిలిచిప్రకాశించునో, అటువంటిదీపమునకు సమానమగు నానిష్ఠ యోగానుభవముగల వారలచే శ్రేష్ఠమైనదిగాఁజెప్పఁబడియున్నది. (౧౯)

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా।
యత్ర చైవాఽఽత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥
సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్।
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥౨౧॥
యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే ॥౨౨॥
తం విద్యాద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితమ్।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా॥౨౩॥

యోగాభ్యాసముచే విషయములనుండి మఱలింపఁబడినమనస్సు యెద్ధ్యానాభ్యాసకాలమం దేకాగ్రముగా నిలుచునో, యట్టి ధ్యానాభ్యాసమునం దుండువాఁడు సమాధివలన బరిశుద్ధమైనమనస్సుచేఁ స్వయంజ్యోతి స్స్వరూపమగు నాత్మను (స్వస్వరూపమును) సాక్షాత్కరించి స్వానుభవమును బొందినవాఁడై యాత్మ యందే (స్వస్వరూపమునందే) యానందించుచుండునో, అట్టి ధ్యానయోగము నదియు మనస్సును స్థిరముగా నిలుపఁదగిన యీ ధ్యానయోగి యింద్రియములకగపడనిదియు బ్రజ్ఞయను బుద్ధియొక్క స్వానుభవముచే గ్రహింపఁదగినదియు, నిత్యమైనదియు నగు నేసుఖమును



స్వానుభవముచేఁదెలిసికొనునో, మఱియు నేస్వానుభవమునుండి కించిత్తైన మఱలఁడో, ఏస్వానుభవమును బొందిన పిమ్మట దాని కన్యములై యనిత్యములగుభూలోకస్వర్గలోకాది సుఖలాభములను స్వానుభవానందమునకన్న నధికమని తలంపఁడో, ఏధ్యానమునందుండువాఁడై విశేషవ్యాధి దుఃఖము మొదలగునవి సంభవించినను గూడఁగదలింపఁబడఁడో, (మనోవికల్పమునొందఁడో) సకలదుఃఖములలో సంబంధించిన విషయప్రవర్తిని బోఁగొట్టు వెనుకటి శ్లోకములయం దిదివఱకుఁజెప్పఁబడిన యభ్యాసమును ధ్యానమనెడి పేరుగలదిగాఁదెలిసికొనుము. యోగాభ్యాసముచేత నెంతకష్టముండినను, వానిచే దుఃఖమును బొందనిమనస్సుగలవానివలన నట్టి ధ్యానయోగము మనకు సిద్ధింపవలెనను నెడతెగనియభ్యాసముతోఁ గూడిన గట్టిపట్టుదలచేఁ బొందఁదగినది. (౨౦-౨౧-౨౨-౨౩)

సఙ్కల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వానశేషతః।
మనసైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః॥ ౨౪॥
శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్ ॥ ౨౫॥

సంకల్పముచేఁగలుగు సకలములైన విషయవాసనలనెడు కోరికలను వాసనలతోఁగూడ సంపూర్ణముగా విడిచిపెట్టి వివేకముగలమనస్సు

చేతనే సకలేంద్రియములను సకలవిషయములనుండి త్రిప్పి యెడతెగని యభ్యాసముచేతను, దృఢముగుపట్టుదలచేతను వానిని స్వాధీనముచేసు కొని నిశ్చయాత్మకమగుబుద్ధిచే సంకల్పాత్మకమగు మనస్సును నాత్మ యందు (భగవంతునియందు—స్వానుభవమందు) స్థాపించి చలింపక నిలుచునట్లుచేసి కొంచెముకొంచెముగా నభ్యాసవిశేషముచే బాహ్య ప్రపంచ విషయమునుండి మనసును మఱలింపవలయును. ధ్యాన కాలమందు భగవంతుని(ఆత్మను)తప్ప రెండవ వస్తువునందుమనస్సుఁ బ్రవేశింప నియ్యఁగూడదు. అనఁగా భగవంతునిదప్ప యితరమగు దేనిని స్మరింపఁగూడదు. (౨౫—౨౬)

యతో యతో నిశ్చరతి మన శ్చఞ్చల మస్థిరమ్।
తత స్తతో నియమ్యైత దాత్మ న్యేవ వశం నయేత్ ॥ ౨౬॥

చలన స్వభావము గలదిగనుక నెక దానియందు నిలుకడలేని మనస్సు యేయేవిషయములయందుఁ బ్రవర్తించుటకై లోపలనుండి బయలు వెడలునో, ఆయావిషయ ములనుండి యీ మనసును ద్రిప్పి భగవంతునియందే (స్వస్వరూపమునందే) నిలువఁదగినట్లు స్వాధీనముచేసుకొనవలయును. (౨౬)

ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్।
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూత మకల్మషమ్॥ ౨౭॥



ప్రజరించువిషయములయందుఁ బ్రవర్తించని స్వాధీనమైన మనస్సు గలవాఁడును, కామక్రోధాది దుర్గుణములగు రజోవికారములు లేని వాఁడును, శరీరముపోయిన పిమ్మటగలుగుఁ జననమరణరూపసంసారనివృత్తియనెడి స్థితియగు దుఃఖనివృత్తియని చెప్పఁబడు స్థానమును శరీరముండగనే యనుభవించు వాఁడనెడు జీవన్ముక్తుఁడును, నశించిన యాగామి సంచితములు గలవాఁడును నగు నిదివఱకుఁ గలశ్లోకములచేఁ జెప్పఁబడిన ధ్యానయోగిని శ్రేష్ఠమైన సుఖమనెడు మోక్షము తనంతటనే చెందుననునది శ్రుతప్రసిద్ధము. (౨౭)

యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యన్తం సుఖ మశ్నుతే॥ ౨౮॥

పైనఁ జెప్పఁబడిన ప్రకార మెల్లప్పుడును మనస్సును స్వానుభవమందు నిలిపినవాఁడగు పుణ్యపాపములులేని ధ్యానయోగి, యనాయాసముగా బ్రహ్మసాక్షాత్కార రూపమగు పరమానంద సుఖమును బొందును. (౨౮)

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ ౨౯॥

బ్రహ్మ మొదలగు తృణపర్యంతములైన సకలపదార్థములయందును హెచ్చుతక్కువలులేక సకలమును బ్రహ్మస్వరూపమేయని (తనస్వరూపమేయని=తానేయని) చూచువాఁడును, ధ్యానమం దేకాగ్రమనను గలవాఁడును నగుయోగి, తన్ను సకలభూతములలోనుండు వానిగను, తనయందు సకలభూతములుండునవిగను చూచును.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి।
తస్యాహం నప్రణశ్యామి సచమే నప్రణశ్యతి॥ ౩౦॥

ఎవ్వఁడు సకలవస్తువులలోను నన్నుఁ జూచునో, అన్నివస్తువులను నాయందుఁ జూచునో, వానికి నేను కనఁబడకపోను. వాఁడును నాకుఁ గనఁబడక పోఁడు; అనఁగా వాఁడే నేను. నేనేవాఁడని తెలిసికొనుము. (౩౦)

సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥ ౩౧॥

సర్వభూతములలో నుండునన్ను నభేదజ్ఞానముగలవాఁడై ధ్యానించునో, అట్టి ధ్యానయోగి నిష్ఠలోనుండునప్పుడును, లేనప్పుడును, నాయందే యున్న వాఁడగును; అనఁగా వానినే నిత్యముక్తుఁడని పెద్దలు చెప్పుదురు. (౩౧)



ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున!।
సుఖంవా యదివా దుఃఖం స యోగీ మయి వర్తతే॥ ౩౨॥

జ్ఞానమును సంపాదింపఁదగిన ఓజీవుఁడా! (అర్జునా!) సకలప్రాణులయందలి సుఖమును, లేక, దుఃఖమును దనదిగా నెవ్వఁడు చూచునో, అట్టి ధ్యానయోగి శ్రేష్ఠమైనవాఁడని. నాయభిప్రాయము. (౩౨)

### అర్జున ఉవాచ.

యోఽయం యోగస్త్వయాప్రోక్తః సామ్యేనమధుసూదన!॥ ఏతస్యాహం నపశ్యామిచఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్॥ ౩౩॥

జీవుఁడు (అర్జునుఁడు) ప్రశ్నచేయుచున్నాఁడు.

సంసారవిపత్తునుండిదాఁటించు ఓపరమాత్మా! (శ్రీకృష్ణమూర్తీ!) నిశ్చలమనస్సుచే నెఱవేర్పఁదగిన యేధ్యానయోగము నీచేఁజెప్పఁబడినదో, ఆ యీధ్యానయోగము చలింపనిమనస్సు గల స్థితిని, మనస్సెల్లప్పుడు చంచలస్వభావముగలదిగనుక నేను తెలుసుకొనలేకయున్నాను. (౩౩)

చఞ్చలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవద్దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥ ౩౪॥

భక్తులయొక్క పాపములఁ బోఁగొట్టి కాపాడు ఓపరమాత్మా! (శ్రీకృష్ణమూర్తీ!) మనస్సు మిక్కిలి చంచలస్వభావముగలదియు, దేహేంద్రియాదులకు దుఃఖమును గలుగఁజేసి పరాధీనముగాఁ జేయునదియు, నిగ్రహింపనశక్యమైనదియు, విషయములయందు మిక్కిలి పట్టుదలగలదియు, నావిషయములలో నేయెల్లప్పుడు ప్రవర్తించుచుండు స్వభావముగలదియునయియున్నది గదా? అట్టి మనస్సును స్వాధీనముచేసికొనుటయనునది, గాలిని సంచరింపనీయక కట్టిపెట్టుటయెట్లు కష్టమో, అట్లు యెవ్వారలకును వలనుపడని కార్యమని తలంచుచున్నాను. (౩౪)

శ్రీభగవానువాచ.

అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్।
అభ్యాసేన తు కౌన్తేయ! వైరాగ్యేణ చ గృహ్యతే॥ ౩౫॥

పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) చెప్పనదేమనఁగా:—

మూలప్రకృతి సంతతిజేరిన యింద్రియ నిగ్రహముగల ఓ జీవుఁడా! (అర్జునా!) మనస్సు స్వాధీనపరచుకొనుట కశక్యమైనదని



యు, చంచలస్వభావముగలదనియు, చెప్పుటలో నేమియు, సందియము లేదు. (ఇటువంటిప్రత్యుత్తర మెవ్వారలకుఁజెప్పవలసినదని యడిగెదవా? సత్సంగము లేనివానికి, సద్గురులాభము గిట్టని వానికిఁ జెప్పవలసినమాటలని తెలిసికొనుము. పైజెప్పినతెగల నీబోటివారలకు వెనుకఁ జెప్పఁబోవు సంగతు లని చక్కఁగా గమనించుము.) మనస్సు అట్టిదిగానుండినను, అట్లువిషయములఁ గూర్చి పరువిడు మనస్సును సత్సంగముచేతను, సద్గురువుచే నుపదేశింపఁబడినలక్ష్యమందునిలువక యెడతెగకపరుగిడు మనస్సును నిలుపుటయను పట్టుదలగలప్రయత్నమగు నభ్యాసముచేతను, సద్గురుముఖముగాఁ దత్త్వవిచారణ శ్రవణముఁజేసి, పిమ్మట మననమభ్యసించి, యట్టి యభ్యాసమువలన ప్రపంచ విషయములయందుఁగల దోషస్వభావముఁదెలుసుకొని, వానియందుఁగలుగు నిషేధబుద్ధియను వైరాగ్యముచేతను మనస్సును వశపరచుకొనవలసినదని యెఱుంగుము. (౩౫)

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః॥

పైనఁజెప్పఁబడిన శ్లోకముప్రకారము అభ్యాస వైరాగ్యముల వలనస్వాధీనముచేసుకొనని మనస్సుగలవారలచే ధ్యానయోగము పొందుట కశక్యమని నాయొక్క తాత్పర్యము నిశ్చయముగ

నున్నది. అయినను, ఎడతెగనియభ్యాసముచేతను, సద్గురువుయొక్క యాజ్ఞను దప్పక నెఱవేర్చుటయను పట్టుదలచేతను, స్వాధీనముచేసుకొన్న మనస్సుగల విడువనిప్రయత్నము చేయువానిచే సత్యాంతవైరాగ్యముచేతను, నెడతెగని యభ్యాముచేతను పొందుటకు సాధ్యమైనదని యెఱుంగుము. (౩౬)

అర్జున ఉవాచ.

అయతిశ్శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ! గచ్ఛతి॥౩౭॥

జీవుఁడు (అర్జునుఁడు) చెప్పునదేమనఁగా:—

భక్తులయొక్క పాపములఁబోఁగొట్టు ఓపరమాత్మా! (శ్రీకృష్ణమూర్తీ!) సద్గురువాక్యములను నమ్మి యట్టినమ్మకముతోఁ జేరినభక్తివలన ధ్యానాభ్యాసమును జేయుటకు బ్రారంభించువాఁడును, ధ్యానాభ్యాసమును విడువనిప్రయత్నముతో నభ్యాసముఁజేయని వాఁడును, మనకిది కలిసివచ్చుట గష్టమనియు నితరవిషయాసక్తులచేఁ జంచలచిత్తుఁడై ధ్యానయోగాభ్యాసమును మధ్యకాలమందువిడిచిపెట్టినవాఁడు నగు నొకఁడు ధ్యానయోగస్థితిని, బొందఁడుగదా? అట్టివాఁడు యేగతిని బొందును? (౩౭)

కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి।
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి॥ ౩౮॥

ఓపరమాత్మా! (శ్రీకృష్ణమూర్తీ!) కర్మయోగ మార్గమునుండి తొలంగినవాఁడును, స్వానుభవమును బొందుటయను మార్గవిషయమై జ్ఞానములేని (సద్గురువును జెంది కొంచెము కాలము వారియాజ్ఞనుగైకొని ధ్యానాభ్యాసముచేసి పిమ్మట ప్రపంచ విషయాశచేతను అసత్సాంగత్యము చేతను జ్ఞానశూన్యుఁడై) ధ్యానాభ్యాసమును విడిచిపెట్టిన మూఢుఁడు నిరాధారుఁడై, గొప్పమేఘముగానుండి వేఱై ఛిన్నాభిన్నముగాఁ జెదరిపోయిన యల్పమేఘములువలె వీఁడును దినేదినే కృశించి చెడిపోవునా యేమి? అనఁగా దుర్గతిఁబొందునాయేమి? (౩౮)

ఏతం మే సంశయం కృష్ణ! ఛేత్తుమర్హస్యశేషతః।
త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా నహ్యుపపద్యతే ॥౩౯॥

ఓపరమాత్మ! (శ్రీకృష్ణమూర్తీ!) పైనజెప్పఁబడిన సంశయమును సంపూర్ణముగాఁ బోఁగొట్టఁదగినవాఁడు నీవే యయియున్నావు. ఇట్టి సంశయమునునివర్తింపఁజేయువాఁడు నీవుదప్ప మఱియొకఁడు ఋషులలోఁగాని, దేవతలలోఁగాని లేఁడు. (౩౯)

శ్రీభగవానువాచ.

పార్థ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే।
నహి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత! గచ్ఛతి॥ ౪౦॥

పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) ప్రత్యుత్తరము చెప్పుచున్నాఁడు:—

అవివేకమును శోషించు ఓజీవుఁడా! (అర్జునా!) ధ్యానయోగభ్రష్టుని కీలోకమునందుఁ బూర్వజన్మమునకన్న హీనస్థితి యను జన్మప్రాప్తియైన నాశముగలుగనేరదు. పరలోకమందును హీనగతి గలుగనేరదు. ఏమియుఁదెలియని బాలునివంటి చిన్నవాఁడా! (జీవుఁడా!) మంచికార్యమును చేసినయెవఁడును దుర్గతిని బొందఁడనునది శ్రుతిప్రసిద్ధియని యెఱుంగుము. (౪౦)

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥

ధ్యానాభ్యాసమునుండి తొలంగినవాఁడు (ధ్యానాభ్యాసముఁ గొంతకాల మభ్యసించి మధ్యలో వదలిపెట్టినవాఁడు) అశ్వమేధము మొదలగు గొప్పయాగములు చేసిన వారలు పొందఁదగిన లోకములను బొంది, యనేకకాలము లాలోకభోగములననుభవించి, పిమ్మట "క్షీణేపు



ణ్యేమర్త్యలోకం విశన్తి" అను శ్రుతిప్రకారము, యీభూమియందు జన్మించునప్పుడు సదాచారముగలవారైశ్వర్యవంతుల గృహమందుఁ బుట్టును. (౪౧)

అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్॥ ౪౨॥

ధ్యానయోగాభ్యాస మనేక కాలమభ్యసించి స్వానుభవమును బొందుటకుమును పే మృతినొందినయెడల నట్టివాఁడు జ్ఞానవంతులుగా దరిద్రులై ధ్యానాభ్యాసము చేయుచుండువారి వంశమునందుఁ బుట్టును. ఈప్రపంచమం దిట్టి వంశమందుఁ బుట్టుట యతిదుర్లభమని యెఱుంగుము. (౪౨)

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్।
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునన్దన!॥ ౪౩॥

అపరిమితానందమును బొందఁదగిన ఓజీవుఁడా! (అర్జునా!) అట్లు యోగికులంబునఁ బుట్టి పూర్వజన్మసంబంధమైనదియు, శ్రీ భిన్నమునందుఁ దన్ను వాసనారూపముగా వెంబడించునదియు నగు నాత్మ (భగవత్) విషయమైన జ్ఞానమునకు సాధనమగు పూర్వజన్మమునందుఁ దానభ్యసించి సిద్ధినిఁజెందని ధ్యానయోగాభ్యాసమును క్షేం

దుచున్నాఁడు. అటువంటి పూర్వజన్మ సంస్కారవిశేషమువలనఁ బూర్వజన్మమునందుఁ జేయకనిలిచిపోయిన ధ్యానయోగముయొక్క యుపరిభాగము నతిప్రయత్నముతో నభ్యసించు వాఁడగును.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపిసః।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే॥ ౪౪॥

పూర్వజన్మమందు సంపూర్తిచేయకవిడిచిపెట్టిన ధ్యానాభ్యాసి యీజన్మమందు విఘ్నవిశేషమువలనఁ దానుగా ధ్యానాభ్యాసముఁ బ్రారంభించక పోయినను, పూర్వజన్మమందు ధ్యానాభ్యాసముచేసిన పుణ్యవిశేషమువలన బలాత్కారముగా సంసారవిషయములనుండి ధ్యానాభ్యాసమునకు నాకర్షింపఁబడుచున్నాఁడు. అనఁగాఁబూర్వజన్మమందుఁ జేయుచువచ్చిన ధ్యానాభ్యాస పుణ్యమువలన నీజన్మమందు సత్సంగముగలిగి, సద్గురువుదొరికి సంసారమం దేదోయొక హఠాత్తుగా సంభవించిన కారణమువల్ల నందుండి తొలఁగి యెల్లప్పుడును సద్గురువాజ్ఞను గైకొని యించుకయైనను దప్పక యాచరించి ధ్యానాభ్యాసముఁ జేయువాఁడగును. ఎప్పుడిట్టి ధ్యానయోగము నభ్యసింపఁ దలంపు గలవాఁడై యభ్యాసమును పట్టుదలతోఁ జేయుటకుఁ బ్రారంభించునో, అప్పుడు వేదోక్త కర్మానుష్ఠాన ఫలము నతిక్రమించినవాఁడగును. (౪౪)



ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః।
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాంగతిమ్॥ ౪౫॥

ధ్యానాభ్యాసి విడువనిప్రయత్నముతో నభ్యసించువాఁడై, కొంచెపుకాల మభ్యసించినపిమ్మట యట్టియభ్యాసమువలనఁ పాపము నుండివిడువఁబడి యనేక జన్మములయం దీవిధముగాఁజేసినయభ్యాస విశేషమువలనఁ గలిగిన యోగసిద్ధినిబొంది, దాని వలన బ్రహ్మజ్ఞానము గలిగి పిమ్మట నట్టి బ్రహ్మాత్మైక్య స్వానుభవ నిష్ఠను బొంది బ్రహ్మసాయుజ్యమను నుత్తమ మోక్షమునుబొందును. (౪౫)

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః।
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున!॥ ౪౬॥

ధ్యానయోగి, వ్రతములు, మంత్రపునశ్చరణములు మొదలగు ననేక తపస్సులఁ జేసినవారికన్న శ్రేష్ఠమైనవాఁడనియు, ప్రసిద్ధమైనశాస్త్రజ్ఞానముగలవారలకంటె శ్రేష్ఠుఁడనియు, నగ్నిహోత్రాది సత్కర్మములఁజేయువారలకన్న శ్రేష్ఠుఁడనియు, జ్ఞానులచేఁ దలంపఁబడుచున్నాఁడు. ఇట్టి కారణములవలన ఆగామి సంచిత ప్రారబ్ధములయొక్కమూటలను పోగొట్టుజ్ఞానమును సంపాదింపఁదగినజీవుఁడా !(అర్జునా !) నీవు నటువంటి ధ్యానాభ్యాసివి కమ్ము. (౪౬)

**యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా।**
**శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః॥**

అన్నివిధములయిన యోగులలో నెవ్వఁడు నాయందు (భగవంతునియందు) నిలుపఁబడిన మనస్సుచేత సద్గురూపదేశమందు శ్రద్ధగలవాఁడై యుపదేశించు లక్ష్యార్థమునకు స్వరూపముగ నన్ను (భగవంతుని) ధ్యానముచేయునో, అట్టి ధ్యానాభ్యాసము మిక్కిలి శ్రేష్ఠమైనదని నాయొక్కయభిప్రాయము. (౪౭)

ఇట్లు ఆత్మసంయమ శ్రవణయోగ మను

నాఱవయధ్యాయము సమాప్తము.

ఓం తత్ సత్.

---



శ్రీరస్తు.

# ఏడవ యధ్యాయము.

---

## విజ్ఞాన మనన యోగము.

శ్రీభగవానువాచ.

**మయ్యాసక్తమనాః పార్థ! యోగం యుఞ్జన్మదాశ్రయః।**
**అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥౧॥**

పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) చెప్పున దేమియనిన:—

ఓజీవా! (అర్జునా!) నీవు పరమాత్మయగు నాయందు నాసక్తమయిన మనస్సుగలవాఁడవుగాను, మనస్సమాధానమును గలుగఁజేయు ధ్యానాభ్యాసయోగము ననుష్ఠించు వాఁడవుగాను, నన్నే (పరమాత్మనే=భగవంతునే) శరణు చొచ్చిన వాఁడవుగానుండి, సంశయవిపరీతములులేని జ్ఞానము గలుగవలయునని సకలవిభూతి (సమత్వబుద్ధి) బలము (బ్రహ్మతేజస్సు) శక్తి (మూలప్రకృతి, మాయ, వీనిని వశపఱచుకొనునట్టి సామర్థ్యము) ఐశ్వర్యము (జ్ఞాన స్వరూపము) మొదలగు గుణములతోఁ గూడుకొనిన నన్ను (పరమాత్మను) సంపూర్ణముగాఁ దెలిసికొనఁగలవో, అట్టిజ్ఞానమును బొందు నుపాయమును జెప్పెద వినుము. (౧)

జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్జ్ఞాతవ్య మవశిష్యతే॥ ౨॥

దేనిం దెలిసికొన్నపిదప నీమోక్షమార్గమందు మరల నీవు మఱియొక యుపాయమును వెదుకకయుందువో, అట్టి స్వానుభవముతోఁ గూడిన యీజ్ఞానమును (శ్రవణముచేఁగలిగి మననము చేయవలసిన దానిని) యించుకైన వదలక నేను నీకుఁజెప్పెద వినుము. (౨)

మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే।
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥ 3॥

అన్ని ఫలంబులలోను శ్రేష్ఠమగు నీజ్ఞానము నొకా నొకఁడు పొందుట మిక్కిలి దుర్లభంబు. ఏలయనిన, చక్కఁగా శాస్త్రముల నెఱింగిన వెయ్యింటిలో (అనఁగా ననేకులలో) నొకఁడు ధ్యానయోగాభ్యాసమునకుఁ బ్రయత్నపడును. అట్లు ధ్యానాభ్యాసమునకుఁ బ్రయత్నపడి యొనర్చి సంపూర్తిఁ జెంది స్వానుభవముగు జ్ఞానము నొందినవారలలో వెయ్యింటిలో (అనఁగాఁ ననేకులలో) నొకఁడు నన్ను నిజముగాఁ దెలిసికొనునో, లేదో; కనుక స్వానుభవముగు నిష్ఠాజ్ఞానమును బొందుట మిక్కిలి యరుదు. (3)



భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ।
అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా॥ ౪॥

పృథివి తన్మాత్రయగు గంధగుణంబును, జలతన్మాత్రయగు రసగుణంబును, అగ్నితన్మాత్రయగు రూపగుణంబును, వాయుతన్మాత్రయగు స్పర్శగుణంబును, ఆకాశతన్మాత్రయగు శబ్దగుణంబును, మనస్సునకుఁ గారణమయిన యహంకారతత్త్వంబును, అహంకారతత్త్వమునకుఁ గారణమయిన మహత్తత్త్వంబును, మహత్తత్త్వంబునకుఁ గారణమయిన యవిద్యతోఁ గూడిన యవ్యక్తంబును, ఈ ప్రపంచమునకు గారణమయిన నాయొక్క యపరప్రకృతి (మాయాశక్తి) యిట్టి యెనిమిది విధములయిన భేదములం జెందెను. (౪)

అప రేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్।
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్॥

ఇంద్రియనిగ్రహముగల ఓ జీవుఁడా! (అర్జునా!) ఈ యెనిమిది విధములుగల యపరప్రకృతి (జడప్రకృతి) మిక్కిలి చెడుపులను గలుగఁజేయఁదగినది. ఇట్టి ప్రకృతికంటెఁ బరిశుద్ధమయినదియు, నే ప్రకృతివలన నీప్రపంచము నిలిచియున్నదో అట్టి జీవస్వరూపమయినదియు, నాయొక్క స్వరూపమయినదియు నగు స్వాధీనమయిన ప్రకృతిని శ్రేష్ఠమయిన దానిగాఁ దెలిసికొనుము. (౫)

ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా॥ ౬॥

సకలభూతములు నీద్వివిధంబులయిన జడప్రకృతి చేతనాప్రకృతులవలనఁ గల్గినవని తెలిసికొనుము. అనఁగా జడప్రకృతి శరీరరూపమయినదనియుఁ జేతనాప్రకృతి జీవస్వరూపమయిన దనియుఁ దెలిసికొనుము. అట్టి ప్రకృతి ద్వయంబు మూలముగా సకల ప్రపంచముయొక్క యుత్పత్తికిఁ గారణమయినవాఁడును, స్థితికిఁ గారణమయినవాఁడును, లయమునకుఁ గారణమయిన వాఁడును నేనుగానే యున్నాను. అనఁగా "నేను" అనుస్థితి యెచ్చటనున్నదో, అచ్చట యుత్పత్తి,స్థితి,గలదు. "నేను" అనునది యెచ్చటలేదో, అచ్చట లయముగలదు. కావున నేను ఉత్పత్తిస్థితిలయములకుఁ గారణంబని చెప్పఁబడినది. (౬)

మత్తః పరతరం నాన్య త్కిఞ్చి దస్తి ధనఞ్జయ!।
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥ ౭॥

ఆశనుజయించిన ఓ జీవుఁడా! (అర్జునా!) నాకంటెను మిగుల శ్రేష్ఠమయిన వస్తువు వేఱొక్కటియు లేదు. మన కగపడునవియు అగపడనివియు నయిన సకలవస్తువులు నాకంటె వేఱైనవి గావు (సకలము నేనుగానేయున్నాను.) దారమునందు ముత్యములును



రత్నములును, మొదలయినవి గ్రుచ్చఁబడినట్లు, సూత్రమగు నాయందు నీ సకల ప్రపంచము లనెడు రత్నములు (సంసారములు) గ్రుచ్చఁబడియున్నవి. (౭)

రసోఽహ మప్సు కౌన్తేయ! ప్రభాఽస్మి శశిసూర్యయోః।
ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥ ౮॥

మూలప్రకృతియొక్క పుత్రుఁడగు ఓ జీవుఁడా! (అర్జునా!) ద్రవ (నీరువంటి) పదార్థములయందుఁగల రుచియును (రసతన్మాత్రయును), మనసు నేత్రము మొదలగువానిలోఁగల ప్రకాశమును, సకలములయిన ప్రవచనములయందు నోంకారమును, చిదానందమయబ్రహ్మాకాశమందుఁగల శబ్దమును (శబ్దతన్మాత్రయును), మనుష్యులలో నాత్మవివేచన స్థితియును (ఆత్మయే.) (౮)

పుణ్యో గన్ధః పృథివ్యాఞ్చ తేజశ్చాస్మి విభావసౌ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు॥ ౯॥

మంటియందుఁగల సువాసనయు (గంధతన్మాత్రయు), అగ్నియందుఁగల ప్రకాశంబును (రూపతన్మాత్రయు) నేనే. సమస్తములోను ప్రాణస్వరూపముగనుండు నాయుస్సును (స్పర్శతన్మాత్రయు), బ్రహ్మచర్య, గార్హపత్య, వానప్రస్థ, సన్న్యాసముల యొక్క నిష్ఠారూప

మయిన తపస్సును, నేనే (ఆత్మయే). అనఁగా నన్నింటిలో నే నను స్యూతుఁడనై యున్నాను. (౯)

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ! సనాతనమ్।
బుద్ధి ర్బుద్ధిమతామస్మి తేజ స్తేజస్వినా మహమ్॥ ౧౦॥

ఓ జీవుఁడా! (అర్జునా!) నిత్యుఁడనయిన నన్ను సకలభూతములకు మూలాధారమయిన వానిఁగాఁ దెలిసికొనుము. బుద్ధిశాలుర యొక్క నిశ్చయాత్మకమయిన బుద్ధియు, ధైర్యశాలుర యొక్క మనోధైర్యంబును, నేనే (ఆత్మయే). (౧౦)

బలం బలవతాంచాహం కామరాగవివర్జితమ్।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ!॥ ౧౧॥

ఓ జీవుఁడా! (అర్జునా!) మోక్షమను జననమరణరహితమయిన పురుషార్థమును జెందుటకుఁ బ్రయత్నము చేయువారులయొక్క యిచ్ఛాద్వేషములు లేనిమనోబలంబును (ఫలాపేక్షనువదలి స్వవర్ణాశ్రమధర్మకర్మంబులఁ జేయు వారియొక్కమనోబలంబును), శరీరము నిలిచియుండుటకు మాత్రము దగిన యన్నపానాది పదార్థముల యందుఁ గలుగు మోక్షాపేక్షగలముముక్షువులగు సన్న్యాసులయొక్క యిచ్ఛయును, దనకుఁ బుత్త్రసంతానము గలుగుట కొఱకుఁ



దనభార్యయందు మాత్రముగలుగు గృహస్థునియొక్క యిచ్ఛయును, నేనే (ఆత్మయే). (౧౧)

యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే।
మత్త ఏవేతి తా న్విద్ధి నత్వహం తేషు తే మయి॥ ౧౨॥

ఇదివఱకుఁ జెప్పఁబడినట్టి శమదమాది సాత్త్విక గుణములును, రాగద్వేషాదులయిన రాజసగుణములును, శోకమోహాదులగు తామస గుణములును, ఆయాప్రాణులయొక్క కర్మవశానుసారముగాఁ గలుగుచున్నవి. ముత్తెపుచిప్పయందు వెండివలె నాయందు నివియన్నియు మాయామూలముగాఁ గలిగిన వని తెలిసికొనుము. అనఁగా నాయం దవి యారోపితములుగా నున్నవి. నేనో యట్టి యారోపితములయియుండు వస్తువులయొక్క ధర్మము కలవాఁడను కాను. ఆధర్మములచేఁ గట్టుపడువాఁడను గాను. (౧౨)

త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వమిదంజగత్।
మోహితం నాభిజానాతి మా మేభ్యః పరమవ్యయమ్॥౧౩॥

సాత్త్విక రాజస తామస గుణములచేఁ గలుగు శమ దమ రాగ ద్వేష శోక మోహాదులవలన నీసకలప్రపంచములును మోహమునొంది యవివేకస్థితిని జెందియున్నవి. గనుక నా త్రిగుణములకు విలక్ష

ణుఁడనై, నాశరహితుఁడనైయున్న పరమాత్మయైన నన్నుఁ బ్రాణులు తెలిసికొనఁజాలరు. (౧౩)

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే॥ ౧౪॥

సకలలోకములను మోహింపఁజేయు త్రిగుణములుగల పైనఁజెప్పఁబడిన నాయొక్క మాయ యెవరిచేతను జయింప శక్యగానిది. దానిని జయించుటకెద్ది యుపాయంబనిన దేనిలోను మనస్సునుంచక నన్నెవరు శరణుచొచ్చెదరో, వారీమాయను సులభముగా దాఁటుదురు. (౧౪)

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః।
మాయయాఽపహృతజ్ఞానా ఆసురమ్భావ మాశ్రితాః॥

అట్లైనచో నిన్ను శరణుచొచ్చి మాయవలన విడువఁబడుటకేల ప్రయత్నముచేయరనిన చెప్పెదనువినుము. ఒకదానిని మఱియొకదానినిగా గ్రహించి దానిచేత విపరీతజ్ఞానముగల యవివేకులును పాపమును దెలిసి చేయువారలును, భగవంతునియొక్కయు, జ్ఞానులగు పెద్దలయొక్కయు, గుణాతిశయములను కుతర్కములచే నబద్ధమని చెప్పినవారలను దూషించి ద్వేషించు వారలును, భగవంతునియందు మనస్సునిలుప శక్తులుగాని వారు నగు పైనఁజెప్పఁబడిన యవివేకులు మాయనుండి విడువఁబడి నన్నుఁ బొందఁజాలరు. (౧౫)



చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినోఽర్జున!।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ!॥ ౧౬॥

ఓజీవుఁడా! (అర్జునా!) దొంగలచేతను, వ్యాఘ్రము మొదలగు క్రూరజంతువుల చేతను, కష్టమును బొందియుండు వాఁడును; భగవంతునియొక్క పాదారవిందమును జెందుటకు సాధనమగు తత్త్వజ్ఞానమును జెంద నిచ్ఛయించువాఁడును, మంచిపనులను లోకోపకారార్థముగాఁ జేయుటకు సాధనమగు ద్రవ్యమును గోరువాఁడును, బ్రహ్మజ్ఞానియునగు పుణ్యశాలురయిన యీనలువురును, నన్నే భజింతురు. (౧౬)

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః॥ ౧౭॥

పైశ్లోకమందుఁ జెప్పఁబడిన నలువురిలోఁ జలియింపక స్థిరమయిన మనస్సు గలవాఁడును ఆ స్థిరమనస్సు గలుగుటచేతనే నిష్ఠగలవాఁడు నగు జ్ఞానియే శ్రేష్ఠుఁడు. అట్టి జ్ఞానికి నేను మిక్కిలి ప్రియుఁడను; వాఁడును నాకు మిక్కిలి ప్రియుఁడు. (౧౭)

**ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్।**
**ఆస్థితస్సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్॥౧౮॥**

పైనఁజెప్పఁబడిన నలువురును శ్రేష్ఠులయిన వారైనను వారిలో స్వానుభవమును జెందియుండు జ్ఞాని నేనే యని నిశ్చయముగాఁదలఁచికొనుము. ఏలయన, నభేదస్థితియను నిష్ఠను బొందినవాఁడై సాయుజ్యస్థితియగు నన్నే పొందును. (౧౮)

**బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।**
**వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥ ౧౯॥**

అట్టి జ్ఞానియగుటకు ననేకజన్మములనుండి సత్కర్మములఁజేసి చిత్తశుద్ధిఁజెంది సద్గురువునువడసి వారుచెప్పిన ట్లనుష్ఠించుచురాఁగాఁ దుదకు నన్నింటిని వాసుదేవ స్వరూపముగాఁజూచెడు ముక్తిస్థితిని జెందును. అట్టి మహాత్ముఁడు మిక్కిలి దర్లభుఁడు. (౧౯)

**కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః।**
**తంతం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా॥**

సమస్తము వాసుదేవ స్వరూపమే యనెడు జ్ఞాన మెల్లరకు నేల కలుగదనుటకుఁ గారణముఁ దెల్పెద వినుము. పుత్రమిత్రకళత్ర ధన



కనక వస్తువాహనాదులచే నాకర్షింపఁబడిన మనస్సుగలవారలు తమకుఁగావలసిన విషయికములయిన కోరికలను నెఱవేర్చుకొనుటకై యాత్మను (భగవంతుని = స్వస్వరూపమును) మఱచి, యాయా దేవతారాధన నియమములఁగైకొని భజింతురు గనుక నిదియే కారణంబని యెఱుంగుము. (౨౦)

**యోయో యాంయాం తనుం భక్తశ్శ్రద్ధయార్చితుమిచ్ఛతి।**
**తస్యతస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥**

ఏయేకోరికగలవాఁడే యేదేవతా విగ్రహమును భక్తి విశ్వాసములతోఁ బూజించునో, ఆయాకోరిక గలవానికి నాయా భక్తి విశ్వాసములను నేనే యంతర్యామిగానుండి స్థిరపఱుచుచున్నాఁడను. (౨౧)

**స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే।**
**లభతే చ తతః కామాన్మయైవ విహితాన్ హితాన్॥**

పైనఁజెప్పఁబడిన కామభక్తుఁడు భక్తివిశ్వాసంబులతో నాయాదేవతల నారాధనంబు నేసి పరమేశ్వరుఁడ నగు నాచేత నీయా కర్మములకు నీయాఫలంబని నియమింపఁబడి యుండునని నాయాదేవతల మూలముగాఁ బొందుచున్నాఁడు. (౨౨)

**అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్।**
**దేవాన్దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి॥**

ఇతర దేవతలను బూజించువారలా యాదేవతలయొక్క లోకములనుబొందుచున్నారు. బుద్ధిహీను లగు వారలయొక్క దేవతాపూజలవలనఁ గలుగు నాలోకములు నశ్వరములయి యున్నవి. ఇట్లుండఁగా నన్నుఁ బూజించు వారలో (అనఁగా నాత్మారాధనచేయువారలో) నన్నే (ఆత్మత్వమునే) పొందుదురు. (౨౩)

**అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః।**
**పరం భావమజానన్తో మమావ్యయమనుత్తమమ్ ॥ ౨౪॥**

అల్పఫలముల నిచ్చు నితర దేవతారాధనంబులమాని శ్రేష్ఠమయిన మోక్షఫలమునిచ్చు పరమాత్మ యగు నన్ను మనుజులేలఁ బూజింపకుందురో యనిన చెప్పెదవినుము. నాశరహితమయి నదియు, నన్నింటిలోను శ్రేష్ఠమయినదియు, ప్రపంచాతీతమయినదియు నగు నాయొక్కస్వరూపమును దెలిసికొనని యవివేకులు మాయను స్వాధీనపఱచుకొని ప్రపంచాతీతుఁడయియుండు నన్ను మనుష్యాది రూపములుగలవానిగను, మాయకులోఁబడినసాధారణమనుజునిగను, కర్మచేఁగలిగిన పాంచభౌతిక సమ్మేళనమువలనఁబుట్టినశరీరముగల వానిగను దలఁచుచున్నారు. ఆకారణముచేత నే నన్నారాధింపరు. (౨౪)

**నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయా సమావృతః।**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్॥**



అట్టియజ్ఞానముగలుగుటకుఁ గారణ మేమని యందువేమో, చెప్పెద వినుము. సద్గురువును జెందియుండు కొందఱకేఁ దప్ప నితరులకు నాత్మపరిజ్ఞానములేదు. ఏలయన, త్రిగుణాత్మికయగు మాయచే మోహము నొందియుండు సంసారులు పరమాత్మ స్వరూపుఁడనగు నన్ను ఉత్పత్తి నాశములులేనివానిగాఁ దెలిసికొనఁజాలరు. కనుక నదియే యజ్ఞానమనఁబడును. (౨౫)

**వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున।**
**భవిష్యాణిచ భూతాని మాంతు వేద న కశ్చన॥ ౨౬॥**

ఓజీవుఁడా! (అర్జునా!) గడచినవియు, ఇప్పుడు నడచుచుండునవియు, రాఁబోవునవియు నగు ప్రాణులు నన్నుఁ దెలిసికొనఁజాలవు. నేను వానిని తెలిసికొనఁగలను. (౨౬)

**ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వన్ద్వ మోహేన భారత।**
**సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరన్తప॥ ౨౭॥**

ఆత్మతత్త్వజ్ఞానమునకు విరుద్ధమగు దేనివలనఁ బ్రాణు లాత్మస్వరూపమును దెలిసికొనఁజాలక యున్నారని యడిగెద వేమో చెప్పెద వినుము. శత్రువులగు దుర్గుణములను జయింపఁదగిన ఓజీవుఁడా (అర్జునా!) ప్రాణులు జన్మించునప్పుడు కామక్రోధాదులచేఁ గలుగు సుఖదుః

ఖములకుఁ గారణమయిన యవివేకమువలన, బ్రహ్మనిష్ఠులు దప్ప నితర సకలప్రాణులును విషయాభిమానమును జెందియున్నారు. ఈవిషయాభిమాన మాత్మతత్త్వజ్ఞానమునకుఁ బ్రతిబంధకము గనుక నాత్మస్వరూపమును దెలిసికొనుట కవకాశ మియ్యదు. (౨౭)

**యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్।**
**తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః॥**

అయిన నెవ్వారలుఆత్మస్వరూపమును దెలిసికొందురని యడిగెదవేమో చెప్పెదవినుము. చిత్తశుద్ధిని జెందుటకు సాధనమగు సత్కర్మములను భగవదర్పణముగాఁ జేసి యెవరు పాపములను బోఁగొట్టుకొనెదరో, వారు అవివేకమునుండి విడువఁబడి దృఢనిశ్చయులై నన్ను (ఆత్మను=భగవంతుని) పొందుదురు. (భజింతురు.) (౨౮)

**జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే।**
**తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్॥**

వారెందులకై యాత్మోపాసనఁ జేయుదు రందువేమో చెప్పెద వినుము. ఎవ రాత్మజ్ఞానము గలవారలై జరామరణములఁ బోఁగొట్టుకొనుటకుఁ బ్రయత్నపడుదురో, వారాపరబ్రహ్మస్వరూపమే సకల



కర్మస్వరూపమనియు, సకలవిధములయిన ప్రత్యగాత్మస్వరూపమనియుఁ దెలిసికొందురు. (౨౯)

**సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞంచ యే విదుః।**
**ప్రయాణకాలేఽపిచ మాం తే విదుర్యుక్తచేతసః॥ 30॥**

మఱియు నెవ్వరు అధిభూత, అధిదైవ, అధియజ్ఞములతోఁ గూడి నయాత్మస్వరూపమును దెలిసికొని తనయొక్క జీవితకాలమంతయు నాత్మానుభవముం జెంది, మరణకాలమందుఁ గూడ నిశ్చలమైన చిత్తముగలవారలగుదురో, వారు సాయుజ్యమును (నన్ను) బొందుదురు. ఈశ్లోకమువలన మరణకాలమందు మాత్ర మాత్మధ్యాన ముండినఁ జాలు నని చెప్పెడివారియొక్క దుర్వాదము ఖండింపఁ బడినదని యెఱుఁగుము. (30)

ఇట్లు విజ్ఞానమననయోగమను

నేడవయధ్యాయము.

సమాప్తము.



ఓం, తత్, సత్.

శ్రీరస్తు.

# ఎనిమిదవ యధ్యాయము.



## అక్షరపరబ్రహ్మమనన యోగము.

అర్జున ఉవాచ.

**కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ!!**
**అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే॥ ౧॥**

**అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్మధుసూదన !!**
**ప్రయాణకాలేచ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః॥ ౨॥**

జీవుఁడు (అర్జునుఁడు) ప్రశ్నచేయునదేమనఁగా:—

ఏడవయధ్యాయము ౨౯ వ-శ్లోకము ౨ వ-పాదమునఁజెప్పఁబడిన బ్రహ్మమనఁగానేమి? అధ్యాత్మమనఁగా నేమి? కర్మమనఁగానేమి? పైయధ్యాయము ౩౦ వ-శ్లోకమునఁ జెప్పఁబడిన యధిభూతమనఁగానేమి? అధిదైవమనఁగా నేమి? అధియజ్ఞమనఁగానేమి? మరణకాలమందుఁ గూడ స్వాధీనమయిన మనస్సుగలవారలచే స్వానుభవముచే నీ వెట్లు తెలిసికొనఁదగినవాఁడవగుదువు. (౧,౨).



శ్రీభగవానువాచ.

**అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే।**
**భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః॥ ౩॥**

పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) చెప్పునదేమనఁగా:—

మొదటి రెండు శ్లోకములచే జీవుఁడైన యర్జునుఁడడిగిన యేడు ప్రశ్నలలో మొదటి మూఁడు ప్రశ్నలకుఁ బరమాత్మ యగు శ్రీకృష్ణమూర్తి యీ శ్లోకమువలనఁ బ్రత్యుత్తరముఁ జెప్పట.

అన్నిఁటికిని శ్రేష్ఠమయినదియు, ప్రపంచము మొదలగు వానికి మూలకారణమయి నాశరహితముగానుండునదియు నేదియో, అది యే బ్రహ్మమనఁబడును. శరీరము స్థానముగాఁ గలదివలెఁ దోఁచు జీవుఁడనెడు పేరుగల ప్రత్యగాత్మభావ మధ్యాత్మ మనఁబడును. ప్రాణులకును వస్తువులకును ఉత్పత్తిని గలుగఁ జేయు యాగము మొదలగు సత్కర్మములే కర్మ మనఁబడును. (౩)

**అధిభూతం క్షరో భావః పురుష శ్చాధిదైవతమ్।**
**అధియజ్ఞోఽహమే వాత్ర దేహే దేహభృతాంవర !॥ ౪॥**

ఈశ్లోకమువలన రెండవ మూఁడవ ప్రశ్నలకుత్తరము చెప్పఁబడుచున్నది. ఎట్లనిన:— శరీరమును ధరించిన వారలలో శ్రేష్ఠుఁడగు

ఓజీవుఁడా! (అర్జునా!) పుట్టుకగలవి యన్నియు నధిభూతములనియు, తనయొక్క యంశములగు సూర్యుఁడు, ఇంద్రుఁడు మొదలగు దేవతల కధిపతిగాను, ప్రేరకుఁడుగాను, నుండు విరాట్పురుషుఁడని చెప్పఁబడు హిరణ్యగర్భుఁడను వ్యష్టిసూక్ష్మ శరీరాభిమానియే యధిదైవ మనఁబడును. ఈశరీరరమం దంతర్యామిగనుండు పరమాత్మ యగు నేనే యధియజ్ఞుఁ డనఁబడుదును. (౪)

**అన్తకాలేచ మామేవ స్మర న్ముక్త్వా కళేబరమ్।**
**యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్రసంశయః ॥**

ఈశ్లోకముచే నేడవప్రశ్నకుత్తరము చెప్పఁబడుచున్నది. ఎట్లనినన:—ఎవఁడు మరణకాలమందుఁగూడ నంతర్యామి యగు నన్నే స్మరించుచు శరీరమును విడిచిపెట్టునో, వాఁడు జననమరణ రహితమయిన మోక్షరూపుఁడ నగు నన్నే పొందును. ఈ విషయమందుఁ గొంచెమైనను సందియము లేదు. (౫)

**యంయం వాఽపి స్మరన్భావం త్యజత్యన్తే కళేబరమ్।**
**తం తమేవైతి కౌన్తేయ! సదా తద్భావభావితః॥ ౬॥**

పైనఁజెప్పఁబడినది నావిషయమునందుమాత్రమే కాదు. అందఱి విషయములలోను ఇట్లనియే యెఱుంగుము. ఎట్లనిన:—మూలప్రకృతి



సంతతి యగు ఓజీవుఁడా! (అర్జునా!) ఎవఁడు మరణకాలమందు నేయే స్వరూపమును స్మరించుచు శరీరమునుండి బయలు వెడలునో, వాఁ డారూపమునే పొందును. గనుక నేయేదేవతా స్మరణము మరణకాలమం దొకనికి యుండునో, వాఁడారూపమును బొందుచున్నాఁడని యెఱుఁగుము. (౬)

**తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర యుద్ధ్యచ।**
**మయ్యర్పితమనోబుద్ధి ర్మామేవైష్య స్యసంశయమ్॥ ౭॥**

ఇట్లు మరణకాలమం దేతలంపుండునో, యారూపమునే మఱుజన్మమందుఁ బొందుట వాస్తవముగాను తప్పనిది గాను నుండుటవలన నెల్లప్పుడును నాయొక్క స్మరణనే చేయుము. అట్టి స్మరణముతోఁగూడ నీయొక్క వర్ణాశ్రమ విహితధర్మ కర్మమగు యుద్ధమును జేయుము. ఇట్లు నాయందు సమర్పించఁబడిన మనస్సు, బుద్ధియుఁ గలవాఁడవై స్వవర్ణాశ్రమధర్మకర్మములను జేసితివేని, నీవు నన్నే సందేహము లేకుండఁ బొందఁగలవు. ఈ నామాటయందు నీకుఁ గొంచెమైనను సందేహము వలదు. (౭)

**అభ్యాసయోగముక్తేన చేతసా నాన్యగామినా।**
**పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్॥ ౮॥**

ఓజీవుఁడా! (అర్జునా!) పైశ్లోకమందుఁజెప్పఁబడిన భగవంతుని (ఆత్మ) నెట్లు పొందవచ్చుననిన, చెప్పెద వినుము. సద్గురువును జెంది వారియాజ్ఞాప్రకారము ధ్యానాభ్యాసమనెడు యోగముతోఁగూడి నదియు, ధ్యానాభ్యాసయోగమునందుఁ దప్ప నితర విషయములయందుఁ బ్రవర్తింపనిదియు నగు మనస్సుచే స్వయంప్రకాశ స్వరూపుఁడైన పరబ్రహ్మమును (భగవంతుని = ఆత్మను) గురూపదేశము ప్రకారము ధ్యానించువాఁడు ఆపరబ్రహ్మమునే పొందును.

కవిం పురాణ మనుశాసితార
మణోరణీయాంస మనుస్మరేద్యః।
సర్వస్యధాతార మచిన్త్యరూప
మాదిత్యవర్ణం తమసఃపరస్తాత్॥

ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యాయుక్తో యోగబలేనచైవ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
సతంపరంపురుష ముపైతి దివ్యమ్॥ ౧౦॥

ఎట్టివాఁడు పురుషునే (ఆత్మనే=భగవంతునే) పొందునని చెప్పఁబడుననిన, చెప్పెదవినుము:— ఎవఁడు భక్తితోఁగూడినవాఁడై



మరణకాలమం దదివఱకుఁ దానభ్యసించుచు వచ్చిన ధ్యానాభ్యాససంస్కారబలముచే చలనములేని మనస్సుతోఁ గూడిన వాఁడునై, యట్టి మనస్సును నిశ్చయాత్మకమయిన బుద్ధికి స్థానమగు నాజ్ఞాచక్రముయొక్క మధ్యమున లెస్సగా నిలిపి సర్వజ్ఞుఁడుగాను, ఎల్లప్పుడునుండువాఁడుగాను, సకలలోక నియామకుఁడు గాను, అణువునకు నంతర్యామిగాను, ప్రాణులయొక్క వారివారి కర్మఫలంబుల విభజించువాఁడుగాను, మనస్సునకు నందని ప్రపంచ విలక్షణుఁడుగాను, స్వయంప్రకాశస్వరూపుఁడుగాను, అజ్ఞానరూప మోహాంధకార రహితుఁడుగాను నుండు పరమాత్మ యగు పురుషు నెడతెగక స్మరించునో, వాఁడు స్వప్రకాశ మగు నాపరబ్రహ్మమునే పొందుచున్నాఁడు. (౯,౧౦)

యదక్షరం వేదవిదో వదన్తి
విశన్తి యద్యతయో వీతరాగాః।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
తత్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥ ౧౧॥

ఇదివఱకుఁ జెప్పఁబడిన యాత్మను లెస్సగాఁ దెలియఁ జేయు మని యడిగెదవేమో జీవుఁడా! (అర్జునా!) వినుము. వేదార్థమును స్వానుభవముచేఁ దెలిసికొన్నవార లేవస్తువును నాశములేని దాని

గాఁ జెప్పుదురో కామక్రోధాదులనుజయించిన యింద్రియనిగ్రహముగల సన్న్యాసులే జననమరణ రహితమయిన పదవిని పొందుదురో, ఏవస్తువును దెలిసికొనవలయునను నాసక్తితో బ్రహ్మచర్యవ్రతము, అనఁగా, స్త్రీలను విషయాసక్తితోఁ దలఁపకుండుట, భిక్షాటనము, గురుకుల వాసము, వేదాధ్యయనము మొదలగువాని ననుష్ఠించుచున్నారో, అట్టి నాశరహితమయిన వస్తువును గుఱించి సంక్షేపముగా లెస్సగాఁ జెప్పుచున్నాను. (౧౧)

సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్య చ। [మ్॥
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణా

ఎట్టివాఁడు జనన మరణములు లేని వాఁ డగున నెడి విషయమును జెప్పెద వినుము. ఎవఁడు తనయొక్క సకలేంద్రియంబులను లెస్సగా నణఁచి మనస్సును దనయం దంతర్యామిగఁ దనహృదయ మందుండు నాత్మయందు నిలిపి, లయస్థాన మగు బ్రహ్మరంధ్రము నందుఁ గట్టకడ మనస్సును నిలిపి, ధ్యానాభ్యాసమున కంతమగుస్థితిని బొందిన వాఁడై, బ్రహ్మప్రతిపాదకమగు ప్రణవము నుచ్చరించుచుఁ, దల్లక్ష్యార్థమగు నన్ను (ఆత్మను) స్మరించుచున్నవాఁడై, శరీరాభిమానరహితుఁడై, యీశరీరమును వదలువాఁడు, మఱల నొకతల్లిగర్భమందుఁ బుట్టఁడు.



ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతిపరమాంగతిమ్॥౧౩॥

ఎవరికి నేను మిక్కిలి సులభుఁడ నని యడగెదవేమో జీవా! (అర్జునా!) చెప్పెద వినుము. వేఱే విషయములోను బ్రవేశించని మనస్సుగలవాఁ డగు నే ధ్యానాభ్యాసి నన్ను జీవించియుండునప్పుడును మరణకాలమందును స్మరించుచుండునో, స్థిరమనస్కుఁడయిన యట్టి ధ్యానాభ్యాసికి నేను మిక్కిలి సులభుఁడ నని తెలిసి కొనుము.

అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః॥౧౪॥
మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్।
నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాంగతాః॥ ౧౫॥

ధ్యానాభ్యాసికి నీవు సులభుఁడవైనయెడల వాని కేమి ప్రయోజనమనియడిగెద వేమో చెప్పెదవినుము. శ్రేష్ఠమయిన దుఃఖనివృత్తిస్థితి యగు మోక్షమునకు సాధనమయిన ధ్యానాభ్యాసము యొక్క యంతమును జెందిన యనుభవశాలురగు మహాశయులు బ్రహ్మత్వమును జెంది మఱల నాధ్యాత్మికాది దుఃఖములకు స్థానమయినవియు, అనిత్యములయినవియు నగు జనన మరణములను బొందరు.

**ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున!**
**మా ముపేత్యతు కౌన్తేయ! పునర్జన్మ నవిద్యతే॥ ౧౬॥**

నన్నుఁబొందక వేఱెవ్వరిని జెందినయెడల మఱల పుట్టుకవడయుదురో చెప్పెదవినుము. ఓజీవుఁడా! (అర్జునా!) బ్రహ్మలోక పర్యంతములయిన యన్నిలోకములును గలిగి నశించునవిగా నున్నవి. వానిఁ జెందినవారలు మఱలఁ బుట్టుచుఁ జచ్చుచు నుందురు. మూలప్రకృతిసంతతిని జేరిన ఓజీవుఁడా! (అర్జునా!) నన్ను (ఆత్మను) స్వానుభవముచేఁ జెందినవారలో, మఱల జన్మ మెత్తరుసుమీ. (౧౬)

**సహస్రయుగపర్యన్త మహర్యద్బ్రహ్మణోవిదుః।**
**రాత్రిం యుగసహస్రాన్తాం తేఽహోరాత్రవిదోజనాః॥**

చతుర్ముఖబ్రహ్మగానుండు పరబ్రహ్మమునకుఁ బరమాత్మ జీవాత్మ జగత్తుగానుండు కృష్ణార్జునులు (గురుశిష్యుఁడు) మొదలగు జాగ్రత్స్థితి (వికసించుస్థితి) పగలనియు, అవిలేని లయస్థితి (సంకోచస్థితి) రాత్రియనియు, నివి యనేకయుగములు గలవియనియుఁ దెలుసుకొనినవారలు రేయింబవలనెఱింగిన వారలని తెలిసికొనుము. (౧౭)

**అవ్యక్తాద్వ్యక్తయ స్సర్వాః ప్రభవన్త్యహరాగమే।**
**రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్త సంజ్ఞకే॥ ౧౮॥**



ఈ విధముగా నాత్మయొక్క వివృతాకార మగున నేక బ్రహ్మాండాకారస్థితి గలవియయిన లోకములు (సగుణస్థితి) గలిగి నశించునవిగాను, కాలమునకు లోఁబడినవిగాను, నున్నవి యనునది యీశ్లోకమువలనఁ జెప్పఁబడుచున్నది. ఎట్లనిన:—జగద్వివర్తన కాలమందుఁ గనఁబడునవియన్నియు మాయనుండికలిగి లయకాలమందు నాశుద్ధసత్త్వస్థితి యగు మాయయందే ప్రవేశించుచున్నవి. (౧౮)

**భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే।**
**రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే॥ ౧౯॥**

ఓజీవుఁడా! (అర్జునా!) పుట్టిచచ్చుటయె క్రియగాఁగల యీ సంసారమందు వైరాగ్యముగలుగుటకై యీశ్లోకము జెప్పఁబడినది. ఎట్లనిన:— స్థావరజంగమ రూపము లయియుండు భూతసమూహములు కర్మపరాధీనము లయినవియై బ్రహ్మయొక్క పగలగు జాగ్రదవస్థయందుఁ గలుగుచున్నది. (వికసించుచున్నవి.) రాత్రియగు లయకాలమందు సంకోచమును బొందుచున్నవి. పూర్వకల్పమందుఁ గర్మవశముగా లయించియుండిన యాయాభూతవిశేషము లిట్లు మఱలఁ బుట్టుచుఁ జచ్చుచునే యుండును. (౧౯)

**పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః।**
**యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు ననశ్యతి॥ ౨౦॥**

ఈ యధ్యాయము. ౧౩-వ-శ్లోకమగు 'ఓమిత్యేకాక్షరంబ్రహ్మ' అనునది మొదలు అక్షరశబ్దముచేఁ దెలియఁజేయఁబడు పరబ్రహ్మమును జెందు నుపాయ మిదివఱకుఁ జెప్పితిని. ఇఁక నీశ్లోకము మొదలు అక్షరశబ్దవాచ్యునియొక్క స్వరూపమును జెప్పెద వినుము. ఓజీవుఁడా! (అర్జునా!) ఏయక్షరపరబ్రహ్మ మవ్యక్తమగు మాయకంటె వేఱైనదియు, శ్రేష్ఠమయినదియు, ఇంద్రియములచేఁ దెలియఁదగనిదియు, అనాదియయినదియు, నైయున్నదో, అట్టి యక్షరపరబ్రహ్మమును, బ్రహ్మమొదలగు సకలమునశించినను నశించనిదిగా నెఱుఁగుము (౨౦)

**అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్।**
**యం ప్రాప్య ననివర్తన్తే తద్ధామ పరమం మమ॥ ౨౧॥**

ఇంద్రియగోచరము గానిదియు, నాశరహితమయినదియు నగు నవ్యక్తాక్షరశబ్ద వాచ్యమైన పరబ్రహ్మము పొందఁ దగిన యన్నింటిలోను శ్రేష్ఠమయినది. దేనిని జెందినపిమ్మట ప్రాణులు మఱల జన్మించరో, అట్టిదే నాయొక్క (భగవంతునియొక్క) స్వరూపమని యెఱుఁగుము. (౨౧)

**పురుషస్సపరః పార్థ! భక్త్యాలభ్య స్త్వనన్యయా।**
**యస్యాన్తఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్॥ ౨౨॥**



అట్టిపరబ్రహ్మమును జెందు నుపాయమును జెప్పెదవినుము. ఓ జీవుఁడా! (అర్జునా!) శరీరమునందుండువాఁడును, సర్వపూర్ణుఁడు నయిన పురుషుఁడని చెప్పఁబడు నేవస్తువులోఁ బ్రాణు లిమిడియున్నవో, ఏవస్తువుచే సకల ప్రపంచము వ్యాపింపఁబడియున్నదో, ఆ పురుషుఁ డితరవ్యాపార శూన్యమయి యాత్మవిషయిక మయిన జ్ఞాననిష్ఠమగు భక్తిచేతనే పొందఁదగినవాఁడు. (౨౨)

**యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః।**
**ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ!॥ ౨౩॥**

ఓజీవుఁడా! అర్జునా!) ఈశరీరమును విడిచిపోవునప్పుడు సమాధినిష్ఠగల సన్న్యాసులును, నిష్కామకర్మయోగులును, కామ్యకర్మయోగులును, ఏకాలమందు గతించిన యెడల మఱల జన్మించరో, ఏకాలమందు గతించిన మఱల జన్మింతురో, ఆకాలమార్గముల వివరమును గూర్చి చెప్పెద వినుము. (౨౩)

**అగ్నిర్జ్యోతి రహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్।**
**తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥ ౨౪॥**

నిప్పు, ప్రకాశము, పగలు, తెలుపు, ఉత్తరాయణ మనఁబడు సూర్యునియొక్క యతిప్రకాశకాలము, ఇవియన్నియు ప్రకాశ

స్వరూపములు గనుకను, వీనికిఁ బ్రకాశము నిచ్చునదియాత్మ గనుకను, ఆత్మానుభవమును జెందుటకు జ్ఞానమే ముఖ్యము గనుకను, జ్ఞానప్రకాశకాలమార్గముగాఁ బోవు బ్రహ్మోపాసకు లయిన సన్న్యాసులు బ్రహ్మమునే చెందుదురు. (౨౪)

**ధూమో రాత్రి స్తథా కృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనమ్।**
**తత్ర చాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్యనివర్తతే॥ ౨౫॥**

ధూమము, రాత్రి, నలుపు, దక్షిణాయనమని చెప్పఁబడు సూర్యుని యుపశమనకాలము, ఇవియన్నియు నప్రకాశస్వరూపములు గనుకను, అప్రకాశమునకుఁ గారణ మవిద్య గనుకను, అవిద్యకుఁ గారణ మజ్ఞానము గనుకను, అజ్ఞానము నభివృద్ధిచేయునది కామ్యకర్మము గనుకను, అట్టి కామ్యకర్మములఁ జేయు కర్మయోగులు స్వర్గాది లోకములఁ జెంది మరలఁ బుట్టుదురు. (౨౫)

**శుక్లకృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే।**
**ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః॥ ౨౬॥**

పైనఁ జెప్పఁబడిన రెండుమార్గములే ప్రపంచమందు శాశ్వతము లయినమార్గములు. వానిలో మొదటిదగు జ్ఞానమార్గమున బోవువారలు మరలఁ బుట్టరు. రెండవదియగు ఫలమును గోరి చేయఁబడు



కామ్యకర్మమార్గమునందు నడచువారలు దుఃఖకరములగు చావుపుట్టుకలు గలిగి యుందురు. (౨౬)

**నైతే సృతీ పార్థ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన।**
**తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున! ॥ ౨౭॥**

ఓజీవుఁడా! (అర్జునా!) పైనఁ జెప్పఁబడిన రెండుమార్గముల నిజమును దెలిసికొన్న జ్ఞానయోగి యెవ్వఁడును బుట్టుటకుఁ గారణముగు స్వర్గాదిభోగములనిచ్ఛగించక ధ్యానయోగముచే నిష్ఠను జెంది పిదప జన్మరాహిత్యమునకై ప్రయత్నించును. గనుక నీవెల్లప్పుడును నిష్కామకర్మమును జేసి చిత్తశుద్ధినిఁ జెంది ధ్యానయోగముచేఁ బొందఁదగిన జ్ఞానయోగనిష్ఠ గలవాఁడవై యుండువుగాత. (౨౭)

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్॥ ౨౮॥

జ్ఞానయోగముయొక్క మాహాత్మ్యమును జెప్పెద వినుము. జీవుఁడా! (అర్జునా!) ధ్యానయోగసాధ్యమైన జ్ఞానయోగము నభ్యసించువాఁ డీయధ్యాయముయొక్క ప్రారంభమందుఁ జెప్పఁబడిన బ్ర

ష్మము, అధ్యాత్మము, కర్మము, అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము, మరణకాలమందుఁగూడ భగవంతుని స్మరణము, మొదలగు నీయేడింటియొక్క నిజమును సద్గురువును జెంది సందేహవిపర్యయ రహితముగాఁ దెలిసికొని యట్టియనుష్ఠానము గలిగియుండిన యెడల, వేదాధ్యయనము చేతను, యాగములచేతను, హఠయోగతపస్సుల చేతను, దానధర్మములచేతను, ఎట్టి పుణ్య ఫలంబులుగిట్టునని చెప్పఁబడియున్నవో, వానికన్న ననేకకోట్లధికమునయిన ఫలంబులం జెంది తుదకు జననమరణరహితమగు నాదిమూలవస్తువయిన బ్రహ్మమును (ఆత్మను=భగవంతుని) జెందుచున్నాఁడు. (౨౮)

ఇట్లు.

అక్షరబ్రహ్మమననయోగమనెడి

## యెనిమిదవ యధ్యాయము

సమాప్తము



ఓం, తత్, సత్.

శ్రీరస్తు.

## తొమ్మిదవ యధ్యాయము.



రాజవిద్యారాజగుహ్యమననయోగము.



శ్రీభగవానువాచ.

**ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే।**
**జ్ఞానం విజ్ఞాన సహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥**

పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) చెప్పిన దేమియనఁగా:—

ఎనిమిదవ యధ్యాయమునందు సగుణధ్యాన వివరణమును, ధారణ ధ్యానము మొదలగు యోగసాధనముల నభ్యసించుటకై చెప్పఁబడినవి. ఈ తొమ్మిదవ యధ్యాయమునందో, దేనిని స్వానుభవముచే నెఱిఁగిన పిమ్మట దుఃఖరూపమయిన జననమరణాత్మక మగు సంసారమునుండి విడువఁబడుదువో, అట్టి పరమరహస్యమయినదియు, స్వానుభవజ్ఞానముతోఁ గూడినదియు నైన ఇదివరకుఁ గల యధ్యా

యములయందుఁ జెప్పఁబడినదియు, నింకమీఁదఁ రాఁబోవు నధ్యాయములచేఁ జెప్పఁబడునదియు నైన, యీ బ్రహ్మజ్ఞానమును, "ఇతఁ డడుగడుగునకు నాత్మస్తుతిఁ జేసికొను చున్నాఁడే" యను నసూయలేని నీకు, నేను చక్కఁగా నుపదేశించు చున్నాఁడను వినుము. (౧)

రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్॥ ౨॥

ఈ బ్రహ్మజ్ఞానము సకల జ్ఞానములకన్న శ్రేష్ఠమయినదియు, ననేకకోటిజన్మములందుఁ జేయఁబడిన ధర్మాధర్మస్వరూపములయిన సకల సంచితకర్మములను క్షణంబులో భస్మముచేయు నంత శక్తిగల రహస్యములలో నుత్తమోత్తమరహస్యమయినదియు, నితరములయిన యేజ్ఞానములచేతను బొంద నశక్యమయిన స్వానుభవమును గలుగఁజేయునదియు, ధర్మమార్గమునుండి తప్పనిదియు, ననుష్ఠించుటకు సులభమయినదియు, నితరజ్ఞానఫలంబులవలె నాశములేనిదియు (అల్పఫలంబులనియ్యక జననమరణరహితమయిన మోక్షఫలంబునియ్యఁదగినదియు) నై యున్నది. (౨)

అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప!
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని॥ ౩॥



ఆత్మజ్ఞాన మంత సులభమయినచో నెల్లరును ద్వరితముగా నేముక్తులుగావచ్చునే యని యడిగెదవో? చెప్పెదవినుము. శత్రువులయిన కామక్రోధాదులను దపింపఁజేయునట్టి ఓజీవుఁడా! (అర్జునా!) సద్గురువును జెంది తాను బొందవలసిన యాత్మజ్ఞాన విషయంబునందును తత్ఫలమునందును శ్రద్ధాభక్తులులేక నాస్తికులయి యీ శరీరముదప్ప వేఱొకటిలేదని చెప్పుచుఁ బాపకార్యములయందే ప్రవర్తించుచుండు నసురలవంటి పాపులయిన పురుషులు, పరమాత్మయైన నన్నుఁ బొందఁ జాలరు. ఇంతమాత్రమే కాదు. వారలకు నితరలోకాన్తరప్రాప్తియు లేదు. తిర్యగాది జన్మము లనునరకమార్గములోఁ జొరఁబడి, యిట్లు పలుమాఱు గతించుచు నేయుందురు. (౩)

మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా।
మత్స్థాని సర్వభూతాని నచాహం తే ష్వవస్థితః॥ ౪॥
నచమత్స్థాని భూతాని పశ్యమే యోగ మైశ్వరమ్।
భూతభృన్నచ భూతస్థో మమాత్మా భూతభావనః॥ ౫॥

ఈ విధముగా బ్రహ్మజ్ఞాన విశేషమును దెలియఁబఱచి, దానియందు జీవునికి (అర్జుననకు) శ్రద్ధా భక్తు లుండునట్లొనర్చి పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) తానుపదేశింపఁదలఁచియుండిన యంశముల

నుపదేశింప నారంభించు చున్నాఁడు. ఎట్లనిన:— ఇంద్రియములచేఁ దెలియఁబూడని స్వరూపముగలవాఁడనై, సకలములో నంతర్యామిగా నుండు నాచేఁ జేతనాచేతనము లగు ప్రపంచములంతయు వ్యాపింపఁ బడి యున్నది. అటువంటి సకలమును నాయం దున్నది. నేను వానిక న్నింటికి నాత్మగా (ఆధారముగా) నున్నాను. అవి నాకు నాత్మ (ఆధారములయినవి) కావు. బ్రహ్మాదిపిపీలికాంతము లయిన సకల భూతములు, జలము భూమినంటుకొని యుండునట్లు నన్నంటుకొని యుండునవియునుగావు. నాయొక్క వింతయైన శక్తిని జూడుఁడు. జీవుఁడా! (అర్జునా !) నాయొక్కస్వరూపము సకల భూతముల కా ధారమయినదిగను, భూతములను సరక్షించునదిగను నుండినను, (నేను) భూతముల నాధారముగాఁ గలవాఁడను కాను. (౪-౫)

యథాకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగోమహాన్।
తథాసర్వాణిభూతాని మత్స్థానీత్యుపధారయ॥ ౬॥

౪-౫-వ-శ్లోకములలోఁ జెప్పఁబడిన సంగతినే దృష్టాంతముతోఁ గూడఁ జెప్పుచున్నాఁడను; వినుము. ఎచ్చటను సంచరించునదియు, గొప్పదియు నైన వాయు వెప్పుడును ఆకాశమునందే యుండి నను, ఆకాశముతో నెట్లంటుకొనక యున్నదో, అట్లె సకల భూతములును నాయం దంటుకొనక యున్నవి యని తెలిసికొనుము. (౬)



సర్వభూతాని కౌన్తేయ ! ప్రకృతిం యాన్తి మామికామ్।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్!॥ ౭॥

మూలప్రకృతిసంతతిలోఁ జేరిన ఓజీవుఁడా ! (అర్జునా !) వాయు వాకాశమునం దుండునట్లు సకలభూతములును స్థితికాలము నందు నాయం దున్నవి. ప్రళయకాలమందు జ్ఞానమును బొంది ముక్తిని జెందినవి తప్ప మిగిలిన వన్నియు నాకు స్వాధీనమయిన మాయలో లయించుచున్నవి. మఱుసటి కల్పారంభ మగు సృష్టికాలమందు వాని వాని గుణకర్మంబుల ననుసరించి వానిని మఱల సృజించు చున్నాను.

ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునఃపునః।
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్॥ ౮॥

తానుగానే కలుగఁజేసికొనిన యవివేకము నవలంబించి యాయవి వేకమునకు లోఁబడినందువల్ల స్వాతంత్ర్యము లేకయుండు సకల భూతము లప్పటికప్పటికిఁ దమ యవివేకముచేఁ గలుగఁ జేసికొన్న ప్రాచీనకర్మస్వభావముల ననుసరించి నేను వానిని సృష్టి చేయు చున్నాను. (౮)

నచ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ !।
ఉదాసీన వదాసీన మసక్తం తేషు కర్మసు॥

సృష్ట్యాదిక్రియలు తమవద్దనుండుటవలనఁ దమకును ధర్మాధర్మవైషమ్య మున్నట్లైనది. మావలెనే మీరు నయితిరిగదా యనియెదవేమో? జీవుఁడా! (అర్జునుఁడా!) న్యూనాధిక్యములతో సృష్టించువైషమ్యకర్మము నాయం దున్నట్లు కనఁబడినను, ఆకర్మములయందుఁ గల బంధమునకు హేతువయిన కర్మఫలాపేక్షమును కర్తృత్వమును, అభిమానమును నాయందు లేవుగనుక నుదాసీనుఁడుగా నుండు నన్నాకర్మములు బంధించఁ జాలవు. (౯)

మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్।
హేతునాఽనేన కౌన్తేయ! జగద్విపరివర్తతే ॥౧౦॥

“నేను సకలభూతములను వానివాని గుణకర్మానుసారంబుగా సృష్టిచేయుచున్నాను. అట్లు సృష్టిచేసినను, ఉదాసీనుఁడుగా నున్నాను” అనిన రెండుపనుల నెక్కుఁ డేకకాలములో ననుష్ఠించుచున్నాఁడను నది యప్రసిద్ధ మనియెదవేమో జీవుఁడా!(అర్జునా!) సాక్షిమాత్రుఁడుగా నుండు నాయొక్క సన్నిధాన విశేషంబు వలన మాయ సకల ప్రపంచమును గలుగఁజేయు చున్నది. ఇట్లు నేను సాక్షిమాత్రుఁడనుగా నున్నందువలననే ప్రపంచము ప్రవర్తించుచున్నదనియు నెఱుఁగుము. (౧౦)



అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్।
పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్॥౧౧॥

నీవు సర్వాధ్యక్షుఁడవుగాను, సకలభూతాంతర్యామివిగాను, నిత్యముక్తుఁడవుగాను నుండినపక్షంబున నేల నిన్ను కొందఱు అభేదబుద్ధితోను మఱికొందఱు భేదముతోను భజింపవలయును? అనియడిగెదవేమో? జీవుఁడా! (అర్జునుఁడా!) నాయొక్క శ్రేష్ఠమయిన పరమాత్మ స్వరూపమును సద్గురువునుజెంది తెలిసికొనని మూఢులు సకలభూతంబులకు నియామకుఁడనుగాను భక్తులయెడలనాకుఁగలిగిన యనుగ్రహంబువలన నిత్యశుద్ధముక్తస్వరూపుఁడనుగా నవతరించి మానుషదేహధారినై యుండు నన్నవమానించి చెడిపోవుచున్నారు. (౧౧)

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః।
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః॥౧౨॥

ఎట్లు చెడిపోవుదురో దెల్పెద వినుము. ఇతరదేవతల నుపాసించుటచే శీఘ్రముగా నభీష్టమును బొందవచ్చునను నుపయోగము లేని యాశగలవారును, ఉపయోగములేని కామ్యకర్మముల ననుష్ఠించువారును, తాము నేర్చిన శాస్త్రజ్ఞానమును యుక్తి, వితండావాదము, ద్రవ్యార్జనల కొఱకు నుపయోగించు వారలు నగు దుర్మార్గప్రవ

ర్తనగల మనస్సుగలవారు, మోహమును గలిగించి బుద్ధిని చెఱుపునదియు, నితరులకు మనోవ్యాకులతఁ గలుగఁజేయు బుద్ధినిచ్చునదియు, మిక్కిలి యాశము, అహంకారమును, కోపము మొదలగువానిని గలుగఁజేయునదియు నగు నసురస్వభావము గలవారలై నన్నాశరణచేయక చెడిపోవుచున్నారు. (౧౨)

మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః।
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ ౧౩॥

అట్లు చెడక సద్గతిఁజెందువారలక్రమమును జెప్పెద వినుము. జీవుఁడా! (అర్జునా!) సద్గురువును జెంది వారు చెప్పిన ట్లనుష్ఠించు మహాశయులు, సత్త్వగుణము ననుసరించినవారలై, ప్రపంచమునకుఁ గారణమయిన వాఁడును నాశరహితుఁడు నగు నన్నుఁ దెలిసికొని యితరవిషయాసక్తిలేనివారలయి మోక్షమార్గమునందే ప్రవర్తింతురు.. (అనఁగాఁ బరమాత్మ యగు నన్నే భజింతురు.) (౧౩)

సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥ ౧౪॥

భజించువిధంబుఁ జెప్పెదవినుము:— శమము, దమము, అహింస, మొదలగు సద్గుణంబులవలన నింద్రియనిగ్రహంబుం జెంది బ్రహ్మ



జ్ఞానమును బొందుటకై ప్రయత్నపడువారును, హృదయకమలమందుండు నాత్మ యగు నన్ను నిరంతరము ప్రణవాదిరూపముగా స్మరణచేయువారును స్థిర(నిశ్చల)మయిన మనస్సుగలవారును, బ్రహ్మచర్యము మొదలగు వ్రతములుగలవారును, భక్త్యతిశయంబువలన నేకాగ్రమయినమనస్సు గలవారలును, (నన్ను నమస్కరించుచుండువారును) నగుజ్ఞానులు నన్నే యుపాసించుచుందురు. (స్వానుభవమునే చెందుదురు.) (౧౪)

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మా ముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్॥ ౧౫॥

మఱికొందఱెట్లు నన్నుపాసించెదరో, చెప్పెదవినుము. కొందఱు భగవద్విషయికమగు జ్ఞానమే యజ్ఞమని తలఁచి, భగవంతుఁడొక్కఁడేయనియును, ఆయొకనినే భజింపవలయుననియు, మఱికొందఱు ఆయొకే భగవంతుఁడు త్రిమూర్తిస్వరూపుఁడుగాను, సూర్యుఁడు మొదలుగాఁగలవారిస్వరూపుఁడుగా నున్నాఁడనియుఁ దలఁచి వేర్వేఱుగాను, మఱికొందఱు పలుతెఱఁగులుగా నుండువాఁడే భగవంతుఁడనియు ననేకవిధములుగాను, నుపాసింతురు. (౧౫)

అహం క్రతు రహం యజ్ఞ స్స్వధాఽహ మహ మౌషధమ్।
మన్త్రోఽహ మహ మేవాజ్య మహ మగ్నిరహం హుతమ్॥

ఇట్లనేకవిధములుగా నుపాసించినను, అన్నియుపాసనలును పరమాత్మయగు నన్నుఁ బొందును. అదెట్లని యడిగెదవో? జీవుఁడా! (అర్జునా!) చెప్పెద వినుము. అగ్నిహోత్రాది శ్రౌతకర్మంబులు నేనే; వర్ణాశ్రమాద్యాచార మయిన స్మార్తయజ్ఞకర్మము నేనే; పితృదేవతల నుద్దేశించి యీఁబడునట్టి యన్నము నేనే; ధ్యానము మొదలగు స్వరూపము నేనే; మంత్రస్వరూపము నేనే; ఆజ్యము మొదలగు హోమసాధన ద్రవ్యంబులు నేనే; గార్హపత్యము (పితా) ఆహవనీయము (గురు) దక్షిణాగ్ని (మాతా) యని చెప్పఁబడు త్రేతాగ్నిస్వరూపుఁడు నేనే; హోమాది కర్మస్వరూపము నేనే. (౧౬)

**పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః।**
**వేద్యం పవిత్రమోఙ్కార ఋక్సామ యజురేవ చ॥౧౭॥**

విత్తనమునుండి చెట్టుపుట్టునట్లుగా, నావద్దనుండి యీప్రపంచముద్భవించి నందువలన దీనికి పిత(తండ్రి) నేనే. ఈప్రపంచమును బోషించు తల్లియు నేనే; తాతయు నేనే (అనఁగా; సదసత్ వ్యక్తమవ్యక్తం పితా మాతా పితామహః) తెలియఁదగిన వస్తువు నేనే. అన్నింటిని పరిశుద్ధముచేయు నట్టి యోఙ్కార స్వరూపము నేనే. వేదముల యొక్కస్వరూపము నేనే. (౧౭)

**గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసః శరణం సుహృత్।**
**ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజ మవ్యయమ్॥ ౧౮॥**



కర్మఫలంబును, పోషించువాఁడును, నియామకుఁడును, ప్రాణుల యొక్క మంచి చెడుగులఁ జూచుచుండు సాక్షియుఁ, ప్రాణులుండుటకాధారమయిన వాఁడును, నిజముగా శరణుజొచ్చినవారియొక్క దుఃఖమును బోగొట్టువాఁడును, ప్రతిప్రయోజనము నపేక్షించక యుపకారము సేయువాఁడును, జగదుత్పత్తి స్థితిలయములకు స్థానమయినవాఁడును, కాలాంతరములయం దుపయోగింపఁబడు నిక్షేపమయినవాఁడును, నాశరహితమయిన బీజరూపముగా (విత్తనముగా) నుండువాఁడును నేనే. (౧౮)

**తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ।**
**అమృతఞ్చైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున!॥ ౧౯॥**

ఓజీవా! (అర్జునా!) నేను సూర్యస్వరూపుఁడనై యుండి కొన్నికిరణములచేత వేఁడిమిని, మఱికొన్నింటిచేత వర్షమును గలుగఁజేయుచున్నాను. అమృతస్వరూపుఁడును నేనే; మృత్యు (యమ) స్వరూపుఁడును నేనే, దృశ్యమయిన వస్తువును, అదృశ్య మయిన వస్తువును నేనే. (౧౯)

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే।
తే పుణ్య మాసాద్య సురేన్ద్రలోక
మశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్॥ ౨౦॥

అనేకవిధములుగా నుపాసించెడి కామ్యకర్మఠులు పొందులోక వివరణములును, వానిఫలంబులను జెప్పెదవినుము, ఋక్కు, యజుస్సు, సామము వేదములయందుఁ జెప్పఁబడినట్లు యాజ్ఞికులయిన కామ్యకర్మిష్ఠులగు నే యవివేకులు జ్యోతిష్టోమము మొదలయిన యాగములవలన నన్ను వస్వాదిదేవతారూపము గలవానినిగాఁ బూజించి సోమపానము జేసినవారలై యందువలనఁ బాపములేనివారలయి స్వర్గలోకప్రాప్తిని కోరుచున్నారో, వారింద్రలోకమును జెంది దేవతా (ఇంద్రియ) భోగముల ననుభవించుచుందురు. (౨౦)

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి।
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే॥ ౨౧॥



స్వర్గమనినను, మోక్షమనినను నొకటియె యని చెప్పెద వేమో జీవుఁడా! (అర్జునా!) అట్లు కాదను సంగతిఁ జెప్పెద వినుము. స్వర్గలోకమును జెందినవార లాలోకసుఖంబుల ననుభవించి పుణ్యఫలము ముగిసినంతటనే యీమానుషలోకమును జెందుచున్నారు. ఈవిధముగాఁ బూర్వజన్మమందువలెనే మఱలఁ గామ్యకర్మముల ననుష్ఠించువారయిన విషయాసక్తిగలవారలు పుట్టుచుఁ, జచ్చుచునే యుందురు. (౨౧)

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

స్వామీ! ఫలము నపేక్షించి సత్కర్మములను జేయక పోయిన మనుష్యులయొక్క యోగక్షేమము లెట్లు నడచును? కావున ఫలంబులఁగోరియే సత్కర్మములను జేయవలయునని తలంచెదవో, జీవుఁడా! అర్జునా! చెప్పెద వినుము. ఎవరు భేదబుద్ధిలేక, "వాసుదేవస్సర్వమ్" "బ్రహ్మైవేదం సర్వమ్" "ఆత్మైవేదం సర్వమ్" అనునట్లు సమత్వబుద్ధిగలవారలయి సద్గురు వుపదేశించిన లక్ష్యముంబట్టి నన్నెడతెగక యితరవిషయాసక్తిలేక ధ్యానించుచున్నారో, అటువంటి నిష్ఠగలవారియొక్క బహిర్ముఖకాలమందును, అంతర్ముఖకాలమందును, వారియొక్క యోగక్షేమములను నేనే వహించుచున్నాను. కాఁబట్టి సత్కర్మములను నిష్కామముగనే చేయవలయును (౨౨)

**యేఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాఽన్వితాః।**
**తేఽపి మామేవ కౌన్తేయ! యజన్త్యవిధిపూర్వకమ్॥**

ఇదివఱకు నీవు చెప్పినట్లన్నియు నీస్వరూపములుగా నుండినయెడల దేనినిభజించిన నేమి? నిన్ను సేవించినట్లె యగునుగదా? యనియడిగెదవేమో జీవుఁడా! (అర్జునా!) ఇతరదేవతలను భజించువారలుగూడ నన్నే పొందుచున్నారు. అయినను అవి వేదవిరుద్ధము, నశాస్త్రీయము నయినది. ఏలయనిన, భేదబుద్ధితో భజించువారలకుఁ జావుపుట్టుకలు గలవు. అభేదబుద్ధితో భజించువారలో, జననమరణములు లేనినన్నుఁ బొందుచున్నారని యిదివఱకే చెప్పియున్నాను.

**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ।**
**నతు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవన్తి తే॥ ౨౪॥**

వారు అశాస్త్రీయముగా భజించుచున్నారనున దెట్లని యడిగెదవేమో? జీవుఁడా! (అర్జునా!) చెప్పెద వినుము. వారు జేయునట్టి శ్రౌత స్మార్త కర్మములన్నింటిలో దేవతలకు నాత్మగానుండు నేనే భోక్తగాను, ఫలంబుల నిచ్చువాఁడనుగాను నున్నాఁడను. ఈవిధముగా నుండు నన్నుఁ దెలిసికొనక భేదబుద్ధితో భజించుటవలన నశాస్త్రీయకర్మ ఫలంబులనుబొంది (కామ్యకర్మఠులు) పుట్టుచుఁ జచ్చుచు నుందురు. (౨౪)



**యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః।**
**భూతానియాన్తి భూతేజ్యాయాన్తిమద్యాజినోఽపిమామ్॥**

వేర్వేరు దేవతలభజించువారలాయాదేవతలయొక్క లోకంబులం జెందుచున్నారు. శ్రాద్ధము మొదలగు పితృకర్మముల ననుష్ఠించువారలు పితృలోకములఁ జెందుచున్నారు. వినాయకుఁడు మొదలగు భూతగణముల నారాధించువారలు భూతలోకములఁ బొందుదురు. పరమాత్మ యగు నన్నారాధించువారలు జననమరణములు లేని నన్నుఁ బొందుదురు. మోక్షప్రాప్తికి సాధన మగు పరమాత్మోపాసనను విడిచి యితరోపాసనఁ జేయువారలు జననమరణంబులకు సాధనముగా నుండు స్వల్పఫలంబులనే పొందుదురు. (౨౫)

**పత్త్రం పుష్పం ఫలం తోయం యో మేభక్త్యాప్రయచ్ఛతి।**
**తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః॥ ౨౬॥**

నిర్గుణధ్యానమునకు సాధనముగా నుండు సగుణోపాసన వలనఁగూడఁజిత్తశుద్ధిగలిగినపిదప జ్ఞానమువలన మోక్షమును జెందవచ్చుననుటను జెప్పెదవినుము. ఎవ్వఁడుడంబము లేక భక్తితోఁదులసి, బిల్వము, మొదలగు పత్త్రంబులను, పుష్పంబులను, ఫలంబులను, పానకము మొదలగు మధురములయిన ద్రవపదార్థములను, శుద్ధాంతఃకరణముతోఁ బూజకొఱకు నిచ్చుచున్నాఁడో, బలాత్కారము కలే భక్తిపూర్వ

కముగా వానిచేత నియ్యఁబడిన పత్త్రి పుష్పఫలంబుల నేననుభవించు చున్నాఁడను. (౨౬)

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్।
యత్తపస్యసి కౌన్తేయ! తత్కురుష్వ మదర్పణమ్॥ ౨౭॥

మూలప్రకృతి సంతతిలోఁజేరిన ఓజీవుఁడా! (అర్జునా!) పత్త్రము, పుష్పము, ఫలము మొదలగునవి యెల్లప్పుడు దొరకుట దుర్లభంబు; వెండియు వాని నన్నింటిని సంపాదించుట కష్టంబు. సులభమయిన మార్గంబు లేదా యనియడిగెదవో? చెప్పెద వినుము. నీవొనర్చునట్టి యన్ని సత్కర్మంబులను, లభించిన దానితోఁ దృప్తిచెందినవాఁడవై నీవు భుజించు సకలపదార్థములను, నీవొనర్చుచుండు శ్రౌతస్మార్తాది కర్మంబులను, నీవుచేయు దాన ధర్మంములను, నీవుచేయు జపము, తపము, నిష్ఠ మొదలగు సకలతపస్సులను, నాకర్పితము గావింపుము. ఇట్లు చేయుటవలన నెక్కువిధమయిన కష్టనష్టములు లేవు. (౨౭)

శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబన్ధనైః।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి॥



ఈవిధముగా సకలమును భగవంతుఁడవగు, నీకర్పితము గావించిన యెడలఁ గలుగు ప్రయోజనంబేమి యనియడిగెదవేమో, జీవుఁడా! (అర్జునా!) చెప్పెదవినుము. పై శ్లోకములయందుఁ జెప్పఁబడినరీతిగా సకల సత్కర్మంబుల నాకర్పితము గావించిన యెడల నిష్ఠానిష్ట ఫలంబులకు హేతువు లగు పుణ్యపాపములనెడి కర్మఫలంబులనుండి విడువంబడుదువు. ఈవిధముగా విడువఁబడిన సన్న్యాసయోగముతోఁ గూడిన యంతఃకరణముగల నీవు జీవన్ముక్తుఁడవై నన్నే పొందుదువు. (౨౮)

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః।
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్॥

భక్తులుగా నుండువారియందు నీ కనుగ్రహంబును, ఇతరులయందా యనుగ్రహంబును, లేకపోవుటయుఁ జూడఁగా నీకుఁగూడ రాగద్వేషాదులున్నట్లే యాయెనుగదా యనియెదవేమో? అట్లుకాదు. చెప్పెద వినుము. నేను సకలభూతములయందును సమముగా నుండువాఁడను. నాకు అప్రియుఁడును లేడు; ఎవ్వరు నన్ను ఇతరవిషయాసక్తి లేకుండ భక్తితో భజించుచున్నారో, వారు నాయందున్నారు. నేనును వారియందున్నాను. అనఁగా నేనే వారు. వారే నేను.

అపి చేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్।
సాధురేవ సమన్తవ్య స్సమ్యగ్ వ్యవసితో హి సః॥ 30॥

నన్నుఁ గూర్చి చేయఁబడు భక్తి యగుధ్యానముయొక్క మాహాత్మ్యమును జెప్పెద వినుము:— ఎల్లప్పుడును నాయందు మనస్సు గలవాఁడు స్నానపానాదిక్రియలులేక ప్రపంచముచే నిందింపఁబడఁ దగిన యాచారము గలవాఁ డైనను, ఆత్మకంటె నితరదేవతలను ధ్యానము చేయనివాఁడగుచు, ఆత్మస్వరూపమయిననన్ను (స్వస్వరూపమును) ధ్యానము చేయునేని వాఁడు స్థిరమయిన మనోనిశ్చలము గలవాఁడగు చున్నాఁడు. గనుక వాఁడు సదాచారము గలవాఁడనియే తెలిసికొన వలసినది. (30)

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాన్తిం నిగచ్ఛతి।
కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥ 3౧॥

పై శ్లోకమందు చెప్పఁబడినవాడు సమస్తభూతములయందుఁ దన్ను, తనయందు సమస్తభూతములను జూచుభూతదళు వగును. శీఘ్రముగా స్థిరమయిన బ్రహ్మానుభవమును బొందును. ఓజీవా! శ్రౌతస్మార్తాదికర్మములను విడిచి నన్నే ధ్యానించు నాభక్తుఁడు ప్రపంచముచే దురాచారుఁ డని యెంచఁబడినను, వాఁడు చెడఁడు, చెడఁడు, చెడఁడు. అని ముమ్మాటికిని ప్రతిజ్ఞ చేయుము. (3౧)



మాంహి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః।
స్త్రియో వైశ్యాస్తథాశూద్రా స్తేపియాన్తి పరాంగతిమ్॥

ఓజీవా! ఇంతయేల? నీచజాపెలయందు జన్మించిన వారైనను పూర్వజన్మ సుకృతమువలనఁ దటస్థించిన సద్గురువుయొక్క యుపదేశముయొక్క స్త్రీలు, వైశ్యులు మొదలగువారు నన్ను ధ్యానము చేసినయెడల నుత్తమ మగుమోక్షమును, (జననమరణ రహితమును) పొందుదురు. (3౨)

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా।
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వమామ్॥33॥

అట్లుండ నిజమయిన బ్రాహ్మణులును,నీవంటి క్షత్రియులును ధ్యానముద్వారా మోక్షమును బొందుదురని వేఱే చెప్పనేల? క్షణభంగురమయినదియు, సుఖలేశరహిత మయినదియు నగుపురుషార్థసాధన మగునీమనుష్యజన్మమును అదృష్టవశమునఁ బొందియుండు నీవు ధ్యానపరుఁడ వగుము. (33)

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥

కాఁబట్టి, నాయందు మనస్సు గలవాఁడవుగను, ఇతర దేవతా భక్తుఁడవుగాక ఆత్మధ్యానము కలవాఁడవుగను, స్వర్గాదిసర్వఫలములయం దపేక్షను మాని సమస్తమును నాకర్పణ చేయువాఁడవుగను నగుము. ఆత్మను నమస్కరింపుము. ఇట్లాచరించినయెడల నన్నే పొందఁగలవు. (౩౪)

ఇట్లు

రాజవిద్యారాజగుహ్యమను మననయోగమను

## తొమ్మిదవ యధ్యాయము

సమాప్తము.



శ్రీరస్తు.

# రెండవ భాగము.

## పదియవ యధ్యాయము

### విభూతి మననయోగము.

పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) చెప్పినదేమనగా:—

భూయ ఏవ మహాబాహో! శృణు మే పరమం వచః।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామిహితకామ్యయా॥

రెండవయధ్యాయము మొదలు తొమ్మిదవయధ్యాయమువఱకు దేహాదిప్రపంచంబులకు వేఱైన వస్తువే బ్రహ్మమనియు, ఆ బ్రహ్మను బొందుటకు సాధనమగు నిష్కామ కర్మయోగము మొదలైన [illegible] దానికిఁదగిన యధికారి విశేషంబును జెప్పియు, స్థూల [illegible]ాత్మ ప్రపంచము లనిత్యములనియు ఆత్మయే నిత్యమనియు విశ[illegible]ంచియు, అపంచీకృత పంచమహాభూత వికారమైన హిరణ్యగర్భాత్మకమగు నాత్మయొక్క నిజస్వరూపము వివరించుటయునైనది. ఇప్పుడు పంచీకృత భూతవికారమైనవాఁడును, స్థూల వ్యష్టి సమష్టి రూపమగునవాఁడును నగు విరాట్టయిన యాత్మయొక్క నిజస్వరూ

సాధనమును నిరూపించుటకై యీ పదియవ పదునొకండవ యధ్యాయములను రెండధ్యాయములు ప్రారంభింపఁబడుచున్నవి. వానిలో నీ పదియవ యధ్యాయము లౌకికసామర్థ్యముగల వ్యష్టి విభూతిస్వరూపమును నిరూపించుచున్నయది. ఎట్లనిన:—

తనయొక్క యవివేకమువలనఁ గలిగిన కామక్రోధాది ప్రపంచ విషయములవలనఁ బరమపురుషార్థమును బొందఁదగిన ఓజీవుఁడా! (అర్జునా!) ఇంతవఱకును ఏడవ తొమ్మిదవ యధ్యాయములయందు సంగ్రహముగా నచ్చటచ్చటఁ జెప్పఁబడిన నాయొక్క విభూతి విశేషములను నా ప్రవచనములనచ్చటచ్చట వినినందువలనను, నాయొక్క ప్రసంగంబులవలన నాయొక్క విభూతివిశేషంబులను వినుట వలనను అమృతపానము జేసినవానివలె సంతోషించునట్టి నీకు హితమును (శుద్ధత్వమును) కలిగించుటకై మరలఁజెప్పఁబోవు నాయొక్క నిరతిశయప్రకాశమయిన వస్తుస్వరూపమును వివరించునట్టి యీవాక్యములనువినుము. (౧)

న మే విదుఃసురగణాః ప్రభవం నమహర్షయః।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాంచ సర్వశః॥ ౨॥

నీయొక్క విభూతి మహిమ మనెవ్వరిచేతను చెప్పనలవిగాదని యడిగెదవేమో? నాయొక్క యవతారమహిమను దేవతలనేమ



కర్మేంద్రియములును సప్తమహర్షులనెడు జ్ఞానేంద్రియములును (రెండు కన్నులు రెండు చెవులు రెండు నాసికారంధ్రములు రెండు నాలుకయొకటి) దెలుసుకొనఁ జాలవు. నేనీకర్మజ్ఞానేంద్రియములు మొదలగువాని కంటె అనాదియైనవాఁడను. (౨)

యో మా మజమనాదిఞ్చ వేత్తిలోక మహేశ్వరమ్।
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే॥ ౩॥

నీయొక్క విభూతిమహిమను దెలిసికొనుటలో నేమిప్రయోజనం బని యడిగెదవేమో? చెప్పెదవినుము. ఎవఁడు నన్ను ఆదిలేనివానినిగాను పుట్టుకలేనివానినిగాను సకలలోక నియామకునిగాను దెలిసికొనుచున్నాడో, వాఁడు మనుష్యులయందు మోహములేనివాఁడై సకలపాపములనుండి విడువఁబడుచున్నాఁడు. (౩)

బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమః శమః।
సుఖందుఃఖంభవో భావో భయఞ్చా భయమేవచ॥ ౪॥
అహింసా సమతా తుష్టి స్తపోదానం యశోఽయశః।
భవన్తి భావా భూతానాం మత్తఏవ పృథగ్విధాః॥ ౫॥

సకలసూక్ష్మ వస్తువునందును ప్రవేశించి తెలిసికొని నిశ్చయింపఁదగిన సామర్థ్యముగల బుద్ధియు, ఆత్మా నాత్మవస్తువుఁదెలియఁ

లేక స్వానుభవమునందు బోధమాత్రముగా నిలుచుటయైన జ్ఞానమున్ను, మోహ-మునులేక యుండుటయను అసమ్మోహము సంభవించినను మనోవికా-రము నొందని రోహార్ద్వ్యమ్యు, తాను సద్గురువు మూలముగాఁ దెలిసికొని యనుభవించి చూడఁబడిన యాత్మానుభవమును యితరులకు బోధించుటకై చెప్పఁబడిన మాటలనెడి సత్యంబును, కర్మేంద్రియ నిగ్రహమున్ను, అంతఃకరణనిగ్రహమున్ను, మనస్సువిషయములయం దుపశమమును బొందియుండు స్థితియగు సుఖమున్ను, విషయసంతాపమున్ను, ఉత్పత్తియు, నాశమును భీతియు వెఱపులేమియు, అన్యములయిన ప్రాణిహింసించకుండుటయు, సమత్వబుద్ధియు, తానుగాదొఱికినంత దానిచేఁదృప్తి నొందుటయు, ఇంద్రియనిగ్రహంబునకై యింద్రియముల నడఁగించు తపస్సున్ను, తనశక్తికొలఁదిగా నీవియును, మంచి పనులు చేఁగలుగుకీర్తియు, అవివేకముచేఁ జేయఁబడిన వానివలన గలిగిన యపకీర్తియును ప్రాణులయొక్క స్వభావములును, సర్వేశుఁడనైన నాచే వాని వాని కర్మానుసారముగాఁ గలుగుచున్నవి. (౫)

మహర్షయ సప్తపూర్వే చత్వారో మనవస్తథా।
మద్భావామానసాజాతా యేషాంలోక ఇమాఃప్రజాః॥

స్థావరజంగమ రూపంబులయిన నన్నియు వేనియొక్క సృష్టిగా నున్నదో అటువంటి పూర్వికులయిన సప్తర్షులనెడు జ్ఞానేంద్రియంబులను అంతఃకరణ చతుష్టయమగు మనోబుద్ధిచిత్తాహంకారంబు-



లను సంకల్పములవలనఁ గల్గినటువంటివియు నాయొక్క సామర్థ్యంబుగలవియునయి యున్నవి. (అనఁగా) స్వానుభవమునందు నిలుపఁదగినవి. (౬)

ఏతాంవిభూతిం యోగఞ్చ మమయో వేత్తి తత్త్వతః।
సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్రసంశయః॥ ౭॥

నీయొక్క యుపాధిలేని నిరుపాధిక స్వరూపమును దర్శించుటఁ ప్రయోజనంబుఁ గలదేకాని సోపాధిక ఉపాధులతోఁ గూడిన స్వరూపంబును దర్శించుటలో నేమి యుపయోగంబనియెదవా? చెప్పెద వినుము.

నాయొక్క పైనఁజెప్పఁబడిన మనువులనెడు నంతఃకరణ చతుష్టయముయొక్కయు, ఋషులనెడు జ్ఞానేంద్రియములయొక్కయు స్వరూపమగు విభూతివిస్తారముగల సర్వజ్ఞత్వము మొదలయిన యోగైశ్వర్యమును నిజముగా నెవ్వాడు తెలిసికొనుచున్నాడో వాఁడు నిశ్చలమగు జ్ఞానముగలవాఁడయి నన్నుఁ బొందుచున్నాఁడు. ఈవిషయంబున నెక్కింతయైన సందియంబు లేదని నీవు దెలిసికొనుము.

అహంసర్వస్యప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః॥౮॥

ఎటువంటి నిశ్చలజ్ఞానము కలుగునో; జెప్పెదవినుము. (లేక, ఎట్లువిభూతియోగజ్ఞానంబువలన దత్త్వజ్ఞానంబుద్భవించును?) జగంబులన్నియు నుద్భవించుటకును అవినెలకొనియుండుటకును మఱల నవి లయించుటకు గారణము, బ్రహ్మస్వరూపుఁడగు వాసుదేవుఁడని చెప్పఁబడునేనేయని తెలిసికొని పరమార్థతత్త్వభావనవలన స్వాత్మానందానుభవంబును జెందినవారలై భజించుచున్నారు. (౮)

**మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్।**
**కథయన్తశ్చమాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ॥**

నన్ను సేవించువారి నడతలను జెప్పెదవినుము. నాయందు మనస్సునిల్పిన వారలును ప్రాణములు ఇంద్రియములు మొదలగు వాని నన్నింటిని నా యెడలనర్పించినవారునగు జ్ఞానులు పరమాత్మయగు నన్నెండోరులు శృతివాక్యార్థవివరణములతో తెలియజేసుకొను వారలుగను, వెండియు ననుభవంబుచే నిర్ణయముఁ జేసుకొన్నవారలునై యెల్లప్పుడు నిర్విఘ్నంబుగా సత్సంగమువలనఁగాలంబుఁగడపుచు నానందంబు నొందుచున్నారు. (౯)

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్।**
**దదామి బుద్ధియోగంతం యేనమా ముపయాన్తితే॥**



అట్లుండువానికి గలుగు ప్రయోజనంబేమి యనెదవో? చెప్పెద వినుము. ఎవరు ప్రీతితోడను భక్తితోడను నాయం దేకాగ్రచిత్తముతోడను గూడినవారలయి పైనచెప్పినట్లు భజించుచున్నారో, వారికి స్వానుభవముతోఁగూడిన జ్ఞానస్థితిని గలుగఁజేయుచున్నాను. వారు నాచేత నివ్వఁబడిన జ్ఞానసాధనంబువలన నన్నే పొందుచున్నారు. ()

**తేషామేవా నుకంపార్థ మహ మజ్ఞాన జంతమః।**
**నాశయా మ్యాత్మ భావస్థో జ్ఞాన దీపేన భాస్వతా॥**

నీవంటి సద్గురువుం జెందిన వాని కుపదేశంబువలన నాత్మజ్ఞానము కలుగవచ్చునే కాని, ఆత్మ సాక్షాత్కారంబనెడి స్వానుభవ మెట్లు కలుగును. స్వానుభవంబులేక యుండునంతవఱకుఁ బరమాత్మయగు నిన్నుం బొందుటెట్లని యడిగెదవో? నేను పైనఁజెప్పఁబడ్డ నాభక్తుల హృదయంబులయందుండువాఁడనై వారి కనుగ్రహంబుఁ గలుగఁజేయు దలంపుగలవాఁడనై వారియవివేకంబుచే గలిగిన సంసారమను నంధకారమును చక్కఁగా వెలిగెడి జ్ఞానదీపంబుచేత నశింపఁజేయుచున్నాను. (ఆదీపంబునకు భక్తియేనూనె, ధ్యానాభ్యాసాసక్తియే యా దీపమును ప్రకాశింపఁ జేయు వాయువు, బ్రహ్మచర్యము మొదలగు సాధనసంస్కారములేవత్తి, వైరాగ్యముగల యంతఃకరణమే ప్రమిదె, లోకవాసన దేహవాసన శాస్త్రవాసనలను విషయములనుండి తొలఁగి రాగద్వేషాదులనెడు దీపము నార్పివేయు

గాలిలేనిదగు నిశ్చలచిత్తమే స్థానము. తైలధారవలె నెడతెగక చేయు ధ్యానముచేఁగలుగు స్వానుభవమేదీపమనెడి (ప్రకాశము) కనుకనే వారు స్వానుభవమును బొందుచున్నారు. (౧౧)

## అర్జున ఉవాచ.

**పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్।**
**పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్॥౧౨॥**
**ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా।**
**అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే॥౧౩॥**

జీవుఁడు (అర్జునుఁడు) ప్రశ్న చేయుచున్నాఁడు.

సకలవిశేషంబుల నతిక్రమించినదగు సకలాత్మకరమైన భగవంతునియొక్క నిరూపాధికమైనదియు సోపాధిమయినదియు నగు స్వరూపంబును తత్ఫలంబును విని, నిరూపాధికమగు భగవత్స్వరూపమును సాధారణమైన జ్ఞానముగలవారివలనఁదెలిసికొనుట మిగుల కష్టమగుట వలన నావంటి మందాధికారులయెడల ననుగ్రహార్థముగాఁ దెలిసికొనఁదగిన యుపాధితోఁగూడిన రూపమును దెలియఁజేయుమని యడుగ నిచ్ఛగలవాఁడై జీవుఁడు (యర్జునుఁడు) ప్రశ్నఁజేయుచున్నాఁడు.



స్వామీ! నీవే లక్ష్యార్థమైన బ్రహ్మము, నీవే స్వయంజ్యోతి స్స్వరూపుఁడవు; నీవే సకలవస్తువులను పరిశుద్ధిచేయఁదగిన శుద్ధచైతన్యస్వరూపుఁడవు; నిన్ను నిత్యునిగాను సకల ప్రపంచాతీతునిగాను పరమపురుషునిగాను, దైవతలకందఱికి నధిదైవముగాను, అనాదియైనవానినిగాను, సర్వవ్యాపియైనవానిఁగాను స్వానుభవంబును జెందియుండు వసిష్ఠాదిరుషులును (జ్ఞానేంద్రియములును) నారదుఁడు మొదలగు దేవర్షులును (కర్మేంద్రియములును) అసితమహర్షియును (అంతఃకరణముయొక్క తమోగుణాంశమును) దేవలరుషియును (అంతఃకరణముయొక్క రజోగుణాంశమును) వ్యాసమహర్షియును (వేరువేరుగాఁజేయు జీవుఁడును) చెప్పుచున్నారు. అంతర్యామిగానుండు పరమాత్మయగు నీవును అట్లే చెప్పుచున్నావు. (౧౩)

**సర్వమే తదృతం మన్యే యన్మాం వదసి కేశవ॥**
**నహి తే భగవన్ వ్యక్తిం విదు ర్దేవా న దానవాః॥ ౧౪॥**

ఓపరమాత్మా! (శ్రీకృష్ణమూర్తి) నీయొక్క యవతారస్వరూపమహిమను దేవతలును (సన్మార్గంబునఁ బ్రవర్తించుచుండు నింద్రియములును) అసురులును (దుష్టమార్గములోఁ బ్రవేశించునట్టియింద్రియములును) తెలిసికొనఁజాలరని నన్నుగూర్చి యేవాక్యమునైతే చెప్పుచున్నావో; ఓపరమాత్మా! (శ్రీకృష్ణమూర్తీ) అవియన్నియు నిశ్చయములేయని తలంచుచున్నాను. (౧౪)

**స్వయమే వాత్మనాఽత్మానం వేత్థత్వం పురుషోత్తమ!।**
**భూత భావన! భూతేశ! దేవదేవ! జగత్పతే!॥ ౧౫॥**

విష్ణువుగాను, శివుఁడుగాను, జీవుఁడుగాను నుండునట్టి క్షరాక్షరాతీత పూర్ణచైతన్య స్వరూపుఁడవగు ఓపరమాత్మా? (శ్రీకృష్ణమూర్తీ!) సకలభూతములను వానివాని కర్మానుసారంబుగా సృష్టించి పరిపాలించి సంహారణముచేయునట్టి ఓపరమాత్మా? భూతములను కర్మముల ననుసరించి సృష్టిజేయు ఓపరమాత్మా! సకలదేవతాస్వరూపుఁడుగాను సోపాధికుఁడుగాను నుండునట్టి ఓపరమాత్మా! సకలజగంబునకు యజమానుఁడగు ఓపరమాత్మా! నీవుతానుగానే తనను తనచేతనే తెలిసికొనుచున్నావు. (౧౫)

**వక్తు మర్హా స్యశేషేణ దివ్యా హ్యాత్మ విభూతయః।**
**యాభిర్విభూతి భిర్లోకా ని మాంస్త్వం వ్యాప్యతిష్ఠతి॥**

పరమాత్మయగు నీయొక్క సోపాధిక స్వరూపము మిగుల వింతయైనదిగదా? నీయొక్క యేమహిమవలన నీలోకంబులను వ్యాపించుచున్నావో, ఆమహిమయొక్క విశేషములను సంపూర్ణముగాఁ జెప్పఁదగినవాఁడవు నీవే. (౧౬)

**కథం విద్యామహం యోగిం స్త్వాంసదా పరిచిన్తయన్।**
**కేషు కేషుచ భూతేషు చిన్త్యోఽసి భగవన్మయా॥ ౧౭॥**



భగవంతునియొక్క సోపాధిక విభూతివిశేష స్వరూపములఁదెలిసికొనుటవలన నాభగవంతుని ధ్యానించుటకు సుఖకరముగానుండు ననెడి తలంపుతో జీవాత్మ ప్రశ్న చేయునదేమియనఁగా:— మనోలయముచేతనే పొందఁదగిన యోగస్వరూపుఁడవగు ఓపరమాత్మా? నేను యెల్లప్పుడును ఏవిధముగా ధ్యానించినయెడల నిన్నుఁదెలుసుకొందును? ఓభగవంతుఁడా! ఏవస్తు స్వరూపముగా నిన్ను ధ్యానించదగునో అట్టివివరమును నాకు లెస్సగాఁదెలియఁజెప్పుము. (౧౭)

**విస్తరే ణాత్మనో యోగం విభూతిఞ్చ జనార్దన!।**
**భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాఽస్తి మేఽమృతం॥**

ఓపరమాత్మా! నీయొక్క సర్వజ్ఞత్వము మొదలగు సామర్థ్యవిశేషంబులను, ధ్యానముచేయవలసిన వస్తువులయొక్క స్వరూపంబును, ఇంతవఱకు నేడవదియు తొమ్మిదవదియునైన యధ్యాయములయందు జెప్పియుండినను మఱల నిప్పుడు సవిస్తరముగా నాకుఁజెప్పుము. ఏలయనఁగా నీయొక్క నీవాక్యమృదంబును నేనెంతకాలము పానము చేయుచుండినను నాకుఁ దృప్తిగలుగలేదు. (౧౮)

శ్రీభగవానువాచ.

**హన్తతే కథయిష్యామి దివ్యా హ్యాత్మ విభూతయః।**
**ప్రాధాన్య తః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్యమే॥౧౯॥**

పరమాత్మ (శ్రీకృష్ణమూర్తి) చెప్పునది యేమియనిన:—

ఇంతకాలమయిన వెనుక నుపదేశంబునకుఁ బాత్రుఁడవైన ఓజీవుఁడా! (అర్జునా) నీకై యద్భుతములయినవియు ముఖ్యమైనవియు నగు నాయొక్క నానావిధములయిన స్వరూపంబులను జెప్పెదవినుము. విలయనిన నాయొక్కస్వరూపమునకు తుదలేదు. (౧౯)

**అహ మాత్మా గుడాకేశ! శర్వభూతా శయ స్థితః।**
**అహమాదిశ్చ మధ్యఞ్చ భూతా నా మన్త ఏవచ॥ ౨౦॥**

నిద్రనుజయించియుండు ఓజీవుఁడా! సకలభూతములయొక్క హృదయములయందుండునట్టి ప్రత్యగాత్మ స్వరూపుఁడవై నన్ను ధ్యానించుము. ఇదియే ముఖ్యమైనదియు శ్రేష్టమయినదియు నయియున్నది. ఇట్లుధ్యానించశక్తిలేనివానికి వేఱొండు మార్గంబుగలదు. దానినిఁ జెప్పెదవినుము. అదియేదియనిన:— సముద్రమునందు అలలు బుద్బుదములు నురుఁగులువలె సకలభూతంబులును నాయందేయుద్భవించి లయించుచున్నవని తెలియుము. (౨౦)

**ఆదిత్యానా మ హం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్**
**మరీచిర్మరు తా మస్మి నక్షత్రా ణామహంశశీ॥ ౨౧॥**

అట్లుగూడ ధ్యానించశక్తిలేనివానికి నీక్రిదఁజెప్పఁబోవురీతిని సగుణధ్యానముఁ జెప్పఁబడుచున్నది. అదెట్లనిన:— పండ్రెండు నెలలలోను పండ్రెండువిధంబులుగాఁ బ్రకాశించుచుండు సూర్యులలో నేను విష్ణువుగానున్నాను. (ద్వాదశాంతమని చెప్పఁబడు మనోలయస్థానము సర్వవ్యాపకస్థితిని గలుగఁజేయుబ్రహ్మరంధ్రమని చెప్పఁబడు విష్ణుస్థానము నేనే.) ప్రకాశముగలవస్తువులలో కిరణములుగల సూర్యుఁడు నేనే. (జ్ఞానప్రకాశముగల వస్తువులలో స్వయంప్రకాశతగల జ్ఞాననేత్రము నేనే.) నక్షత్రములలో చంద్రుఁడు నేనే. (మాఱుచుండువస్తువులలో మనస్సునేనే) మరుత్తనిఁ జెప్పఁబడు దేవతాభేదములలో మరీచియనువాడు నేనే. (యేదిలేకపోయినా ప్రాణులు జీవింపరో అట్టి ప్రాణవాయువు నేనే.) (౨౧)

**వేదానాం సామ వేదోఽస్మి దేవా నా మస్మివాసవః।**
**ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మిచేతనా॥**

ఋక్కు యజుస్సు సామము అధర్వణము అనునాలుగువేదంబులలో సామవేదము నేనే! (శమదమాది సద్గుణములు నేనే.) దేవతలలో దేవేంద్రుఁడును నేనే,! (అనేకంబులైన కర్మంబులు జేయువానిలో దానాదిక్రియలను జేయుచెయ్యియు నేనే,) ఇంద్రియములలోఁ బరిశుద్ధమనస్సు నేనే, సకలభూతములలోపలఁ గార్యకరణవస్తువుల సమూహములో యదార్థమును దెలియఁజేయందగిన చిత్తవృత్తియగు ప్రజ్ఞయు (వివేకమును) నేనే. (౨౨)

రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్।
వసూనాం పావకశ్చాస్మి మేరు శ్శిఖరిణామహమ్॥ ౨౩॥

పదునొకండు రుద్రులలో శఙ్కరుఁడు నేనే (మనోలయంబుఁ గలుగఁజేయఁదగిన పదునొకండవ స్థానమగు శ్రేయస్సును గలుగఁజేయు భ్రూమధ్యంబునందుండు స్థానము నేనే.) యక్షరాక్షసులలోపలఁ గుబేరుఁడును నేనే. (గుణములలో నాశయు నేనే.) ప్రకాశముఁగల వస్తువులలో జ్ఞానప్రకాశము, అష్టవసువులలో నగ్నియు నేనే, శిఖరంబులుగల కొండలలో మేరుపర్వతము నేనే. (తలలుగల శరీరంబులలో జ్ఞానజ్యోతిస్సుగల మనుష్యులయొక్క తలలు నేనే.) (౨౩)

పురోధసాంచ ముఖ్యం మాం విద్ధిపార్థ! బృహస్పతిమ్।
సేనానీ నామహం స్కన్దః సరసా మస్మి సాగరః॥ ౨౪॥

పురోహితులలో శ్రేష్ఠుఁడగు బృహస్పతి నేనే, (మనుష్యులలో మంచిమార్గమున నడుచుచుండు స్థితియు నేనే.) సేనాధిపతులలో స్కందుఁడును (సుబ్రహ్మణ్యుఁడు) నేనే! (దుర్గుణంబుల జయించు వైరాగ్యము నేనే!) విశాలమై వ్యాపించియుండు నదులలో సముద్రుఁడును నేనే: (సముద్రములోఁ జేరిన నదులెట్లు అభేదస్థితిని జెందునో, అట్లు నన్నుఁ జెందువారికి నభేదస్థితియగు సకలసమత్వబుద్ధిని గలుగఁ జేయువాఁడును నేనే.) (౨౪)



మహర్షీణాం భృగు రహం గిరామస్మ్యేకమక్షరమ్।
యజ్ఞానాం జప యజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః॥

మహర్షులలో భృగువను పేరుగల మహర్షియు నేనే. (జనులందఱును పొందఁగూడిన చోటును నేనే,) వాక్కుచే పలుకఁబడు మాటలలో “ఓంకారము,, అను నాశరహితమైన యక్షరస్వరూపుఁడు నేనే, యజ్ఞములలో జపయజ్ఞము నేనే. (వాక్కు మొదలైన వ్యాపారము లేని శబ్దములయొక్క యర్థమును చింతనచేయు హృదయముచే నుపాసన చేయఁబడు జపజ్ఞము నేనే.) కదలక నిలుకడగనుండు వానిలో హిమాలయము నేనే. (కదలకయుండువానిలో శుద్ధమనస్సు నేనే.) (౨౫)

అశ్వత్థస్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః।
గన్ధర్వాణాం చిత్ర రథ స్సిద్ధానాం కపిలో మునిః ౨౬॥
ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్।
ఐరావతం గజేంద్రాణాం నరాణాంచ నరాధిపమ్ ॥ ౨౭॥

అన్నిచెట్లలోపల రావిచెట్టు నేనే, (వృద్ధిజెంది జ్ఞానంబు నావరించునట్టి స్వభావముగల సంసారవృక్షము నేనే.) దేవర్షులలోపల నారదుఁడును (కర్మేంద్రియములును) గంధర్వులలోఁ జిత్రరథుఁడను గం

ధర్వుఁడును (చన్దనము మొదలయిన వాసనాద్రవ్యములచేతను, సంగీతము మొదలయిన వాద్యవిశేషములవలనను, మదోన్మత్తులగు విచిత్రమైన శరీర స్వరూపమును) అణిమాదులుగల సిద్ధులలోపల జ్ఞానము, భక్తి, యోగము మొదలయిన వానిని బయలుపరచుటకయి యావిర్భవించిన కపిలమహామునియు, గుఱ్ఱములలో సముద్రమును చిలికినప్పుడు దృవించిన తెల్లని గుఱ్ఱమును (ఆత్మను క్రిందియరణినిగాను, ఓంకారమును మీదియరణినిగాను చేసి చిలుకుటచేఁ గలిగిన సకలవ్యాపకశక్తిగల కీర్తిని బొందిన శుద్ధవస్తువును) ఏనుగులలో నైరావతంబును సముద్రములోనుండిబుట్టిన తెల్లయేనుఁగను, (స్వరూపసముద్రమునుండిబుట్టు నానందస్వరూపమగు మహాదేవుఁడు, మహావిష్ణువు, జీవుఁడు మొదలగునవియు) నేనే యని తెలిసికొనుము.

**ఆయుధానా మహం వజ్రం ధేనూ నా మస్మి కామధుక్**
**ప్రజన శ్చాస్మి కన్దర్ప స్సర్పాణామస్మి వాసుకిః॥ ౨౮॥**

ఆయుధములలోదధీచి మహర్షి యొక్క వెన్నెముకచే జేయఁబడిన వజ్రాయుధము నేనే. (దుష్టనిగ్రహము నంగీకరించెమైన వెనుకఁదీయని కఠినస్వభావమును నేనే.) దూడను నాలుకతో నాకుచు బాలిచ్చు పశువులలో, నేను కోరినదంతయు నిచ్చు కామధేనువుగా నున్నాను. (జ్ఞానక్షీరమును బానముచేయ నిచ్ఛగలవారికధికముగు నాదరణతో జ్ఞానము నిచ్చువస్తువు నేనే.) ప్రజలయొక్క యుత్పత్తికిఁగారణమయిన కామస్వరూపుఁడను నేనే, (జ్ఞానమనెడి పుత్రుఁడుగలుగుటకుఁ గారణమైన మోక్షాపేక్ష మొదలగు కోరికలు నేనే,) విషముగల సర్పములలో వాసుకియను సర్పము నేనే, (శరీరమంతయు విషముగా నుండు దుష్టుఁడను నేనే.) (౨౮)

**అనన్త శ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్।**
**పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమ తా మహమ్**

విషములేని పాములలో ననంతుఁడను సర్పముగానున్నాను, (ఉపకారముగాని లేక యపకారముగాని లేకయుండువారు నేనే.) జలదేవతలలో వరుణుఁడు నేనే, (సత్సంగములోనుండు వారి జ్ఞానము నధికవేగముగా నావరించు శక్తియు నేనే,) పితృదేవతలలో నర్యమ యనువాఁడను నేనే, (తండ్రి తండ్రికిఁదండ్రి తండ్రి తండ్రికిఁదండ్రి యను నీ విధముగా నంతములేని తండ్రులయొక్క పరంపరలో శ్రేష్ఠమైన తండ్రి నేనే,) వారివారి కర్మఫలాను సారంబుగా శిక్షించు యముఁడను నేనే. (౨౯)

**ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్।**
**మృగాణాం చ మృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్**

ధర్వుఁడును (చన్దనము మొదలయిన వాసనాద్రవ్యములచేతను, సంగీతము మొదలయిన వాద్యవిశేషములవలనను, మదోన్మత్తులగు విచిత్రమైన శరీర స్వరూపమును) అణిమాదులుగల సిద్ధులలోపల జ్ఞానము, భక్తి, యోగము మొదలయిన వానిని బయలుపరచుటకయి యావిర్భవించిన కపిలమహామునియు, గుఱ్ఱములలో సముద్రమును చిలికినప్పుడు ద్భవించిన తెల్లని గుఱ్ఱమును (ఆత్మను క్రిందియరణినిగాను, ఓంకారమును మీదియరణినిగాను చేసి చిలుకుటచేఁ గలిగిన సకలవ్యాపకశక్తిగల కీర్తిని బొందిన శుద్ధవస్తువును) ఏనుగులలో నైరావతంబును సముద్రములోనుండిబుట్టిన తెల్లయేనుఁగను, (స్వరూపసముద్రమునుండిబుట్టు నానందస్వరూపమగు మహాదేవుఁడు, మహావిష్ణువు, జీవుఁడు మొదలగునవియు) నేనే యని తెలిసికొనుము.

**ఆయుధానా మహం వజ్రం ధేనూ నా మస్మి కామధుక్**
**ప్రజన శ్చాస్మి కన్దర్ప స్సర్పాణామస్మి వాసుకిః॥ ౨౮॥**

ఆయుధములలో దధీచి మహర్షియొక్క వెన్నెముకచే జేయఁబడిన వజ్రాయుధము నేనే. (దుష్టనిగ్రహము సంగోంచమైన వెనుకఁదీయని కఠినస్వభావమును నేనే.) దూడను నాలుకతో నాకుచు చాలిచ్చుపశువులలో, నేను కోరినదంతయు నిచ్చు కామధేనువుగా నున్నాను. (జ్ఞానక్షీరమును బానముచేయ నిచ్ఛగలవారికధికముగు నాదరణతో జ్ఞానము నిచ్చువస్తువు నేనే.) ప్రజలయొక్క యుత్పత్తికిఁ గారణమయిన కామస్వరూపుఁడను నేనే, (జ్ఞానమనెడి పుత్త్రుఁడుగలుకుటకుఁ గారణమైన మోక్షాపేక్ష మొదలగు కోరికలు నేనే,) విషముగల సర్పములలో వాసుకియను సర్పము నేనే, (శరీరమంతయు విషముగా నుండు దుష్టుఁడను నేనే.) (౨౮)

**అనన్త శ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్।**
**పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్**

విషములేని పాములలో ననంతుఁడను సర్పముగానున్నాను, (ఉపకారముగాని లేక యపకారముగాని లేకయుండువారు నేనే.) జలదేవతలలో వరుణుఁడు నేనే, (సత్సంగములోనుండు వారి జ్ఞానము నధికవేగముగా నావరించు శక్తియు నేనే,) పితృదేవతలలో నర్యమ యనువాఁడను నేనే, (తండ్రి తండ్రికిఁ దండ్రి తండ్రి తండ్రికిఁ దండ్రి యను నీ విధముగా నంతములేని తండ్రులయొక్క పరంపరలో శ్రేష్ఠమైన తండ్రి నేనే,) వారివారి కర్మఫలాను సారంబుగా శిక్షించు యముఁడును నేనే. (౨౯)

**ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్।**
**మృగాణాం చమృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్**

సత్త్వగుణముగల యసురులలో శ్రేష్ఠమైన తేజస్సుగలవాఁడయి యుండి మరణకాలమందు నాసురభావముతో మృతిఁజెందినందుచేత నసురునకుఁ బుట్టి మంచినడవడిక గలవాఁడయి యుండిన ప్రహ్లాదుఁ డనుగా ఎల్లప్పుడు నానందమందుండు వాఁడనుగా నుంటున్నాను, ఆయుఃకాలపరిమితియందుఁ గాలస్వరూపుఁడనుగా నుంటున్నాను, మృగములలో సింహము నేనే. (మనుష్యులలోనుండు శౌర్యము నేనే.) పక్షులలో గరుత్మంతుఁడు నేనే. (పరువిడు మనస్సులో భక్తిగుణము నేనే.) (౩౦)

**పవనః పవతామస్మి రామశ(స్త్ర) భృతామహమ్।**
**ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ॥ ౩౧॥**

పరిశుద్ధముఁజేయువానిలో జననమరణములులేని మనోలయమును గలుగఁజేయు ప్రాణవాయువుగా నున్నాను. ఆయుధముగలవారిలో ఇంద్రియములను మనస్సును నిలుపుటకుసాధన మయిన మార్గములలో శ్రీరాముఁడనుగా పరబ్రహ్మస్వరూపుఁడనుగా నున్నాను. మత్స్యజాతిలో భోజ్యవస్తువులలో మకరముగా (మాయగా) నున్నాఁడను. నదులలో (తనంతట నేయూరుచుండు నీళ్లుగలవానిలో) గంగానదిగా జ్ఞానగంగగా నుంటున్నాను. (౩౧)

**సర్గాణా మాది రన్తశ్చ మధ్యం చైవాహ మర్జున।**
**అధ్యాత్మ విద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్॥**



ఓజీవుఁడా! (అర్జునా!) సకలసృష్టులకు నాదియయిన వాఁడను గాను (ఉత్పత్తికారణ భూతుఁడను) మధ్యమును (రక్షణకర్తయును), అంతమును (లయకారకుఁడను) నేనే. విద్యలలోపల మోక్షసాధనము బ్రహ్మవిద్యయును, ప్రవచన కర్తలలో గురుశిష్యులయొక్క యుక్తిప్రత్యుత్తర రూపమయిన ప్రవచనము నేనే. (౩౨)

**అక్షరాణా మకారోఽస్మి ద్వన్ద్వ స్సామాసికస్య చ।**
**అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః**

అక్షరములలో (విరోధములేని కర్మముగలవానిలో) "అ" యను అక్షరముగా (త్రిమూర్తులలోపల ఆదియగు బ్రహ్మగానున్నాను.) తత్పురుషము మొదలగు సమాసములలో ఒకేవస్తువును నిరూపించు జంటజంటగా నుండువానిలో ద్వంద్వసమాసముగాను, (శంకరనారాయణులు, సీతారాములు, రామకృష్ణులు మొదలగునవిగాను) కాలమునకుఁ గాలమైయుండు నాశములేని పరమేశ్వరస్వరూపుఁడను నేనే. సకలప్రాణులకును గర్మఫలంబులం బంచిపెట్టువాఁడను నేనే. (౩౩)

**మృత్యు స్సర్వహర శ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్॥**
**కీర్తి శ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా॥౩౪॥**

ప్రళయకాలమందు సకలప్రాణులను నశింపఁజేయు మృత్యువును (యముఁడును) సుఖంబొందఁదగిన ప్రాణులయొక్క సుఖకారణమయినవాఁడును, స్త్రీలకు నే గుణంబులుండినయెడల శ్రేష్ఠమని చెప్పుదురో అట్టి దర్మగుణంబును, బుద్ధియు, విద్యయు, సభర్తృసేవవలనఁగలిగిన స్వానుభవజ్ఞానమును, సద్గురుసేవవలనఁ దాను వడసిన తత్త్వజ్ఞానమును, తనకుఁగాని తనకుటుంబములోని వారికిఁగాని సంభవించు సుఖదుఃఖసమయములలో మనోవికారముం జెందకయుండు ధైర్యమును, తనకు దుఃఖముఁగలుగఁజేసిన వారియెడలఁగూడ బదులుగా మనస్సునొప్పింపక మనస్సునణఁచునదగు నోర్పును నేనే. (౩౪)

**బృహత్సామ తథాసామ్నాం గాయత్రీ ఛన్దసా మహమ్**
**మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః॥**

పాపములంబోఁగొట్టుటయందు సకలాభిలాషలను విడుచుటయనె మోక్షసాధనంబగు శ్రేష్ఠమైన యనుష్ఠానమును, ఆనందముఁగలుగఁజేయువానిలో జననమరణ రహితంబగు గాయత్ర్యనుష్ఠానంబును, నేనే. జ్ఞానాజ్ఞాన పరిమితిగల కాలములలో పైన జరుగఁబోవు జ్ఞానకాలంబును, షడ్రుతువులలో, దమము, శమము, ఉపరతి, తితిక్ష, సమాధానము, శ్రద్ధయును నేనే. (౩౫)



**ద్యూతం ఛలయతా మస్మి తేజస్తే జస్వినా మహమ్।**
**జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్వం సత్వవతామహమ్**

సద్గురుకటాక్షములేని బుద్ధిమంతులయొక్క బుద్ధిని భ్రమింపఁజేయు మోహశక్తినేనే, సమస్తనామరూపములుఁగలుగుటకు సాధనంబగు రేతస్సును అణురూపంబగు తేజోమయవస్తువునేనే. కామక్రోధాదులను శత్రువులను జయింపదగిన శక్తిస్వరూపమగు జయమును నేనే, సద్గురునిజెంది తన్మూలంబుగా దెలిసికొనినవాటి ననుష్ఠానమునకు తెచ్చుకొను శక్తియు నేనే. ధర్మజ్ఞాన వైరాగ్యంబులకు సాధనంబైన ప్రజ్ఞాస్వరూపంబు నేనే. (౩౬)

**వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః।**
**మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనాకవిః॥ ౩౭॥**

బాహ్యాంతరాశుచులను బోఁగొట్టు జలసదృశమైన పరిశుద్ధవస్తువులలో సమస్తమున కాచ్ఛాదనంబగు వాసుదేవ స్వరూపంబు నేనే, శుద్ధాంతఃకరణ ఫలంబగు జ్ఞానముగల వారిలో సుఖమునుగోరు సుఖస్వరూపంబగు జీవుఁడు నేనే, సమస్తమును ప్రకాశింపజేయు స్వయంప్రకాశ స్వరూపుఁడును నేనే. (౩౭)

**దణ్డో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్।**
**మానం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్**

శాంతముగల వారలయందుండు శాంతస్వరూపము నేనే, జయశాలులయొక్క యిహపర జయస్వరూపంబులు నేనే, గురుముఖముగ శ్రవణమనన నిదిధ్యాసలఁజేసి పరిపక్వమును జెంది తద్వారా సమాధినిష్ఠాలయమను స్వానుభవముఁగలవారలయొక్క యనుభవ జ్ఞానంబు నేనే. (౩౮)

**యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున!**
**నతదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్॥**

ఓ జీవుఁడా! సమస్తమునకాదికారణంబగు విత్తనము నేనే, చరాచరస్వరూపంబగు సకలంబును విత్తనమునుండి బయలువెడలు చెట్లువలె నాయందుండి వచ్చుచున్నవేకాని వేరు కాదు.

**నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప!**
**ఏషతూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా॥ ౪౦॥**

కామక్రోధాది దుర్గుణసైన్యమును దపింపఁజేయు ఓ జీవా! విత్తనమునుండి వచ్చిన చెట్టునందుఁగల ఆకులు పువ్వులు పిందెలు కాయలు పండ్లు టెంకలు కొమ్మలు మొదలగువానివలె నాయందుండిఁ గలిగిన సమస్తరూపంబులకు సంఖ్యయిట్టిదని లేదు, లెక్కపెట్టుటకు నలవికాదు. (౪౦)



**యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా।**
**తత్తదేవా వగచ్ఛత్వం మమ తేజోంఽశ సమ్భవమ్॥**

ఐశ్వర్యకాంతి యుత్సాహ స్వరూపంబులగు సమస్తంబును నాయొక్క స్వయంప్రకాశ స్వరూపంబునంగల భావములే యని తెలిసికొనుము. (౪౧)

**అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున!**
**విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్॥౪౧॥**

జ్ఞానాజ్ఞానములను సంపాదింపఁదగిన ఓ జీవుఁడా! వెవ్వేరుగా నన్ను దెలిసికొనుటలో నీకేమిప్రయోజనము? సమష్టి వ్యష్టి యనఁగా తోట చెట్లువినా తోటయును, తోటవినా చెట్లునెట్లుండఁజాలవో, యట్లే నన్ను విడిచి చరాచరము లుండుటకు వీలులేదు గనుక సర్వమును నాయొక్కయంశములే యని దెలిసికొనుము. (౪౨)

ఇట్లు

విభూతియోగమనునది

**పదియవయధ్యాయము**

ముగిసెను.

ఓమ్ తత్సత్.

---

శ్రీరస్తు.

# పదునొకండవ అధ్యాయము.

విశ్వరూప సందర్శన మననయోగము.

## అర్జున ఉవాచ.

**మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్।**
**యత్త్వ యోక్తం వచస్తేన మోహోఽయంవిగతోమమ**

జ్ఞానాజ్ఞానములను సంపాదింపఁడగిన జీవుఁడు, పరమాత్మనుగూర్చి జెప్పుటయేమనఁగా:—

పదియవయధ్యాయము యొక్కతుదను, సమస్తము నాయొక్కయంశములేయనిఁ జెప్పిన పరమాత్మయొక్క వచనమును విని, యన్నియు పరమాత్మస్వరూపముగా నుండుటను జూచుటకిచ్ఛగలవాఁడై, ఓపరమాత్మ స్వరూపుఁడా! నాయందుఁ గృపదాల్పి నాయొక్క శోకమోహములను బోఁగొట్టుటకై శ్రేష్ఠమైనదియు రహస్యమయినదియునగు నాత్మానాత్మ వివేకమును, "సమస్తసరీరములును, జంపఁబడినను నాత్మజంపఁబడఁదగినవాఁడు కాఁడనియు (అ2శ్లో30



లోను) మాయను స్వాధీనముఁగలవాఁడయి ప్రపంచాతీతునిఁగా నుండు నన్ను మాయకులోబడియుండు సాధారణమనుజునిగా మూఢులు దలంచుచున్నారనియు (అ7శ్లో24లోను) సమస్తమునకంతర్యామిగా నుండునాచే చేతనాచేతన స్వరూపములయిన సమస్తమును వ్యాపింపఁబడియున్నదనియు, (అ9శ్లో29లోను) నీమొదలగు నుపదేశవాక్యములను విని నాయొక్కయవివేకమగు మోహము సడలి వెడలినది. (౧)

**భవాప్యయౌహి భూతానాం శ్రుతౌ విస్తరశోమయా।**
**త్వత్తః కమలపత్రాక్ష! మహాత్మ్య మపి చావ్యయమ్॥౨॥**

చాంచల్యమైన మనస్సును నిష్ఠయందు నిలకడగాఁజేయు జ్ఞానేంద్రియాది స్వరూపుఁడవగు ఓపరమాత్మా! "సమస్తమున కుత్పత్తిస్థితిలయములకు కారణుఁడు నేనే" (అ7శ్లో6) యనునీమొదలగు నీయొక్క మహాత్మ్యమును వెల్లడించి చెప్పినవాక్యములను లెస్సగా వింటిని. (౨)

**ఏవ మేత ద్యథాఽఽత్థత్వ మాత్మానం పరమేశ్వర!।**
**ద్రష్టు మిచ్ఛామితే రూప మైశ్వరం పురుషోత్తమ! ॥3॥**

ఓపరమేశ్వరుఁడా! నీచేఁజెప్పఁబడిన నీయొక్క మాహాత్మ్యము వాస్తవమే, ఓపురుషోత్తముఁడా! నీయొక్క యామాహాత్మ్యస్వరూపమును జూచుటకు కోరుచున్నాను. (3)

మన్యసే యది త చ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో!!
యోగేశ్వర! తతో మేత్వం దర్శయాత్మాన మవ్యయమ్॥

ఓస్వామీ! సమస్తమును దానుగానుండు మీయొక్క స్వరూపమును నేను జూచుటకుఁదగుదునని మీరుఁ దలఁచితిరేని అణిమాద్యష్టైశ్వర్యముగల ఓయోగీశ్వరుఁడా! నీయొక్క విశ్వరూపమును నాకొఱకుఁజూపుము. (౪)

శ్రీభగవానువాచ.

పశ్యమే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః॥
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ॥ ౫॥

శ్రీపరమాత్ముఁడిట్లనియె:—

ఓజీవుఁడా! అనేకవిధములయినవియు ప్రపంచవిలక్షణమైనవియు ననేకవిధరంగులను రూపములనుగల సంఖ్యలేనివియునగు నాయొక్క స్వరూపమును జూడుము. (౫)

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా॥
బహూన్య దృష్ట పూర్వాణీ పశ్యాశ్చర్యాణి భారత!!౬॥



ఓజీవా! ప్రకాశస్వరూపములను, అంతర్యామి స్వరూపములను, లయస్వరూపములను, వ్యాపకస్వరూపములను ప్రాణవాయుస్వరూపములను నిట్లనేకముగాఁగల నీవిదివరకు చూచియుండని నద్భుతములను జూడుము. (౬)

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్।
మమ దేహే గుడాకేశ! యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి॥ ౭॥

ఓజీవా! చరాచరస్వరూపములగు సమస్త జగత్తును, సద్గుణసైన్యమునకును దుర్గుణసైన్యమునకును జరుగు యుద్ధమందుఁ గలుగఁబోవు జయాపజయములను జూడగోరుచున్నయెడల, వాటిని యిఁకనీకుఁ గనుపరపఁబోవు నాయొక్క శరీరమం దొక్కచోటనున్నదానిఁగా నిప్పుడు జూడుము. (౭)

నతుమాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా।
దివ్యం దదామి తేచక్షుః పశ్యమే యోగమైశ్వరం॥ ౮॥

నావిశ్వరూపమును నీచర్మ చక్షుస్సుచే చూచుటకు శక్తుఁడవు కావు. జ్ఞానదృష్టిని నీకొఱకిచ్చెదను. నాయొక్క యచింత్యసామర్థ్యాతిశయమును జూడుము. (౮)

సఞ్జయ ఉవాచ.

ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్॥ ౯॥
అనేకవక్త్రనయన మనేకాద్భుత దర్శనమ్।
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥ ౧౦॥
దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్।
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్॥౧౧॥

అవివేకముతో వివేకమిట్లనియె:—

ఓయవివేకమా! సమస్తమైన యోగులకు నీశ్వరుఁడనగు పరమాత్మ యీవిధముగాఁ జెప్పిన పిదప, ననేక వాగభిమానదేవతలను నేత్రాభిమాన దేవతలను గలదియును, ఆశ్చర్యములగు ననేక చమత్కారములను జూపుచున్నదియును, అనేకదివ్యసద్గుణాభరణములుగలదియును, అసంగశస్త్రాద్యాయుధము గలదియును, అనేకవిధపుష్పములు గుచ్చఁబడినమాలికవలె పూర్వజన్మవాసనగల అనేకజీవసమూహములను సమస్తమైన యాశ్చర్యములతో నిండియున్నదియును, అంతములేనిదియును, చరాచరరూపము గలదియగు శ్రేష్ఠమైన విశ్వరూపమును జీవునికొఱకుఁ జూపెను:— (౧౧)



దివిసూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా।
యది భా సదృశీ సా స్యాద్భాస స్తస్య మహాత్మనః॥౧౨॥

ఆకాశమునం దనేక సూర్యులయొక్క కాంతి యేకకాలమందు బయలువెడలు నెడలా కాంతి యామహాత్మునియొక్క కాంతికి సాటి యగును. (౧౨)

తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా।
అపశ్యద్దేవదేవస్య శరీరే పాణ్డవ స్తదా॥ ౧౩॥

అప్పుడు నానావిధనామరూపములుగల సమస్తమైన జగత్తును పరమాత్మయొక్క యావిశ్వరూపమునం దొకచోటనున్నదానిఁగా జీవుఁడు చూచెను. (౧౩)

తత స్సవిస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః।
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత॥ ౧౪॥

ఆవిశ్వరూపమును జూచి యాశ్చర్యముతోఁ గూడినవాఁడును గగురుపాడిచిన దేహముగలవాఁడునునగు నాజీవుఁడు పరమాత్మను సాష్టాంగముగా నమస్కరించి రెండుచేతులను జోడించినవాఁడయి పరమాత్మనుగూర్చి పలికెను. (౧౪)

అర్జునఉవాచ.

పశ్యామిదేవాంస్తవ దేవ! దేహే సర్వాం స్తథా భూత విశేషసంఘాన్ । బ్రహ్మాణమీశం కమలాసనస్థ మృషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్॥ ౧౫॥

జీవుఁడిట్లనియె:—

ఓపరమాత్మా! నీయొక్క విశ్వరూపమునందు సమస్తేంద్రియములను, అట్లేసృష్టికర్తయును జననమరణ సంసారమును దాటినవారలను సమస్తమైన భూతసమూహములను, విచిత్రములయిన దుర్మార్గులను జూచుచున్నాను. (౧౫)

అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామిత్వాం సర్వతోఽనన్తరూపమ్ । నాన్తంనమధ్యం నపునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప!॥ ౧౬॥

ఓపరమాత్మా! అనేకరూపములు గల నిన్నంతటజూచుచున్నాను, నీయొక్క మొదలును మధ్యమును యంతమును జూడలేకున్నాను. (౧౬)

కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్ । పశ్యామిత్వాం దుర్నిరీక్ష్యం సమన్తాత్ దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్॥ ౧౭॥

వ్యాపకత్వమును, కామయుక్తులుగాఁ జేయుటయును, మనస్సును తత్త్వాత్మకముగాఁ జేయుటయును, సర్వప్రకాశముగలవాఁడవుగను, చూచుటకసాధ్యమైనవాఁడవుగను సూర్యాగ్నులవంటి కాంతిగలవాఁడవుగను, తలంచుట కశక్యమైనవాఁడవునుగనుండు నిన్ను సర్వత్ర చూచుచున్నాను. (౧౭)

త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరంనిధానమ్ । త్వమవ్యయ శ్శాశ్వతధర్మ గోప్తా సనాతనస్త్వం పురుషోమతోమే॥ ౧౮॥

నీవు తెలిసికొనవలసిన పరబ్రహ్మము; గవీసకలప్రపంచమునకును గొప్పయాధారమైయున్నావు; నీవునాశరహితుఁడవు; శాశ్వతమైన మోక్షధర్మములనుగాపాడువాఁడవు; నీవుప్రాచీనుఁడైన పురుషుఁడవని నాయభిప్రాయము. (౧౮)

అనాది మధ్యాన్త మనన్త వీర్య మనన్తబాహుం శశి
సూర్య నేత్రమ్ । పశ్యామిత్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపన్తమ్॥ ౧౯॥

ఉత్పత్తిస్థితి నాశములు లేనివాఁడవుగను, అపరిమితమైన సామర్థ్యముగలవాఁడవుగను, చంద్రసూర్యులను నేత్రముగాఁగలవాఁడవుగను, అగ్నిహోత్రునిముఖముగాఁగలవాఁడవుగను నీతేజస్సుచేత నీసకలప్రపంచమును పరితపింపజేయుచున్నవాఁడవుగనునుఁడు నిన్ను జూచుచున్నాను. (౧౯)

ద్యావాపృథివ్యో రిదమన్తరంహి వ్యాప్తం త్వయైకేన
దిశశ్చసర్వాః । దృష్ట్వాఽద్భుతం రూప ముగ్రంతవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥ ౨౦॥

ఓపరమాత్మా! శబ్దాది గుణములును దిక్కు మొదలగు నధిదేవతలును నీచేతవ్యాపింపఁబడి యున్నవిగదా; భయంకరమైనదియు, ఆశ్చర్యకరమైనదియు నగు నీయొక్క విశ్వరూపమునుజూచి పూర్ణమని చెప్పఁబడు భూలోకమును అనన్తసుఖరూపమని చెప్పఁబడు భువర్లోకమును కంపమును బొందియున్నవి. (౨౦)



అమీహిత్వాం సురసఙ్ఘావిశన్తి కేచిద్భీతాః ప్రాఞ్జల
యోగృణన్తి । స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధ సఙ్ఘాః స్తువ
న్తిత్వాం స్తుతిభిః పుష్కలాభిః॥ ౨౧॥

ఈ యుద్ధభూమిని జేరియున్న కర్మేంద్రియములును నిన్ను ప్రవేశించుచున్నవి, కొందరంజలిబద్ధులై నిన్ను స్తుతించుచున్నారు. జ్ఞానేంద్రియాద్యంతఃకరణ సమూహములు క్షేమమవుఁగాతయని పలికిస్తోత్రముఁ జేయుచున్నవి. (౨౧)

రుద్రాదిత్యా వసవో యేచసాధ్యా విశ్వేఽశ్వినౌ మరుత
శ్చోష్మపాశ్చ । గన్ధర్వ యక్షాసుర సిద్ధ సఙ్ఘా వీక్షన్తే
త్వాం విస్మితాశ్చైవ సర్వే॥ ౨౨॥

లయస్వరూపులును ప్రకాశస్వరూపులును నంతర్యామిస్వరూపులును సాధనచతుష్టాభ్యాసకులును స్థూలశరీర వ్యష్ట్యుపరహితచైతన్యులును వ్యాపకస్వరూపులును ప్రాణవాయు స్వరూపులును క్రోధస్వరూపులును యాతనా శరీరస్వరూపులును బాజింపఁదగిన స్వరూపులును యింద్రియముల నపమార్గమునందు నడువువారలును జితేంద్రియుల సమూహములును వీరందరును యాశ్చర్యమును బొందినవారలయి నిన్ను జూచుచున్నారు. (౨౨)

రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో! బహుబాహూరుపాదమ్ । బహూదరం బహుదంష్ట్రాకరాళం దృష్ట్వాలోకాః ప్రవ్యథితాస్తథాఽహమ్॥ ౨౩॥

దుష్టనిగ్రహముచేయు పూజ్యతగలవాఁడా! అనేకయింద్రియములుగల నీయొక్క రూపమును జూచి జీవులు వణఁకుచున్నారు; నేనును నాలాగుననే వణఁకుచున్నాను. (౨౩)

నభఃస్పృశం దీప్తమనేకవర్ణమ్ వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్ । దృష్ట్వాహి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా ధృతిం నవిన్దామి శమంచవిష్ణో॥ ౨౪॥

ఓసర్వవ్యాపకుఁడా! అంతటవ్యాపించియుండువాఁడును ప్రకాశించుచున్నవాఁడును భయంకరములయిన యనేకావయవములు గలవాఁడవును నగు నిన్నుఁజూచి మిక్కిలి భయపడిన మనస్సు గలవాఁడగు నేను ధైర్యమును పొందకున్నానుగదా? (౨౪)

దంష్ట్రాకరాళాని చతే ముఖాని దృష్ట్వైవ కాలానలసన్నిభాని । దిశోనజానే న లభేచ శర్మ ప్రసీద దేవేశ! జగన్నివాస!॥ ౨౫॥



నీభయంకరమైన విశ్వరూపమును జూచి దిగ్భ్రమమును బొందియున్నాను, సుఖమునుపొందకయేయున్నాను. ఓపరమాత్మా! ప్రసన్నుఁడవగుము. (౨౫)

అమీచ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః సర్వే సహైవావనిపాలసఙ్ఘైః । భీష్మోద్రోణః సూతపుత్రస్తథాఽసౌ సహాస్మదీయైరపి యోధముఖ్యైః॥ ౨౬॥

వక్త్రాణితే త్వరమాణా విశన్తి దంష్ట్రాకరాళాని భయానకాని । కేచిద్విలగ్నా దశనాన్తరేషు సన్దృశ్యన్తే చూర్ణితైరుత్తమాఙ్గైః॥ ౨౭॥

అవివేకముయొక్క కొడుకులయిన కామాదులును క్రూరత్వంబును చెడుపుచేయుటయందు వైరాగ్యంబును మమకారంబును ఇట్లుదుర్గుణసైన్యశూరసమూహములును, నాలాగుననే సద్గుణసైన్యశూరులయిన మావారలును నతిశీఘ్రముగా భయంకరమైన నీవిశ్వరూపమును ప్రవేశించుచున్నారు. కొందరు నీయొక్క వికారస్వరూపములో చిక్కుకొనినవారై పొడుముగాఁజేయఁబడిన యవయవములతోఁగూడ కనఁబడుచున్నారు. (౨౭)

యథానదీనాం బహవోఽమ్బువేగాః సముద్రమేవాభిముఖాద్రవన్తి। తథాతవామీ నరలోకవీరా విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి॥ ౨౮॥

నదులయొక్క జలప్రవాహములు సముద్రమును యేలాగునఁ బ్రవేశించుచున్నవో, ఆలాగుననే దుర్గుణసమూహములు నిన్ను బ్రవేశించుచున్నవి. (౨౮)

యథాప్రదీప్తం జ్వలనం పతఙ్గా విశన్తినాశాయ సమృద్ధవేగాః। తథైవనాశాయ విశన్తిలోకా స్తవాపివక్త్రాణి సమృద్ధవేగాః॥ ౨౯॥

మిడతలు మిక్కిలి మండుచున్న యిగ్నినేలాగున బ్రవేశించునో ఆలాగుననే యీకామాదిసమూహములు నిన్నుఁబ్రవేశించుచున్నవి.

లేలిహ్యసేగ్రసమానః సమన్తాల్లోకాన్సమగ్రాన్వదనైర్జ్వలద్భిః। తేజోభిరాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో!॥ ౩౦॥

ఓసర్వవ్యాపియైన పరమాత్మా! నీతేజస్సుచేత సమస్తమైన ప్రపంచమును వ్యాపించి సమస్తమైన జీవులను భక్షించుచున్నవాఁడవై



రుచిచూచుచున్నావు, నీయొక్క తీక్షణమైన కాంతులు జగత్తును దపింపఁజేయుచున్నవి. (౩౦)

ఆఖ్యాహిమేకో భవానుగ్రరూపో నమోఽస్తుతే దేవవర! ప్రసీద। విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం నహిప్రజానామి తవప్రవృత్తిం॥ ౩౧॥

ఓపరమాత్మా! క్రూరమైనరూపముగల నీవెవ్వఁడవు? నాకొఱకుఁ జెప్పవము; నీకొఱకు నమస్కారము; ప్రసన్నమగుము; నిన్ను దెలిసికొనుటకుఁ గోరుచున్నాను; నీవేల యిట్టిభయంకరరూపమును ధరించితివో ఆసంగతిని తెలిసికొనలేకయే యున్నాను. (౩౧)

## శ్రీభగవానువాచ.

కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్సమాహర్తుమిహప్రవృత్తః। ఋతేఽపిత్వాం న భవిష్యన్తి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥ ౩౨॥

పరమాత్మఁ డిట్లనియె:—

ఇది నాయొక్కలయ (సంహార) స్వరూపము; దుర్గుణసైన్యమందు యుద్ధముచేయువారెవ్వరున్నారో క్రూరత్వముమొదలయిన సమస్తమైనవారిని నీవుయుద్ధముఁజేసి చంపకపోయినను వారుజీవింపరు(౩౨)

తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ జిత్వాశత్రూన్భుఙ్క్ష్వరాజ్యం సమృద్ధమ్ । మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్!॥ ౩౩॥

కావున ఓ జీవుఁడా! లెమ్ము; శత్రువులను జయించి శత్రువులేని రాజ్యము (మోక్షము) ననుభవింపుము. ఈ నీ శత్రువులిదివరకే నాచేత నిశ్చయముగా జంపఁబడియున్నారు. నీవు కారణమాత్రముగా నగుము. (౩౩)

ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ కర్ణంతథాఽన్యానపి యోధవీరాన్ । మయాహతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా యుధ్యస్వ జేతాఽసి రణే సపత్నాన్॥ ౩౪॥

ఇదివరకే చంపఁబడినట్లున్న చెడువైరాగ్యంబును క్రూరత్వంబును అల్పత్వంబును మమకారంబును ఆలాగుననే మిగిలిన దుర్గుణసైన్యంబును నీవు జంపుము. బెదరకుము. యుద్ధముచేయుము. యుద్ధమున శత్రువులను జయంపఁగలవు. (౩౪)

### సఞ్జయ ఉవాచ

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాఞ్జలి ర్వేపమానః కిరీటీ । నమస్కృత్వా భూయ ఏవాఽఽహకృష్ణమ్ సగద్గదం భీత భీతః ప్రణమ్య॥ ౩౫॥



వివేకము యవివేకముతో నిట్లనియె:—

జీవుఁడు ఆపరమాత్మయొక్క వాక్యమునువిని వణఁకుచున్నవాఁడై చేతులు జోడించుకొని నమస్కరించి భయపడుచున్నవాఁడగుచు తొట్రుపాటుతోఁ గూడుకొనిన హీనస్వరముఁగలవాఁడై తిరిగియు పలికెను. (౩౫)

### అర్జున ఉవాచ.

స్థానే హృషీకేశ! తవప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యను రజ్యతేచ । రక్షాంసి భీతాని దిశోద్రవన్తి సర్వేనమస్యన్తిచ సిద్ధసఙ్ఘాః॥ ౩౬॥

జీవుఁడిట్లనియె:—

ఓపరమాత్మా! నీయొక్క విశ్వరూపప్రకటనవలన ప్రపంచము మిగుల సంతోషమును ప్రీతిని బొందుచున్నది. దుర్గుణసైనికులు దిక్కులనుగూర్చి పరువిడుచున్నారు. సమస్తమైన జితేంద్రియులు నిన్ను నమస్కరించుచున్నారు, యివియన్నియు నీకుఁదగును. (౩౬)

కస్మాచ్చతే ననమేర న్మహాత్మన్! గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే । అనన్త! దేవేశ! జగన్నివాస! త్వమక్షరం సదసత్తత్పరంయత్॥ ౩౭॥

ఓపరమాత్మా? ఉన్నదియు లేనిదియు నేవో దానికి మూలకారణంబగు నాశరహితవస్తువునీవే; సృష్టికాదికారణుఁడవునీవే; గనుక నే సర్వోత్తముఁడవగు నీకొఱకేల నమస్కరింపకుందురు? (౩౭)

**త్వమాదిదేవః పురుషః పురాణ స్త్వమస్యవిశ్వస్య పరం నిధానమ్ । వేత్తాఽసి వేద్యంచ పరంచధామ త్వయా తతం విశ్వమ నన్తరూప!॥ ౩౮॥**

ఓ పరమాత్మా? మొదటి దేవుఁడును ప్రాచీన పురుషుఁడును నీవే, ఈప్రపంచమునకు శ్రేష్ఠమయిన స్థానమును అన్నిటిని దెలిసికొనిన వాఁడును తెలియఁబడు వస్తుసమూహమును ఉత్తమమైన ప్రాప్య స్థానంబును నీవే; సమస్తప్రపంచంబును నీచేతనే వ్యాపింపఁబడియున్నది. (౩౮)

**వాయుర్యమోఽగ్ని ర్వరుణశ్శశాంకః ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ । నమోనమస్తేఽస్తు సహస్ర కృత్వః పునశ్చ భూయోఽపి నమోనమస్తే॥ ౩౯॥**

పంచప్రాణస్వరూపుఁడును జీవులయొక్క కర్మఫలములనుబట్టి ఫలాఫలములను నియమించువాఁడును మొదటి జన్మస్వరూపుఁడును, సకలజయస్వరూపుఁడును, సమస్తక్రీడాస్వరూపుఁడును, సమస్తమునకు గురుస్వరూపుఁడును, ఆదికారణస్వరూపుఁడును, నీవే. నీకొఱకనేకపర్యాయములు నమస్కారము నమస్కారము. (౩౯)

**నమః పురస్తా దథ పృష్ఠ తస్తేనమోఽస్తుతే సర్వత ఏవ సర్వ! । అనన్త వీర్యామిత విక్రమ స్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః॥ ౪౦॥**

ఓసకలస్వరూపుఁడా! ముందువెనుక నన్నిదిక్కులను నీకొఱకు నమస్కారము. అపరిమితమగు సామర్థ్యమును పరాక్రమమును గల నీవు సమస్తమును నంతటను లెస్సగావ్యాపించియున్నావు. అందువలన సర్వస్వరూపుఁడవగుచున్నావు. (౪౦)

**సఖేతిమత్వా ప్రసభం యదుక్తం హేకృష్ణ! హేయాదవ! హేసఖే! తి । అజానతా మహిమానం తవేదం మయాప్రమాదా త్ప్రణయేన వాపి॥ ౪౧॥**

**యచ్చావహాసార్థ మసత్కృతోఽసి విహార శయ్యాసన భోజనేషు । ఏకోఽథవాప్యచ్యుత! తత్సమక్షం తత్క్షామయే త్వామహ మప్రమేయమ్॥ ౪౨॥**

నీయొక్క విశ్వరూపమునెఱుఁగని నాచేత అజ్ఞానము వలనను చనువుచేతనైనను నేయుఁడవని తలంచి ఓకృష్ణుఁడా! ఓయాదవుఁడా!

ఓస్నేహితుఁడా! యని పామరబుద్ధితో నేవాక్యము చెప్పఁబడినదో నాశరహితుఁడవగు ఓపరమాత్ముఁడా! ఆడుకొనుటయందును పడక యందును కలసికూర్చుండునప్పుడును భోజనకాలమందును నొక్కఁడ వైయుండగాఁగాని పెద్దలయెదుటగాని పరిహాసము కొఱకవమానింపఁ బడితి వనునదియేదికలదో అవియన్నిటిని క్షమింపఁగోరుచున్నాను. ()

**పితాఽసి లోకస్య చరాచరస్య త్వ మస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్ । నత్వత్సమోఽ స్త్య భ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽ ప్య ప్రతిమ ప్రభావః॥ ౪౩॥**

ఓసాటిలేనివాఁడా! నీవుసమస్త స్థావర జంగమములకు తండ్రివి గాను గురువుగాను పూజింపఁబడఁదగిన వాఁడవుగాను శ్రేష్ఠుఁడవుగాను నీతోసమానుఁడు లేనివాఁడవుగానునున్నావు. అట్టిస్థితి లో నీకంటే యధికుఁడైన వాఁడెట్లుకలుగును? (౪౩)

**తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాద యేత్వా మ హమీశ మీడ్యమ్ । పితేవ పుత్రస్య సఖేవసఖ్యు ప్రియః ప్రియాయాఽర్హ సిదేవ సోఢుమ్॥ ౪౪॥**

ఆ హేతువువలన నీశ్వరుఁడును స్తోత్రముచేయఁదగినవాఁడును నగునిన్ను సాష్టాంగముగా నమస్కరించి క్షమింపుమని ప్రార్థించుచు



న్నాను, ఓదేవా! తండ్రిపుత్రునియొక్క తప్పును క్షమించునట్లును సరిసమానము గలవానివలెను "అహంసచమమప్రియః" (అ.7-శ్లో. 17) లో చెప్పఁబడినట్లుసరిసమాన ప్రేమగల వానివలెను నాతప్పులను క్షమింపఁదగియున్నావు. (౪౪)

**అదృష్టపూర్వం హృషితోఽస్మిదృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనోమే । తదేవ మే దర్శయదేవ! రూపం ప్రసీద దేవేశ! జగన్నివాస!॥ ౪౫॥**

చూడఁబడని యీ విశ్వరూపమునుజూచి సంతసించినాను; నా మనస్సు భయముచే వణఁకుచున్నది. ఓపరమాత్మా! అనుగ్రహించి నీయొక్క యవయవస్ఫూర్తిగల పూర్వరూపమునే నాకు మఱలఁ జూపుము (౪౫)

**కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ । తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్ర బాహో భవవిశ్వమూర్తే॥ ౪౬॥**

ఈవికారమైన విశ్వరూపమునుమాని స్వరూపవ్యాపిగాను జీవులను కామయుక్తులుగాఁజేయు స్వరూపమును, మనస్సును తత్త్వాత్మకముగాఁజేయు స్వరూపమును దాల్చినవాఁడుగానిన్ను జూచుటకు

నేను గోరుచున్నాను. ఓసమస్తప్రపంచంబును స్వరూపముగాఁగల వాఁడా! ధర్మార్థకామమోక్షంబను చతుర్విధపురుషార్థముల నిచ్చు స్వరూపము తోడనే మఱల అగుము. (౪౬)

శ్రీభగవానువాచ.

మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శిత మాత్మయోగాత్ । తేజోమయం విశ్వ మనన్త మాద్యం యన్మే త్వదన్యేన నదృష్టపూర్వమ్॥ ౪౭॥

అందునకు పరమాత్మయిట్లనియె.

ప్రకాశస్వరూపమైనదియు నాశరహితమయినదియు మొదటిదియు నగు నాయొక్క శ్రేష్ఠమైన యేవిశ్వరూపమును జూచితివో ఆరూపమునీయందనుగ్రహబుద్ధిగల నాయొక్క యోగమాయా సామర్థ్యముచేత ఓజీవుఁడా! చూపఁబడినది. (౪౭)

నవేద యజ్ఞాధ్యయనైర్న దానైర్నచక్రియాభిర్నతపోభి రుగ్రైః । ఏవం రూప శ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర! ॥ ౪౮॥

ఓజీవుఁడా! ఇట్టివిశ్వరూపమును వేదము యాగము అధ్యయనము మొదలగువానిచేతను దానాదులచేతను కర్మముల నాచరించుటచేతను



క్రూరమైన తపస్సుచేతను జూచుటకలవిగాదు; నాయనుగ్రహము వలన నీవు చూచినావు. (౪౮)

మాతేవ్యథా మాచ విమూఢభావో దృష్ట్వా రూపం ఘోర మీదృఙ్మమేదమ్ । వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం త దేవ మే రూప మిదం ప్రపశ్య॥ ౪౯

నాయొక్కవిశ్వరూపమును జూచి నీకుభయమును తెలివితప్పిన చిత్తమును గలుగఁగూడదు; నీవు భయములేనివాఁడవై సంతోషముతో నాయొక్కపూర్వరూపమునే తిరిగియు లెస్సగాఁజూడుము. (౪౯)

సఞ్జయ ఉవాచ.

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా స్వకం రూపం దర్శయామాస భూయః । ఆశ్వాసయామాస చ భీత మేనం భూత్వా పునస్సౌమ్య వపుర్మహాత్మా॥ ౫౦॥

వివేకమవివేకముతోడిట్లనియె.

పరమాత్మ జీవునిగూర్చి యీవిధముగాఁజెప్పి తనయొక్క శాంత స్వరూపమును మఱలఁజూపి భయమును బొందియున్న జీవునియో దార్చెను. (౫౦)

## అర్జునఉవాచ.

దృష్ట్వేదం మానుషం రూపం తవసౌమ్యం జనార్దన!
ఇదానిమస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతింగతః॥ ౫౧॥

జీవుఁడుపరమాత్మతోఁడిట్లనియె.

“ఇన్ద్రియాణాంమనశ్చాస్మి” అని (అ. 10-శ్లో. 22) లోఁజెప్పఁబడినట్లుకర్మేంద్రియములయిదు జ్ఞానేంద్రియలయిదు ప్రాణాదులయిదు బుద్ధి మనస్సు గలిసి 17 తత్త్వస్వరూపములను జూచి నేను తేఁటపడిన మనస్వస్థతను నిర్భయమును ప్రజ్ఞయును జెందితిని. (౫౧)

## శ్రీభగవానువాచ.

సుదుర్దర్శమిదం రూపం దృష్టవా నసియన్మమ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః॥౫౨॥

జీవునివాక్యమునువినిన పరమాత్ముఁడిట్లనియె.

ఇతరులచేఁజూచుటకు దుర్లభంబగు నేవిశ్వరూపమును జూచితివో ఆరూపంబును సద్గుణాభిముఖులుఁగూడ చూడఁగోరువారగుచున్నారు. (౫౨)



నాహంవేదైర్న తపసా నదానేన నచేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా॥౫౩॥

వేదములచేతను ఘోరతపస్సు మొదలగువానిచేత నావిశ్వరూపమును జూచుటకు సాధ్యముకాదు. (౫౩)

భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున।
జ్ఞాతుంద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుంచ పరన్తప!॥ ౫౪॥

ఓజీవుఁడా! నేనుస్థిరమైన భక్తిచేతనే యథార్థముగాఁ దెలిసికొనుటకును చూచుటకును నాలోనైక్యము నొందుటకును శక్యుఁడనగుచున్నాను. (౫౪)

మత్కర్మ కృన్మత్పరమో మద్భక్త స్సఙ్గవర్జితః।
నిర్వైర స్సర్వభూతేషు యస్సమామేతి పాణ్డవ!॥ ౫౫॥

గనుక ఓ జీవుఁడా? సత్కర్మములను ఫలాపేక్షరహితముగాఁ జేయువాఁడును నన్నేనమ్మినవాఁడును భోగములయందుఁ బ్రీతివిడి

అర్జునఉవాచ.

దృష్ట్వేదం మానుషం రూపం తవసౌమ్యం జనార్దన!
ఇదానీమస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతింగతః॥ ౫౧॥

జీవుఁడుపరమాత్మతోడిట్లనియె.

"ఇన్ద్రియాణాంమనశ్చాస్మి" అని (అ. 10-శ్లో. 22) లోఁజెప్పఁబడినట్లుకర్మేంద్రియములయిదు జ్ఞానేంద్రియలయిదు ప్రాణాదులయిదు బుద్ధి మనస్సు గలిసి 17 తత్త్వస్వరూపములను జూచి నేను తేఁటపడిన మనస్స్వస్థతను నిర్భయమును ప్రజ్ఞయును జెందితిని. (౫౧)

శ్రీభగవానువాచ.

సుదుర్దర్శమిదం రూపం దృష్టవా నసియన్మమ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః॥ ౫౨॥

జీవునివాక్యమునువినిన పరమాత్ముఁడిట్లనియె.

ఇతరులచేఁజూచుటకు దుర్లభంబగు నేవిశ్వరూపమును జూచితివో ఆరూపంబును సద్గుణాభిముఖులుఁగూడ చూడఁగోరువారగుచున్నారు. (౫౨)



నాహంవేదైర్న తపసా నదానేన నచేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా॥ ౫౩॥

వేదములచేతను ఘోరతపస్సు మొదలగువానిచేత నావిశ్వరూపమును జూచుటకు సాధ్యముకాదు. (౫౩)

భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున।
జ్ఞాతుంద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుంచ పరన్తప!॥ ౫౪॥

ఓజీవుఁడా! నేనుస్థిరమైన భక్తిచేతనే యథార్థముగాఁ దెలిసికొనుటకును చూచుటకును నాలోనైక్యము నొందుటకును శక్యుఁడగుచున్నాను. (౫౪)

మత్కర్మ కృన్మత్పరమో మద్భక్త స్సఙ్గవర్జితః।
నిర్వైర స్సర్వభూతేషు యస్సమామేతి పాణ్డవ!॥ ౫౫॥

గనుక ఓ జీవుఁడా? సత్కర్మములను ఫలాపేక్షరహితముగాఁ జేయువాఁడును నన్నేనమ్మినవాఁడును భోగములయందుఁ బ్రీతివిడి

చినవాఁడును సమస్తప్రాణులయందును ద్వేషములేనివాఁడు నెవ్వఁ
డో, వాఁడు నన్ను బొందుచున్నాఁడు. (౫౫)

ఇట్లు

విశ్వరూపసందర్శన మననయోగమను

పదునొకండవయధ్యాయము.

ముగిసెను.

ఓంతత్సత్.





శ్రీరస్తు.

## పండ్రెండవ అధ్యాయము.

భక్తిమననయోగము.

అర్జునఉవాచ.

ఏవం సతత యుక్తాయే భక్తాస్త్వాం పర్యుపాసతే।
యేచాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥ ౧॥

జీవుఁడు పరమాత్మనుగూర్చి ప్రశ్న చేయుచున దేమనఁగా:—

అ౧౧శ్లో౫౫లోఁ జెప్పఁబడినట్లు కర్మములనాచరించి విశ్వరూప
ము నుపాసించువారలగు సగుణోపాసకులలోను, ఇంద్రియా గోచ
రమయిన బ్రహ్మమును సర్వకర్మలను ద్యజించి సమస్తవాంచలనువ
దలి ధ్యానించువారలగు నిర్గుణోపాసకులలోను వీరిద్దరిలో, నెవ్వారు
యోగమును లెస్సగాఁదెలిసినవారు? (౧)

శ్రీభగవానువాచ.

మయ్యావేశ్య మనోయేమాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతా స్తేమే యుక్తతమా మతాః॥ ౨॥

అందులకు పరమాత్ముఁ డిట్లనియె.

నిర్గుణోపాసకులనుగూర్చి ముందుఁదెలియఁజేసెద. ప్రస్తుతము సగుణోపాసకులనుగూర్చి చెప్పెదవినుము. విశ్వరూపమునందు మనస్సునునిలిపి సమస్తకర్మముల నీశ్వరార్పణబుద్ధితో నాచరించి నన్ను భజించువారు అనేకవిధసగుణోపాసకులలో శ్రేష్ఠునిగానాయభిప్రాయము. (౨)

యేత్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే।
సర్వత్రగ మచిన్త్యంచ కూటస్థ మచలం ధ్రువమ్॥ 3॥
సన్నియ మ్యేన్ద్రియ గ్రామం సర్వత్ర సమబుద్ధయః।
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూత హితేరతాః॥ ౪॥

జ్ఞానకర్మేంద్రియ సమూహమును లెస్సఁగా స్వాధీనముచేసికొని సమస్తమునందు సమబుద్ధిగలవారును, సమస్తమునకు హితమునుగోరువారునై, యిట్టిదనిజెప్పుట కశక్యమైనదియు మనస్సునకు విషయము కానిదియు మాయాప్రపంచమున కధిష్ఠానమైనదియు చలింపనిదియు శాశ్వతమైనదియు నంతటవ్యాపించి యుండునదియునగు నిర్గుణబ్రహ్మమును ధ్యానించుచున్నారో వారిని గూర్చి చెప్పనేల? "జ్ఞానీత్వాత్మైవ" అని (అ7శ్లో18లో) యిదివరకే చెప్పియున్నాను గనుక నిర్గుణోపాసకులే సర్వోత్తములు. (౪)



క్లేశోఽధిక తరస్తేషా మవ్యక్తా సక్త చేత సామ్।
అవ్యక్తాహి గతి ర్దుఃఖం దేహావద్భి రవాప్యతే॥ ౫॥

సర్వోత్తమమైన నిర్గుణోపాసనను జేయక యనేకులు సగుణోపాసనా నిష్ఠులయి యుండుటకుఁ గారణమేమందువేమో చెప్పెద వినుము. అ౧౧ శ్లో ౫౫లోఁ జెప్పఁబడినప్రకారము "మత్కర్మకృత్" శాస్త్రవిహితకర్మము ముల నీశ్వరార్పణబుద్ధితోచేయుటయే అధిక కష్టమయినది; అట్లుండఁగా దేహాభిమానమును బొత్తుగా విడువవలసియున్నదిగాన నిర్గుణధ్యానమధికతరక్లేశమనిచెప్పఁబడినది గనుక దేహాభిమానముఁగలవారలచే నిర్గుణధ్యానమును జెందుటకు సాధ్యము కాదు. (౫)

యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః।
అనన్యేనైవ యోగేన మాంధ్యాయన్త ఉపాసతే॥ ౬॥
తేషామహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్।
భవామి న చిరా త్పార్థ! మయ్యా వేశిత చేతసామ్॥ ౭॥

ఎవ్వారలు సమస్తకర్మఫలములను నాయందు సమర్పించి నన్నే ఉత్తమమయినగతిగాఁ దలంచి విశ్వరూపమును విడిచి యితరమైన దానిని నాలంబనముగాఁ గైకొనక నన్నుఉపాసించుచున్నారో, వార

లను ఓజీవుఁడా? సంసార సాగరమునుండి శీఘ్రముగాఁ గడతేర్చెదను. (౭)

**మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।**
**నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః॥ ౮॥**

కాఁబట్టి విశ్వరూపమునందే మనస్సును బుద్ధిని స్థిరముగానుంచుము. ఈ శరీరము పోయినతరువాత నాయందేయుందువు. ఇందుకెంతమాత్రము సందేహములేదు. (౮)

**అథచిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్।**
**అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ॥**

ఇఁకనుచిత్తమును నాయందు నిశ్చలముగా నిలుపుటకు శక్తుఁడవుగాక పోతివేని, చలించెడిమనస్సును అన్యవిషయములలోనుండి మరలించి విశ్వరూపమునందు మాటిమాటికినుంచుట యనెడు అభ్యాసయోగము చేత నన్ను బొందుటకు బ్రయత్నింపుము.— (౯)

**అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ।**
**మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి॥ ౧౦॥**

అట్లభ్యసించుట కశక్తుఁడవైతివేని నాకుఁబ్రీతిని గలుగఁజేయు నుత్తమకర్మములే ముఖ్యముగాఁగలవాఁడవగుము. అట్లు నాప్రీతికొ



ఱకు కర్మములనాచరించితివేని అట్టికర్మములు చిత్తశుద్ధినితద్వారా యోగమును నందువలన జ్ఞానమును పరంపరగా నీకులభింపఁజేయును.— (౧౦)

**అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః।**
**సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥ ౧౧॥**

ఇఁకను దీనినిఁగూడ నాచరించుట కసమర్థుఁడవగుదువేని, ఆపిమ్మట నీవు చేయుసమస్త సత్కర్మములయందభిమానమునుంచుకొనక నీశ్వరార్పణబుద్ధితోఁ ద్యజింపుము.— (౧౧)

**శ్రేయోహి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।**
**ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్॥**

అవివేకముతోఁగూడిన అభ్యాసముకంటె శాస్త్రజ్ఞానముచే తత్త్వవిచారణచేయుట శ్రేష్ఠమైనది. తత్త్వవిచారణకంటె అట్టిజ్ఞానముతోఁగూడిన ధ్యానము శ్రేష్ఠము. సమాధికాలమందుమాత్రము నిర్విషయముగానుండు మనోస్థితియగు ధ్యానముకంటె ప్రవృత్తియందును మనస్సు విషయ సంబంధరహితముగానుండుట యగు కర్మఫలములను విడుచుట శ్రేష్ఠము. అట్టిత్యాగమువలన వెంటనే బంధనివృత్తి కలుగును. “తే ప్రాప్నువంతి మామేవ” అ౧౨-శ్లో-౪-లో నిర్గుణోపాసకులు

నన్నేఁబొందుదురని స్వతంత్రత్వమును సూచింపుచు "తేషామహం సముద్ధర్తా" అ౧౨-శ్లో-౭లోను ఇతరులగు సగుణోపాసకులను నేను తరింపఁజేయుదునని పారతంత్ర్యమును సూచింపుచున్నదని యెఱుంగునది.— (౧౨)

**అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ।**
**నిర్మమో నిరహఙ్కార స్సమదుఃఖ సుఖః క్షమీ॥ ౧౩॥**
**సన్తుష్ట స్సతతంయోగీ యతాత్మా దృఢనిశ్చయః।**
**మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్త స్సమేప్రియః॥**

నిర్గుణోపాసకులగు బ్రహ్మనిష్ఠుఁడెట్లుండునో చెప్పెదవినుము:—

సమస్తప్రాణులకును ద్వేషములేనివాఁడును స్నేహబుద్ధిగలవాఁడును దయగలవాఁడును మమతలేనివాఁడును అహంకారములేనివాఁడును సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాఁడును ఓర్పుగలవాఁడును ఎల్లప్పుడు సంతోషముగలవాఁడును నిశ్చలచిత్తుఁడైనవాఁడును మనస్స్వాధీనముగలవాఁడును వేదాంతశాస్త్రమందు జెప్పఁబడు తత్త్వస్వరూపము విషయమయి స్థిరమయిన నమ్మకముగలవాఁడై తత్ప్రకారమనుష్ఠించువాఁడును మనస్సును బుద్ధిని నాయందు నిలిపినవాఁడును (అ౭-శ్లో-౧౭లో జెప్పఁబడిన "ప్రియోహి జ్ఞానినోత్యర్థ మహం సచమమప్రియః")నగు నాభక్తుఁడెవ్వఁడో, వాఁడు



నాకుప్రియుఁడు అనగా (అ౭-శ్లో-౧౮లోఁజెప్పంబడినట్లు "జ్ఞానీత్వాత్మైవ మేమతం") జ్ఞానియే నేను, నేనే వాఁడు.— (౧౪)

**యస్మాన్నో ద్విజతే లోకో లోకాన్నో ద్విజతే చయః।**
**హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తోయ స్సచమేప్రియః॥౧౫॥**

ఎవనివలన జనులేవిధములయిన భయమును బొందరో లోకులకెవ్వఁడు భయపడఁడో, సంతోషము కోపము భయము మనోవ్యాకులత మొదలగు వానిచేత నెవ్వఁడు విడువఁబడినవాఁడో వాఁడును నాకుప్రియుఁడు.— (౧౫)

**అనపేక్ష శ్శుచి ర్దక్షః ఉదాసీనో గతవ్యథః।**
**సర్వారమ్భపరిత్యాగీ యో మ ద్భక్త స్సమేప్రియః॥౧౬॥**

దేహేంద్రియాది విషయముల యందాసక్తి లేనివాఁడును కర్మేంద్రియ జ్ఞానేంద్రియాంతః కరణములయొక్క మాలిన్యమును బోఁగొట్టుకొనినవాఁడును, సమయస్ఫూర్తిగలవాఁడును పక్షపాతములేనివాఁడును భయములేనివాఁడును కామ్యకర్మములను విడిచినవాఁడును నెవ్వఁడో, వాఁడును నాకుఁ బ్రియుఁడు.— (౧౬)

**యోనహృష్యతి నద్వేష్టి నశోచతి నకాంక్షతి।**
**శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్సమే ప్రియః॥**

ఎవ్వఁడు యిష్టమందు సంతోషంబును అయిష్టమందు ద్వేషంబును నుంచఁడో, ఇష్టమయిన వస్తువు నెడఁ బాసినప్పుడు దుఃఖింపఁడో, లేనిదికావలయునని యపేక్షింపఁడో, శుభాశుభములను విడిచినవాఁడును నాకుఁబ్రియుఁడు. (౧౭)

**సమ శ్శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః।**
**శీతోష్ణ సుఖ దుఃఖేషు సమ స్సఙ్గవివర్జితః॥ ౧౮॥**
**తుల్యనిన్దా స్తుతిర్మౌని సన్తుష్టో యేన కేన చిత్ ।**
**అనికేత స్థిరమతి ర్భక్తిమాన్ మేప్రియో నరః॥ ౧౯॥**

శత్రువు స్నేహితుఁడు మానావమానములు శీతోష్ణములు సుఖదుఃఖములు వీనియందు సమబుద్ధిగలవాఁడును, కాంతా కనకాదులయందు మనస్సంబంధములేనివాఁడును, స్తుతినిందాదులయందు మౌనముగలవాఁడును, ఏయాహారపదార్థములచేతనైనను సంతోషించువాఁడును నియతమయిన స్థలమునేర్పఱుచుకొననివాఁడును నిశ్చలబుద్ధిగలవాఁడును నెవ్వఁడో వాఁడు నాకిష్టుఁడు.— (౧౯)

**యేతు ధర్మ్యా మృతమిదం యథోక్తం పర్యుపాసతే।**
**శ్రద్దధానామత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః॥ ౨౦॥**



౧౩వశ్లోకము మొదలుకొని యిదివరకుఁజెప్పఁబడిన మోక్షసాధనమైన ధర్మములను నమ్మినవారును, నన్నే సర్వోత్తమమయిన గతిగాఁదెలిసికొనినవారును నగునెవ్వారలు సమాధినిష్ఠచే ననుష్ఠించుచున్నారో, వారు నాకు మిక్కిలి యిష్టులు.— (౨౦)

ఇట్లు

భక్తియోగమననమనఁబడు

పంద్రెండవయధ్యాయము

ముగిసెను.

ఓంతత్సత్.

---



ఓమ్

## పదుమూఁడవ యధ్యాయము.

క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ నిధిధ్యాసయోగము

అర్జున ఉవాచ.

**ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ।**
**ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ!॥ ౧॥**

జీవుఁడు ప్రశ్న చేయుచున్నాడు.

ఓపరమాత్మా! ప్రకృతియనఁగా నెట్టిది? పురుషుఁడెట్టివాఁడు? క్షేత్రమనఁగానేమి? క్షేత్రజ్ఞుఁడెవ్వఁడు? జ్ఞానమనగానేమి? జ్ఞేయమనఁగానేమి? జ్ఞేయమెట్టిది? వీనినన్నిటియొక్క స్వరూపమును దెలియఁజేయుము.— (౧)

శ్రీభగవానువాచ.

**ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్ర మిత్యభిధీయతే।**
**ఏతద్యోవేత్తితం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥ ౨॥**

పరమాత్మపై సంగతులను వివరింపఁదొడంగుచున్నాఁడు.

జీవుఁడా? ఈశరీరమే క్షేత్రమనబడును; ఈశరీరమును దనకన్న వేఱని బాగుగ నెవ్వఁడెఱుంనో వాఁడే క్షేత్రజ్ఞుఁడు.— (౨)

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత!।**
**క్షేత్రక్షేత్రజ్ఞ యోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ॥3॥**

ఓజీవుఁడా! సమస్తశరీరములయందును నన్నే క్షేత్రజ్ఞునిగాఁ దెలిసికొనుము. ఇట్లు శరీరముకన్న వేఱుగానున్న తన్ను దానుదెలిసికొనుటయే జ్ఞానము. (3)

**తత్క్షేత్రం యచ్చయాదృక్చ యద్వికారి యతశ్చయత్।**
**సచయో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు॥ ౪॥**

పైనచెప్పఁబడిన క్షేత్రమను శరీరము ఎట్టి స్వరూపము కలదో యెట్టిధర్మములుకలదో, యెట్టివికారముకలదో యావిరమును, క్షేత్రజ్ఞుఁడెట్టి మహిమలుఁగలవాఁడో వాని స్వరూపమేదో సంగ్రహముగాఁ జెప్పెదవినుము.— (౪)

**ఋషిభి ర్బహుధాగీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్।**
**బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతు మద్భి ర్వినిశ్చితైః॥ ౫॥**

నేనేదో తంత్రముగాఁజెప్పఁబోవుచున్నానని దలంపకుము. ఇది వరకే గొప్పఋషులచేతను వేదములచేతను యుక్తులతోఁగూడిన సంశయ విపర్యయ రహితమైన బ్రహ్మసూత్ర పదములచేతను చెప్పఁబడి యుండునదియని యెఱుంగుము.— (౫)

మహాభూతాన్యహఙ్కారో బుద్ధిరవ్యక్త మేవచ।
ఇన్ద్రియాణి దశైకంచ పఞ్చచేన్ద్రియ గోచరాః॥ ౬॥
ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః।
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతం॥ ౭॥

శబ్ద స్పర్శ రూపరసగంధములను గలుగఁజేయు మహాభూతములయిదును, ఈభూతములకుఁగారణమైన అహంకారతత్త్వంబును, అహంకారమునకుఁ గారణమైననిశ్చయాత్మకమగు మహత్తత్త్వంబును, మహత్తత్త్వంబునకుఁగారణమైన యీశ్వరశక్తి మాయామూలప్రకృతి యని జెప్పఁబడు అవ్యాకృతంబును, వాక్పాణిపాద పాయూపస్థలనఁబడు కర్మేంద్రియములయిదు, త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములనఁబడు జ్ఞానేంద్రియములయిదు, ఈ యింద్రియములు పదియును సంకల్పవికల్పాత్మకమైన మనస్సునను, వచనపరిగ్రహణ గమన విసర్జన ఆనందమనిఁ జెప్పఁబడు ఇంద్రివిషయములయిదును, కోరిక ద్వేషము సుఖదుఃఖము ధైర్యము మొదలగు ఇంద్రియసమూహ వికారంబును,



అంతఃకరణ వృత్తియగుఁదెలివియు కలిగినదే క్షేత్రమనిఁ జెప్పఁబడు నీ శరీరంబు.— (౭)

అమానిత్వ మదమ్భిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మ వినిగ్రహః॥ ౮॥
ఇన్ద్రియార్థేషు వైరాగ్య మన హఙ్కార ఏవచ।
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్ ॥౯॥
అసక్తి రనభిష్వఙ్గః పుత్రదార గృహాదిషు।
నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు॥ ౧౦॥
మయిచాఽనన్య యోగేన భక్తిరవ్యభి చారిణీ।
వివిక్త దేశ సేవిత్వ మరతి ర్జన సంసది॥ ౧౧॥
అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్।
ఏతద్ జ్ఞాన మితిప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా ॥౧౨॥

స్వస్తోత్రము, పరదూషణ లేకుండుట, తాను జేసినపనులను తానే ప్రసిద్ధి చేసుకొనక యుండుట, ప్రాణులను బాధింపకుండుట, ఓరిమి కలిగియుండుట, ఋజుమార్గమునందుండుట, సద్గురు శుశ్రూష చేయుట, నిర్మలమైన మనస్సు గలిగియుండుట, మోక్షమార్గప్రయత్నమందు

స్థిరముగానుండుట, దేహేంద్రియాది సమూహమును మోక్షసాధన పనులలో నుపయోగించుట, ఇష్టములైన యిహపర భోగములలోఁ గూడ నిరాశగానుండుట, గర్వములేకుండుట, జననము మరణము ముదిమి వ్యాధి మొదలగు వానిచేగలుగు దుఃఖమును లెస్సగాఁ దెలిసికొని వానిని తుచ్ఛములని దలంచుట, పుత్రుఁడు భార్యగృహము మొదలగువానియందు ప్రీతిలేకుండుట, తనవారలకుఁగలుగు సుఖదుఃఖములయం దభిమానములేకుండుట, యిష్టానిష్టములయందు సమబుద్ధిగలిగియుండుట, నాయం దభేద బుద్ధియను సమాధిచే చలింపని భక్తిగలిగియుండుట ఏకాంతమందు నివసించుట కపేక్షించుట, దుర్మార్గసమూహముఁ జేరకుండుట, ఆత్మస్వరూప జ్ఞానమందు మనస్సునుంచుట, స్వానుభవము కలిగియుండుటయు నను నీ యిరువది గుణస్వభావములు గలిగియుండుటయే జ్ఞానమనియు, తదన్యము లజ్ఞానముగనుక నివర్తింపఁ జేసికొనవలయునని యెఱుంగుము.— (౧౨)

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృతమశ్నుతే
అనాదిమత్పరం బ్రహ్మ నసత్తన్నాఽసదుచ్యతే॥ ౧౩॥

తెలియఁదగినదేదో దేనిని తెలిసికొని మోక్షమును పొందఁగలఁడో దానిని జెప్పెదవినుము. ఆదిలేని పరబ్రహ్మమనఁబడునది సత్తనిగాని లేక యసత్తనిగాని చెప్పఁబడదు. (౧౩)



సర్వతఃపాణి పాదంతత్ సర్వతోఽక్షి శిరోముఖమ్।
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥ ౧౪॥

ఆబ్రహ్మము అంతట చేతులు గాళ్లుకలదియు అంతట నేత్రములు శిరస్సులు ముఖములు కలదియునై సమస్తమును వ్యాపించుకొనియున్నది.— (౧౪)

సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ॥ ౧౫॥
బహిరంతశ్చ భూతానా మచరం చరమేవచ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికేచతత్॥ ౧౬॥
అవిభక్తంచ భూతేషు విభక్తమివచ స్థితమ్।
భూతభర్తృచ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ॥ ౧౭॥
జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్యవిష్ఠితమ్॥ ౧౮॥

ఆబ్రహ్మము సమస్తేంద్రియగుణములను ప్రకాశింపఁ జేయునదిగాను సమస్తేంద్రియములు లేనిదిగాను దేనిని నంటనిదిగాను సమస్తజగద్భ్రాంతి కాధారమైనదిగాను భూతములలోపల వెలుపల నుండు

నదిగాను స్థావరజంగమ రూపమైనదిగాను నిరవయవ స్వరూపము నైనందున నజ్ఞానులకు తెలియఁబడనిదిగాను దూరస్థముగాను జ్ఞానుల కతిసమీపముగా అనఁగా తనలోనుండునదిగాను కారణస్వరూప ముచే విభజింపఁ బడనిదైనను కార్యస్వరూపముచే విభజింపఁబడి నట్లు నుండునదిగాను భూతములను గలుగఁజేసి పోషించి మ్రింగునది గాను సూర్యచంద్రాదులకుఁ బ్రకాశమిచ్చునదిగాను అజ్ఞాన సం పర్కము లేనిదిగాను జ్ఞానస్వరూపముగాను జ్ఞేయస్వరూపముగాను అమానిత్వాదిగుణములను గలిగియుండు జ్ఞానముచేఁ బొందఁదగిన దిగాను సమస్తప్రాణులయొక్క హృదయమునం దుండునదిగా నున్నది.— (౧౮)

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే॥ ౧౯॥

క్షేత్రస్వరూపంబును జ్ఞానస్వరూపంబును నాలాగుననే జ్ఞేయస్వ రూపంబును సంగ్రహముగాఁ జెప్పఁబడినది. సమస్తమును దానుగాఁ దలంచు నాభక్తుఁడు నాలో నైక్యము నొందుటకు యోగ్యుఁడగు చున్నాఁడు.— (౧౯)

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాది ఉభావపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసమ్భవాన్॥ ౨౦॥



ప్రకృతి స్వరూపమైన క్షేత్రమును పురుషస్వరూపమైన క్షేత్ర జ్ఞుని (జీవుని) యిద్దఱిని ప్రవాహరూప నిత్యులనుగాఁ దెలియుము. దేహేంద్రియబుద్ధ్యాది వికారములను సుఖదుఃఖ మోహాదిగుణంబుల ప్రకృతివలనఁ బుట్టినవానిగానే తెలియుము.— (౨౦)

కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే।
పురుషస్సుఖ దుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే॥

దేహేంద్రియాద్యులను గలుగఁజేయు విషయమందు ప్రకృతి (మాయా) కారణముగాఁ జెప్పబడుచున్నది. జీవుఁడు సుఖదుఃఖ ముల యొక్క యనుభవవిషయమందు కారణముగాఁ జెప్పఁబడు చున్నాఁడు.— (౨౧)

పురుషః ప్రకృతిస్థోహి భుఙ్క్తే ప్రకృతిజా న్గుణాన్।
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోని జన్మసు॥ ౨౨॥

కార్యకారణరూపమయినదియు నవిద్య యనఁబడునదియునగు ప్రకృతి దాననిదలంచి యుండెడి సుఖదుఃఖాదుల ననుభవించు జీవుఁడు, ప్రకృతివలనఁ బుట్టిన గుణముల ననుభవించుచున్నాఁడుగ దా? నేను నాది యనెడి యహంకార మమకారములవలనఁ గలుగు సుఖదుఃఖాది గుణముల విషయమైన యాసక్తి యీజీవునికి పుణ్యా పాప యోనులయందలి పుట్టుకవిషయమై హేతువగుచున్నది.—

ఉపద్రష్టాఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః॥

జీవుఁడీశరీరమం దుండినను శరీరేంద్రియములు వ్యవహారములుఁ జేయుచున్నను దాను వానికంటె వేఱై వాని వ్యాపారములను చూచువాఁడును, తాను దేహేంద్రియ వ్యవహారములయందుఁ బ్రవర్తించు వానివలెఁ దోఁచఁబడువాఁడును, దేహేంద్రియాదులను వహించునట్లు తోఁచువాఁడును, భోక్తయని తోఁచువాఁడును సమస్తమునకాత్మగాను సుతంత్రుఁడుగానుండువాఁడును, అవిద్యాసంబంధముచే యనాత్మగాఁ గల్పింపఁబడిన దేహాదులకంటె శ్రేష్ఠమైనవాఁడునున్నని శ్రుతిచే జెప్పఁబడుచున్నాఁడు. (౨౩)

యఏవం వేత్తి పురుషం ప్రకృతించ గుణైస్సహ।
సర్వథావర్తమానోఽపి నసభూయోఽభిజాయతే॥ ౨౪॥

పయిన జెప్పఁబడిన ప్రకారముగా జీవుని, (తన్ను) సుఖదుఃఖమోహాదులతోఁ గూడుకొనిన ప్రకృతిని నెవ్వఁడు స్వానుభవముగ తెలిసికొనుచున్నాఁడో వాఁడు శాస్త్రోక్తవిధుల నతిక్రమించినను తిరిగి యు జన్మమును బొందఁడు.— (౨౪)

ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మాన మాత్మనా।
అన్యే సాఙ్ఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥ ౨౫॥



ఉత్తమాధికారులు ధ్యానయోగముచేతను మధ్యమాధికారులు సాంఖ్యయోగముచేతను అధమాధికారులు కర్మయోగముచేతను ఆత్మను (తన్ను) దెలిసికొనుచున్నారు.— (౨౫)

అన్యేత్వేవమజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥ ౨౬॥

అధమతమాధికారులో పైన జెప్పఁబడిన విధముగాఁ దెలిసికొనని వారలయినను సద్గురువలన విని యనుష్ఠించుచున్నారో వారలుఁగూడ వేదాంతశ్రవణానుష్ఠానపరులయి సంసారబంధమును దప్పక దాటుదురు. (౨౬)

యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావర జఙ్గమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ!॥ ౨౭॥

ఓజీవుఁడా? స్థావరజంగమాత్మకమైన వస్తువేదేది పుట్టుచున్నదో అది సమస్తమును త్రాడుమొదలగు వానియందు భ్రాంతిచేత ఆరోపింపఁబడిన సర్పముమొదలగు వానివలెనే, క్షేత్రధర్మములను నారోపించుటవలన కలుగునది యని యెఱుంగుము.— (౨౭)

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్।
వినశ్యత్స్వవినశ్యన్తం యఃపశ్యతి సపశ్యతి॥ ౨౮॥

సమస్తప్రాణులయందును సమముగానుండునట్టి పరమేశ్వరుని పైనఁజెప్పఁబడిన దేహేంద్రియాదులు నశించినను నశింపనివానిగా నెవ్వండెఱుంగునో వాఁడు నిజమును దెలిసికొనువాఁడనఁబడుచున్నాఁడు.— (౨౮)

సమంపశ్యన్హి సర్వత్ర సముపస్థిత మీశ్వరమ్।
నహినస్త్యాత్మ నాత్మానం తతోయాతి పరాంగతిమ్॥ ౨౯॥

సమస్తప్రాణులయందును సమముగానున్నట్టి యీశ్వరుని స్వానుభవముచే తెలిసికొనుచున్నవాఁడు తనచేత తన్ను హింసించుకొనఁడు. ఆహింసింపక పోవుటవలన మోక్షమును బొందుచున్నాఁడు.— (౨౯)

ప్రకృత్యై వచకర్మాణి క్రియమాణాని సర్వశః।
యఃపశ్యతి తథాత్మాన మకర్తారం స పశ్యతి॥ ౩౦॥

మనోవాక్కాయకర్మములను ప్రకృతిచేతనే చేయబఁడుచుండు వానిఁగాను ఆలాగుననే తన్నుకర్తకానివానిగాను అన్నిప్రకారములచేత నెవ్వడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు నిజమును తెలిసికొనుచున్నాఁడు.— (౩౦)

యదాభూత పృథగ్భావ మేకస్థ మనుపశ్యతి।
తతఏవచ విస్తారం బ్రహ్మసమ్పద్యతే తదా॥ ౩౧॥



శాస్త్రాచార్యోపదేశమువలన మననముంజేసి సమస్తవస్తువులు నాత్మయే (తానే) యనియు నానావిధ భేదములుగల ప్రపంచము నాత్మవల్లనే (తనవలననే) కలిగినదనియు ఆత్మయొక్కటియే సత్యవస్తువనియు స్వానుభవముచే తెలిసికొనుచున్నాఁడో వాఁడప్పుడు బ్రహ్మమగుచున్నాఁడు.— (౩౧)

అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః।
శరీరస్థోఽపి కౌన్తేయ! నకరోతి నలిప్యతే॥ ౩౨॥

ఓజీవుఁడా! కారణములేనివాఁడగుటచేతను నాశరహితుఁడగు నీపరమాత్మ శరీరములయందున్నట్లు కనఁబడుచున్నవాఁడైనను కర్మములఁజేయువాఁడు కాఁడు; కనుకనే కర్మఫల సంపర్కములేనివాఁడు.— (౩౨)

యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే।
సర్వత్రా వస్థితోదేహే తథాత్మానో పలిప్యతే॥ ౩౩॥

అన్నిటను వ్యాపించియున్న యాకాశము సూక్ష్మమగుటవలన దేనిచేతను నంటఁబడదో, ఆలాగున సమస్తమైన శరీరములయందుండు వాఁడైనయాత్మ శరీరసంబంధ గుణదోషములచే నంటఁబడనివాఁడని యెఱుంగుము.— (౩౩)

యథాప్రకాశయత్యేకః కృత్స్నంలోకమిమంరవిః।
క్షేత్రంక్షేత్రీ తథాకృత్స్నం ప్రకాశయతి భారత! ॥3౪॥

ఓజీవుఁడా! ఒక్కఁడైన సూర్యుఁడు సమస్తలోకముల ప్రకాశింపఁజేయుచున్నాఁడో, ఆలాగుననే పరమాత్మ సమస్తమైన చరాచరప్రపంచమును ప్రకాశింపఁజేయుచున్నాడు.— (3౪)

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ మన్తరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతిమోక్షంచ యేవిదుర్యాన్తితే పరమ్॥ 3౫॥

స్వానుభవజ్ఞానమనెడి దృష్టిచేత శరీరశరీరులయొక్క యిట్టిభేదమును, నవివేకమునుండి నివర్తించును పాయమును నెవ్వారలు తెలిసికొనుచున్నారో వారు మనోవిశ్రాంతియగు మోక్షమును బొందుచున్నారు.— (3౫)

ఇట్లు
క్షేత్రక్షేత్రజ్ఞవిభాగనిదిధ్యాసయోగమను
**పదమూడవయధ్యాయము.**
ముగిసెను.
ఓమ్‌తత్సత్.

---

శ్రీరస్తు.

## పదునాల్గవయధ్యాయము.

---

గుణత్రయవిభాగనిదిధ్యాసయోగము.

### శ్రీభగవానువాచ.

పరంభూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్।
యజ్జ్ఞాత్వా మునయస్సర్వే పరాంసిద్ధి మితోగతాః ॥౧॥

పరమాత్మ జీవాత్మకు జెప్పుచున్నాఁడు.

ఈయధ్యాయమునందు పరమాత్మ:— ఆఅంశములను జీవాత్మకుపదేశించుచున్నాఁడు. అవియేవియనిన:— జీవునికిప్రకృతిసంబంధమగుసత్వాది గుణత్రయాభినివేశమే సంసారమునకుఁగారణమని వెనుకటియధ్యాయమునందుఁ జెప్పియుండుటంబట్టి -౧-గుణములననెవ్వి? ౨. ఏగుణమందెట్టి యభినివేశము? 3. అవిజీవుని నెట్లుబంధించును? ౪. గుణములనుండి విడువఁబడుటయెట్లు? ౫. విడువఁబడినవాఁడెట్టి యాచారముకలిగియుండును? ౬. దానిలక్షణమేమి? యన్నివిషయములఁగూర్చి వెనుకటియధ్యాయములయందు సంగ్రహముగాఁ

జెప్పఁబడిన యంశమైనను మఱలవిస్తరించి చెప్పఁబోవుచున్నాను. ఇందువలన జ్ఞానులు సంసారబంధమునుండి విడువంబడి సర్వోత్తమమగు మోక్షసిద్ధిని బొందిరి సుమీ.— (౧)

**ఇదంజ్ఞాన ముపాశ్రిత్య మమసాధర్మ్య మాగతాః।**
**సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే నవ్యథన్తిచ॥ ౨॥**

ఈ జ్ఞానోపాయమును ననుష్టించి నాస్వరూపమును బొందినవారు సృష్టియందుఁబుట్టరు ప్రళయకాలమునందు కష్టమునెందరు.— (౨)

**మమయోనిర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్।**
**సమ్భవస్సర్వభూతానాం తతోభవతి భారత!॥ ౩॥**

ఓజీవా? సమస్తదేశకాలములయందు వ్యాపించియుండు ప్రకృతియగు మాయ నాయొక్క గర్భస్థానముగానున్నది. ఆప్రకృతియందు జగదుత్పత్తి బీజమును నుంచుచున్నాను అందువలన బ్రహ్మమొదలగు సమస్తప్రాణులయొక్క పుట్టుక గలుగుచున్నది.— (౩)

**సర్వయోనిషు కౌన్తేయ! మూర్తయ స్సమ్భవన్తియాః।**
**తాసాంబ్రహ్మ మహద్యోని రహంబీజ ప్రదఃపితా॥ ౪॥**



ఓజీవా! సమస్తజాతులయందును యేదేహములుఁ గలుగుచున్నవో వానికి మూలప్రకృతియగు మాయతల్లి నేను తండ్రిని.— (౪)

**సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః।**
**నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహినమవ్యయమ్ ॥౫॥**

ఓజీవా! మాయ జేఁబుట్టిన సత్త్వరజస్తమోగుణములు దేహమునందుండు నాశరహితుఁడైన యాత్మను సుఖదుఃఖమోహాదులచే బంధించుచున్నట్లుండును.— (౫)

**తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశక మనామయమ్।**
**సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చాఽనఘ!॥ ౬॥**

ఓజీవా! ఆసత్త్వరజస్తమోగుణములలో పరిశుద్ధమగుటవలన ప్రకాశింపఁజేయునదియు నుపద్రవములులేనిదియునగు సత్త్వగుణము సుఖసంగము చేతను వృత్తిజ్ఞానసంగముచేతను బంధమునుకలిగియుండునట్లు తోఁచుచున్నది.— (౬)

**రజోరాగాత్మకం విద్ధి తృష్ణా సఙ్గసముద్భవమ్।**
**తన్నిబధ్నాతి కౌన్తేయ! కర్మసఙ్గేన దేహినమ్॥ ౭॥**

ఓజీవా! ఎఱుపుమొదలగువర్ణములు నిర్మలమగుపదార్థములకెట్లు తనవర్ణమును సంక్రమింపఁజేయునో, అట్లురజోగుణము దేహిని

(ఆత్మను) తనకులేని పదార్థములయందభిలాషను తనకుఁగలపదార్థములయందభిమానమునగు దృశ్యపదార్థముల సంపర్కమునుగలుగఁజేసి బంధించునదివలెఁదోఁచును.— (౭)

**తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్।**
**ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత!॥ ౮॥**

ఓజీవా! ఇఁకఁదమోగుణము అజ్ఞానమువలనఁగలుగునదియు సమస్తప్రాణులకు నవివేకమును గలుగఁజేయునదియు ననియెఱుంగుము. అది పరాకు సోమరితనము నిద్ర మొదలగువానిచే నాత్మను బంధించునట్లు తోఁచును.— (౮)

**సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత!।**
**జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత॥ ౯॥**

ఓజీవా! సత్వగుణము సుఖమునందు సంగమును, రజోగుణము కర్మమునందు సంగమును, తమోగుణము వివేకమును కప్పి పరాకు మొదలగు వానితో సంగమును కలుగఁజేయుచున్నది. ఏమియాశ్చర్యము?— (౯)

**రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత!।**
**రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా॥ ౧౦॥**



ఓజీవా! సత్వగుణము రజస్సును తమస్సును నణఁచి కలుగును. ఇట్టిస్థితి యనేక జన్మ పరిపక్వము వలన గలుగును. రజోగుణము సత్త్వతమసులనణఁచి ప్రవర్తించును, తమోగుణము సత్త్వరజస్సులనణఁచి ప్రవర్తించును.— (౧౦)

**సర్వద్వారేషు దేహేస్మిన్ ప్రకాశ ఉపజాయతే।**
**జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వమిత్యుత॥ ౧౧॥**

ఈశరీరమునందుండు సమస్తద్వారములయందును అఖండానందానుభవ సూచకమెప్పుడు కలుగునో అప్పుడు సత్త్వగుణము బాగుగ వృద్ధిఁబొందియున్నదని యెఱుంగుము.— (౧౧)

**లోభః ప్రవృత్తి రారమ్భః కర్మణామశమస్స్పృహా।**
**రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ!॥ ౧౨॥**

ఓజీవా! పరద్రవ్యమును స్వీకరించుటయందాశయు అట్టికార్యములయందుఁ బ్రవర్తియు, కామ్యములును నిషిద్ధములునగు కర్మములను జేయుటకుఁ బ్రారంభించుటయు, ఇంద్రియనిగ్రములేమియు, కనఁబడు ప్రతివస్తువు నందాశయు నెప్పుడు గలుగునో, అప్పుడు రజోగుణము బాగుగ వృద్ధిఁబొందియున్నదని యెఱుంగుము.— (౧౨)

అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవచ।
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన॥ ౧౩॥

ఓజీవా! తమోగుణ మభివృద్ధినిబొందినదగుచుండఁగా యవివేకమును కర్మజ్ఞానములయందు బొత్తుగాఁ బ్రవృత్తిలేక యుండుటయు అజాగ్రతయు విపరీత జ్ఞానమునుగలుగును. (౧౩)

యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయం యాతి దేహభృత్।
తదోత్తమ విదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే॥ ౧౪॥

సత్త్వగుణమధికమై యున్నదశలో శరీరవియోగము తటస్థించిన యెడల జీవుఁడు సత్యలోకము మొదలగు పుణ్యలోకములనుబొందును.— (౧౪)

రజసి ప్రళయం గత్వా కర్మ సఙ్గిషుజాయతే।
తథాప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే॥ ౧౫॥

రజోగుణ మధికమయియున్న దశలో శరీరవియోగము తటస్థించినయెడల జీవుఁడు మనుష్యలోకమును బొందును తమోగుణమధికమయియున్నదశలో శరీరవియోగము తటస్థించినయెడల పశువు మొదలగు జన్మమువచ్చును.— (౧౫)



కర్మణ స్సుకృత స్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్।
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్॥ ౧౬॥

మంచికర్మములఁజేసిన జీవునికి సుఖము ఫలమనియు, రజోగుణమువలనఁజేయు కామ్యకర్మలకు దుఃఖము ఫలమనియు, తమోగుణముచేఁజేయఁబడు నకృత్యకర్మముల కధోగతి ఫలమనియు పెద్దలుఁజెప్పుచున్నారు.— (౧౬)

సత్త్వాత్సఞ్జాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవచ॥ ౧౭॥

సత్త్వగుణమువలన జ్ఞానమును రజోగుణమువలన తనకెంత గొప్పస్థితియుండినను మఱిమఱికావలెనను నాసక్తియు తమోగుణమువలన విపరీతజ్ఞానమును గలుగుచున్నవి.— (౧౭)

ఊర్ధ్వంగచ్ఛన్తిసత్త్వస్థా మధ్యేతిష్ఠన్తి రాజసాః।
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛన్తి తామసాః॥ ౧౮॥

సాత్త్వికులకు దేవాదిజన్మములును రాజసులకు మనుష్యాదిజన్మములును తామసులకు పశువాదిజన్మములును వచ్చును.— (౧౮)

నాఽన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥ ౧౯॥

కార్యకారణవిషయరూపములను బొందునట్టి సత్త్వాదిగుణములకన్న వేఱుగ సుఖదుఃఖాదిమూలములగు కర్మములనాచరించుటకు అట్టికర్మఫలముల ననుభవించుటకు నొకకర్తగలఁడని తలంపక గుణములే సమస్తకారణ విషయరూపమునుబొంది సర్వకర్మములకును గర్తలగుచుఁ గర్మములనుజేయు చున్నవనియు, ఆత్మగుణవ్యాపార సాక్షీభూతుఁడును గుణసంపర్కములేనివాఁడుననియు నెఱుంగు వివేకి "వాసుదేవస్సర్వమితి" (అ౭శ్లో౧౯) లోఁజెప్పఁబడినరీతిగా బ్రహ్మైక్యానుసంధానసిద్ధినిబొంది జీవన్ముక్తుఁడగును.— (౧౯)

గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే॥ ౨౦॥

వెనుకటిశ్లోకమునందుఁ జెప్పఁబడిన విధముగా స్వానుభవముచే తెలిసికొనినజీవుఁడు, దేహమువలనఁబుట్టిన మూఁడైన యీసత్త్వాదిగుణములను దాఁటి పుట్టుకచావు ముదిమి మొదలగు దుఃఖములచేత విడువఁబడినవాఁడై యీశరీరముతో నుండినను జీవన్ముక్తుఁడై మోక్షమునుబొందుచున్నాఁడు.— (౨౦)



అర్జున ఉవాచ.

కైర్లిఙ్గైస్త్రీన్గుణానేతానతీతో భవతి ప్రభో!।
కిమాచారః కథంచైతాం స్త్రీన్గుణానతివర్తతే॥ ౨౧॥

అందుకుజీవుఁడిట్లనియె:—

ఓపరమాత్మ ఈమూఁడుగుణముల నతిక్రమించినవాఁడెట్టి లక్షణములఁగలిగియుండును? వానినడవడిక యెట్లుండును? ఏసాధనముచేత యీమూఁడుగుణముల నతిక్రమించుచున్నాఁడు?— (౨౧)

శ్రీభగవానువాచ.

ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవ చ పాణ్డవ!।
నద్వేష్టి సంప్రవృత్తాని ననివృత్తాని కాఙ్క్షతి॥ ౨౨॥
ఉదాసీనవదాసీనో గుణైర్యోన విచాల్యతే।
గుణావర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే॥ ౨౩॥
సమదుఃఖసుఖస్స్వస్థస్సమలోష్టాశ్మకాఞ్చనః।
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిన్దాత్మసంస్తుతిః॥ ౨౪॥

**మానావమానయోస్తుల్య స్తుల్యోమిత్రారి పక్షయోః।**
**సర్వారమ్భ పరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే॥ ౨౫॥**

పరమాత్మ ప్రత్యుత్తరముఁ జెప్పుచున్నాఁడు.

గుణాతీతునియొక్క లక్షణముఁ జెప్పెదవినుము ఓజీవా! యెవ్వఁడీ త్రిగుణములయొక్క కార్యములను ద్వేషింపఁడో లేక, యపేక్షింపఁడో సంగములేక సాక్షివలె యున్నవాఁడై గుణకార్యములగు సుఖదుఃఖాదులచేఁ జలింపఁజేయఁబడఁడో, గుణములే ప్రవర్తించుచున్నవని దెలిసికొని కదలఁడో, సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాఁడుగను స్వరూపనిష్ఠలోనే సంతుష్టికలవాఁడుగను మంటిబెడ్డ ఱాయి స్వర్ణము వీనియందు సమబుద్ధిగలవాఁడుగను యిష్టానిష్టములయందు సమత్వబుద్ధిగలవాఁడుగను ఆత్మానాత్మ వివేకము గలవాఁడుగను దూషణ భూషణలవలన మనోవికారము లేనివాఁడుగను మానావమానములయందు సమబుద్ధిగలవాఁడుగను దేహమునిలుచుటకు మాత్రము కావలసినది వినాగా తక్కిన కర్మములన్నిటిని విడిచినవాఁడుగను నున్నాఁడో వాఁడు గుణాతీతుఁడని జెప్పఁబడుచున్నాడు.— (౨౫)

**మాంచయోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।**
**సగుణాన్సమతీ త్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥**



ఎవ్వఁడు నన్నే చలింపని భక్తియోగముచే సేవించుచున్నాఁడో వాఁడీ త్రిగుణముల నతిక్రమించి జీవన్ముక్తి దశమనుబొందుటకొఱకు సమర్థుఁడగుచున్నాఁడు.— (౨౬)

**బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహ మమృతస్యా వ్యయస్యచ।**
**శాశ్వతస్యచ ధర్మస్య సుఖస్యై కాన్తి కస్యచ॥ ౨౭॥**

నేను నాశరహితుఁడును నిర్వికారియును ఆనందస్వరూపుఁడును నియతమైన స్వభావము గలవాఁడును నగు పరబ్రహ్మముయొక్క ఘనీభూత స్వరూపముగదా?— (౨౭)

ఇట్లు

గుణత్రయ విభావ నిధిధ్యాస యోగమను

పదునాల్గవ యధ్యాయము.

ముగిసెను.

ఓంతత్సత్.

---

మానాపమానయోస్తుల్య స్తుల్యోమిత్రారి పక్షయోః।
సర్వారమ్భ పరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే॥ ౨౫॥

పరమాత్మ ప్రత్యుత్తరముఁ జెప్పుచున్నాఁడు.

గుణాతీతునియొక్క లక్షణముఁ జెప్పెదవినుము ఓజీవా! యెవ్వఁడీత్రిగుణములయొక్క కార్యములను ద్వేషింపఁడో లేక, యపేక్షింపఁడో సంగములేక సాక్షీవలె యున్నవాఁడై గుణకార్యములగు సుఖదుఃఖాదులచేఁ జలింపఁజేయఁబడఁడో, గుణములే ప్రవర్తించుచున్నవని తెలిసికొని కదలఁడో, సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాఁడుగను స్వరూపనిష్ఠలోనే సంతుష్టికలవాఁడుగను మంటిబెడ్డ ఱాయి స్వర్ణము వీనియందు సమబుద్ధిగలవాఁడుగను యిష్టానిష్టములయందు సమత్వబుద్ధిగలవాఁడుగను ఆత్మానాత్మ వివేకము గలవాఁడుగను దూషణ భూషణలవలన మనోవికారము లేనివాఁడుగను మానావమానములయందు సమబుద్ధిగలవాఁడుగను దేహమునిలుచుటకు మాత్రము కావలసినది వినాగా తక్కిన కర్మములన్నిటిని విడిచినవాఁడుగను నున్నాఁడో వాఁడు గుణాతీతుఁడని జెప్పఁబడుచున్నాడు.— (౨౫)

మాంచయోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
సగుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥



ఎవ్వఁడు నన్నే భజించునో [illegible] వాఁడే త్రిగుణములను నతిక్రమించి జీవ[illegible] [illegible] బ్రహ్మ సమర్థుఁడగుచున్నాఁడు.— (౨౬)

బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహ మమృతస్యా వ్యయస్యచ।
శాశ్వతస్యచ ధర్మస్య సుఖస్యై కాన్తికస్యచ॥ ౨౭॥

నేను నాశరహితుఁడును నిర్వికారియును ఆనందస్వరూపుఁడును నియతమైన స్వభావము గలవాఁడును నగు పరబ్రహ్మమునియొక్క ఘనీభూతస్వరూపముగదా?— (౨౭)

ఇట్లు

గుణత్రయ విభావ నిధిధ్యాస యోగమను

పదునాల్గవ యధ్యాయము.

ముగిసెను.

ఓంతత్సత్.

—

శ్రీరస్తు.

# పదియేనవయ యధ్యాయము.

పురుషోత్తమ ప్రాప్తి నిదిధ్యాస యోగము.

శ్రీభగవానువాచ.

పరమాత్మ జీవాత్మ కాత్మోపదేశముఁ జేయుచున్న దెట్లనిన:—

**ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్।**
**ఛన్దాంసి యస్య పర్ణాని యస్తంవేద సవేదవిత్॥ ౧॥**

ఓకకోనేటియొడ్డునుండి వృక్షమును నీటిలోఁజూచిన వృక్షము యొక్క మూలము పైగాను కొమ్మలు క్రిందికిని గనబడును. అది వృక్షముయొక్క నిజస్థితికాదు నీటిలోఁగనఁబడు వృక్షమును దాని శాఖలును జూచుటకు మాత్రము చెట్టుగాఁ గనఁబడునుగాని దేనికిని ప్రయోజనకారికాదుఅట్లే పుత్రమిత్రకళత్రధనకనకవస్తు వాహనాదులను కొమ్మలతోఁ గూడుకొని యున్న యీసంసార వృక్షము అంతఃకరణమను గోనేటిలోఁ గనఁబడు వస్తువు. నిజమైనది కాదు. అందువలననే దీనికి అశ్వత్థము (అ, శ్వ, త్థ. అ=న, శ్వ=శ్వః=రేపు, త్థ=స్థ=స్థాతా=ఉండునది, అనఁగా శ్వఃనస్థాతా=ఉత్తరక్షణము వఱకుండు నది కాదు.) అని పేరు పెట్టఁబడినది. కోనేటిలో నీఱుండువఱకు నీటిలో గన్పబడు వృక్షము నశింపదుగనుక అశ్వత్థమును నాశరహితముగాఁ జెప్పఁబడినది. అట్లే యంతఃకరణమను కోనేటిలో యెంతవరకు విషయవృత్తి జ్ఞానమను నీరుండునో అంతవర కీసంసారము నశింపదు. ఈసంసార వృక్షమునకు ధర్మాధర్మములను దెలియఁజేయు వేదమే యాకులు. ఆకులు వృక్షమును యెండమొదలగు వానిచే బాధింపఁ బడక కాపాడునట్లు వేదము ధర్మాధర్మములచే యీసంసార వృక్షమును గాపాడును; గనుకనే "వేదవాక్యైరవేదః" వేదవాక్యములు పరబ్రహ్మ స్వరూపమును జెప్పఁజాలవని జెప్పఁబడెను. ఇట్లు సంసార వృక్షము నెవ్వఁడెఱుంగునో వాఁడు వేదార్థముల నెఱింగినవాఁడు.— (౧)

**అధశ్చోర్ధ్వంచ ప్రసృతా స్తస్యశాఖా గుణ ప్రవృద్ధా**
**విషయ ప్రవాళాః । అధశ్చమూలా న్యను సన్తతాని**
**కర్మాను బన్ధీని మనుష్య లోకే॥ ౨॥**

త్రిగుణములచే వృద్ధి బొందింపఁ బడినవియు శబ్దాది విషయములు చిగురులుగాఁ గలవియు నగు నీసంసార వృక్షము యొక్క కొమ్మలు క్రిందను మీదను వ్యాపించియున్నవి. భూలోకమందు కర్మసంబంధ

మును గలుగఁజేయు రాగద్వేషాది వాసనలనెడి వేరులు క్రిందను మీదను సంతటను బ్రవేశించియున్నవి.— (౩)

నరూపమస్యేహ తథోపలభ్యతే నాన్తోనచాదిర్న చ సం
ప్రతిష్ఠా । అశ్వత్థమేనం సువిరూఢమూల మసంగశస్త్రే
ణదృఢేన ఛిత్వా॥ 3॥
తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్గతా ననివర్తన్తి
భూయః । తమేవచాద్యం పురుషంప్రపద్యే యతః ప్రవృ
త్తిః ప్రసృతాపురాణీ॥ ౪॥

సంసారా సక్తిగల వారిచే నీసంసార వృక్షముయొక్క పైన వివరింపఁ బడిన విధముగల స్వరూపము తెలియఁబడకున్నది. ఉత్పత్తియు స్థితియు తుదయును గనఁబడకున్నది. దృఢమైన వేళ్లుగల నీసంసార వృక్షమును ధ్యానా భ్యాసమనెడి రాతిమీఁద నూఱఁబడిన పుత్ర మిత్ర కళత్రధన కనక వస్తు వాహనాదుల యందభిమానము నాసక్తిని విడుచుట యనెడు అసంగమను నాయుధముచేత సంసార వృక్షమునకు బీజమయిన నహంకార కామక్రోధాదులను దుంప నాశనముఁజేసి పిమ్మట యేస్థానమందు బ్రవేశించినవారు తిరిగియు మఱల సంసారనరకమునకురారో, ఎవ్వనివలన మాయావృక్షము



యొక్క ప్రవృత్తివ్యాపింపఁబడియున్నదో, ఆ మొదటివాఁడగు పరమ పురుషునినే నేకాగ్రచిత్తముచేత శరణజొచ్చుచున్నానని అట్టిస్వానుభవస్థితిని బొందుటకు సాధనము వెదకఁబడఁదగినది.— (౪)

నిర్మాన మోహా జిత సఙ్గదోషా అధ్యాత్మ నిత్యా వినివృ
త్త కామాః । ద్వన్ద్వై ర్విముక్తా సుఖదుఃఖ సంజ్ఞై ర్గచ్ఛ
న్త్య మూఢాః పదమవ్యయంతత్ ॥ ౫॥

అహంకారమును అవివేకమును లేనివారును పుత్ర మిత్రాది సంపర్కరహితులును బ్రహ్మజ్ఞాన నిష్ఠగలవారును వాసనతోఁగూడ నాశలను విడిచినవారును శీతోష్ణ సుఖదుఃఖ ద్వంద్వములచే విడువఁబడినవారునునగు బ్రహ్మజ్ఞానులు వెనుకఁజెప్పఁబడిన నాశరహితమయిన స్థానమును బొందుచున్నారు.— (౫)

న తద్భాసయతే సూర్యో నశశాఙ్కో నపావకః।
యద్గత్వా ననివర్తన్తే తద్ధామ పరమం మమ॥ ౬॥

ఏస్వానుభవమును బొందిమరలరో ఆబ్రహ్మస్వరూపమును సూర్యచంద్రాగ్నులు బ్రకాశింపఁజేయజాలరు అదియే నాయొక్క ఉత్తమమయిన స్థానము.— (౬)

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః।
మనష్షష్ఠానీన్ద్రియాణి ప్రకృతి స్థానికర్షతి॥ ౭॥

నాయొక్కయంశమైనవాఁడును ననాదియునైన జీవుఁడు మాయామూలకములగు త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణాంతః కరణముల నెడు యింద్రియములను సంసారమందు భోగార్థముగ నాకర్షించుచున్నాఁడు.— (౭)

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధా నివాశయాత్॥

దేహేంద్రియాది సంఘాతమునకు స్వామియగు జీవుఁడు యెప్పుడు శరీరమునుండి బయలుదేరి రెండవశరీరమును బొందుచున్నాఁడో అప్పుడు పుష్పము మొదలగు వానినుండి వాయువు వాసనగల సూక్ష్మాంశములను స్వీకరించి పోవునట్లు మనస్సుతోఁగూడిన యింద్రియములను స్వీకరించి పోవుచున్నాఁడు.— (౮)

శ్రోత్రం చక్షు స్స్పర్శనంచ రసనం ఘ్రాణమేవచ।
అధిష్ఠాయ మనశ్చాఽయం విషయానుపసేవతే॥ ౯॥

ఈజీవుఁడు చెవిని కంటిని త్వక్కును నాలుకను ముక్కును నాశ్రయించి శబ్దాదివిషయముల ననుభవించు చున్నాఁడు.— (౯)



ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితం।
విమూఢానాను పశ్యన్తి పశ్యన్తి జ్ఞాన చక్షుషః॥ ౧౦॥

శరీరమునందుండువాఁడును నొకశరీరమునుండి మఱియొకశరీరమునకు వెడలుచున్నవాఁడును విషయములననుభవించువాఁడును త్రిగుణములతోఁగూడినవాఁడునునగు నీ జీవుని, నజ్ఞానులు తెలిసికొనజాలరు, జ్ఞానదృష్టిగలవారు తెలిసికొనుచున్నారు.— (౧౦)

యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మ న్యవస్థితమ్।
యతన్తోఽప్య కృతాత్మానో నైనం పశ్యన్త్యచే తసః॥

ధ్యానాదులచే బ్రయత్నముఁజేయుచున్న ధ్యానయోగులు తనయందున్న యీయాత్మనుస్వానుభవముచే తెలిసికొందురు. శాస్త్రాభ్యాసముచే బ్రహ్మజ్ఞానమునకై బ్రయత్నముఁజేయుచున్నవారైనను చిత్తశుద్ధిలేని యవివేకులీయాత్మను దెలిసికొనలేరు.— (౧౧)

యదాదిత్య గతం తేజో జగద్భాస యతేఽఖిలమ్।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్॥

సూర్యచంద్రాగ్నులయందుండు చైతన్యస్వరూపమగు తేజస్సు నాయదియని దెలిసికొనుము.— (౧౨)

గామావిశ్యచ భూతాని ధారయామ్యహమోజసా।
పుష్ణామి చౌషధీస్సర్వాస్సోమో భూత్వా రసాత్మకః॥

నేను భూమిని ప్రవేశించి బలముచేత జగత్తును ధరించుచున్నాను. రసస్వరూపియగు చంద్రుఁడనై సమస్తమైన సస్యములను పోషించుచున్నాను. (౧౩)

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥

నేను జఠరాగ్నినై ప్రాణులయొక్క శరీరమును నాశ్రయించి ప్రాణాపానవాయువులతోఁ గూడుకొనినవాఁడనగుచు భక్ష్యము భోజ్యము లేహ్యము చోష్యమనఁబడు నాలుగువిధములగు అన్నమును పక్వము చేయుచున్నాను.— (౧౪)

సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞానమపోహనంచ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్॥ ౧౫॥

నేను సమస్తప్రాణులయొక్క హృదయమందంతర్యామిగానున్నాను. నావలన స్మృతియును జ్ఞానమును మఱపును కలుగుచున్నది.



సమస్తమైన వేదములచేతను దెలియఁబడఁదగినవాఁడును వేదాంతసంప్రదాయమును స్థాపించిన గురువునేనే:— (౧౫)

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ।
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥ ౧౬॥

లోకమునందు నశించునది యెల్లను క్షరుఁడనియు, సమస్తమునకుత్పత్తిమూలమగు మాయాశక్తి అక్షరుఁడనియు, నీయిద్దఱు పురుషులుకలరు; సమస్తయచేతనములును క్షరమనియు మాయాశక్తిని అక్షరుఁడనియు జెప్పఁబడుచున్నవి.— (౧౬)

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః।
యోలోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥

క్షరాక్షరులకంటె నన్యుఁడగు పరమపురుషుఁడే నాశరహితుఁడును ఎవ్వఁడు సమస్త బ్రహ్మాండమును బ్రవేశించిరక్షించుచున్నాఁడో వాఁడే పరమాత్మాయని చెప్పఁబడియున్నాఁడు. (౧౭)

యస్మాత్క్షరమతీతోఽహమక్షరాదపిచోత్తమః।
అతోఽస్మి [శ్రుత్య] లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః॥ ౧౮॥

నేనెందువలన నచేతనము నతిక్రమించినవాఁడుగను మాయకంటె నుత్కృష్టుఁడుగ నున్నానో యిందువలన ప్రపంచమునందును శృతులయందును పురుషోత్తముఁడని ప్రసిద్ధుఁడనయియున్నాను.—(౧౮)

**యోమామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్।**
**స సర్వవిద్భజతిమాం సర్వభావేన భారత!॥ ౧౯॥**

ఓజీవుఁడా! ఎవ్వఁడు మోహములేని వాఁడగుచు పైన జెప్పఁబడిన ప్రకారము నన్ను పురుషోత్తమునిఁగా తెలిసికొనుచున్నాఁడో వాఁడు సమస్తము నెఱింగినవాఁడు నన్ను అన్ని విధములచేతను భజించుచున్నాఁడు.— (౧౯)

**ఇతి గుహ్యతమం శాస్త్ర మిదముక్తం మయాఽనఘ!।**
**ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యాత్ కృతకృత్యశ్చ భారత!॥**

ఓజీవా! ఈవిధముగా నతిరహస్యమయిన యీగీతాశాస్త్రమునందలి యీయధ్యాయము నాచేత నీకుపదేశింపఁబడినది! ఓనిర్దోషుఁడా! ఈసంపూర్ణమయిన యధ్యాయమును తెలిసికొని స్వానుభవమునుగలవాఁడుగాను చేయవలసిన సమస్తమును జేసికొనినవాఁడుగాను నగుము.— (౨౦)

ఇట్లు
పురుషోత్తమ ప్రాప్తి నిదిధ్యాస యోగమను
పదియేనవ యధ్యాయము.
ముగిసెను.
ఓమ్‌తత్సత్.

---

శ్రీరస్తు

## పదునాఱవ యధ్యాయము.

### దైవాసుర సంపద్విభాగ నిదిధ్యాసయోగము.

శ్రీభగవానువాచ.

**అభయం సత్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్॥ ౧॥**
**అహింసా సత్యమక్రోధ స్త్యాగ శ్శాన్తి రపైశునమ్।**
**దయాభూతేష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలమ్॥**
**తేజః క్షమా ధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా।**
**భవన్తి సమ్పదం దైవీ మభిజాతస్య భారత!॥ 3॥**

పరమాత్మ చెప్పునదేమనఁగా:—

అ.౯. శ్లో.౧౨.౧౩. లో దైవియనియు ఆసురియనియు రాక్షసియనియు మూడుతెఱంగులుగల ప్రకృతులను ప్రాణులుఁగలిగియుండునని సూచింపఁబడినది. అందు దైవీప్రకృతి సంసారముక్తికి సాధన

ముగాన నది గ్రాహ్యమనియుఁ దక్కిన రెండును బంధహేతువులుగాన త్యజింపఁదగినవనియు చెప్పదొడంగి యీ యధ్యాయమునందు ప్రథమ మూడుశ్లోకములవలన దైవీప్రకృతి విషయమై చెప్పఁబడినది. యెట్లనిన:— భయములేకుండుటయు వ్యవహారములయందు పరులవిషమై మోసము అసత్యము మాయ మొదలగువానిని విడుచుటయు, ఆత్మజ్ఞానోపాయమును దెలిసికొని యాప్రకారము నిష్ఠలోనుండుటయు దానముచేయుటయు బాహ్యేంద్రియ నిగ్రహమును మానసీకయజ్ఞంబును వేదాధ్యయనమును తపస్సును ఋజుత్వంబును అహింసయును సత్యమును కోపము నణఁచుకొనుటయును అహంకార మమకారములను విడుచుటయును చిత్తసమాధానంబును పరులదోషములను ప్రకటనచేయమియును భూతదయాళుత్వంబును ఇంద్రియములు విషయములను సమీపించియుండినను వికారములేకుండుటయును, క్రౌర్యము లేకపోవుటయును సిగ్గును చపలములేక యుండుటయును ప్రాగల్భ్యమును క్షమయును ధైర్యంబును చిత్తశుద్ధియును పరులను బాధింపకుండుటయును గర్వములేకపోవుటయును యీయిరువదియాఱులక్షణంబులును ఓజీవా! దేవతలు పొందఁదగి వైభవమును పొందఁదగి పుట్టినవానికి కలుగుచున్నవి:— (౩)

దమ్భో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ।
అజ్ఞానం చాఽభిజాతస్య పార్థ! సంపదమాసురీమ్॥ ౪॥



కపటవేషంబును గర్వంబును దురహంకారంబును కోపంబును యితరులను జూచి కఠినముగా వచించుటయును దెలివితక్కువతనమును అనునిది ఆసురవైభవమును పొందఁదగి పుట్టినవానికి కలుగుచున్నవి. (౪)

దైవీ సమ్పద్విమోక్షాయ నిబన్ధా యాసురీమతా।
మాశుచ స్సమ్పదం దైవీ మభిజాతోఽసి పాణ్డవ!॥ ౫॥

దైవసంబంధమయిన గుణములు బంధనివృత్తికొఱకును అసురసంబంధమయిన గుణములు బంధమును గలుగఁజేయుటకును కారణములు. ఓజీవా! నీవు దేవతాసంబంధమైన గుణమును పొందుటకుఁదగియున్నావు కావున దుఃఖింపకుము.— (౫)

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ।
దైవో విస్తరశః ప్రోక్త అసురం పార్థ! మేశ్రృణు॥ ౬॥

ఈ సంసారమునందు ప్రాణుల్లు దేవతాసంబంధమైన గుణములు గలవియనియు అసురసంబంధమైన గుణములు గలవియనియు రెండు విధములుగానున్నవి. దేవతాసంబంధమయినది విస్తారముగా యిదివరకే చెప్పఁబడినది. ఓజీవా! అసురసంబధమయిన సృష్టిని నావలన వినుము.— (౬)

ప్రవృత్తించ నివృత్తించ జనా నవిదూరాసురాః।
నశౌచం నపిచాఽఽచారో నసత్యం తేషు విద్యతే॥ ౭॥

అసురస్వభావముగల జనులు పురుషార్థసాధనములగు నేకార్యముల ననుష్ఠింపవలెనో దానిని, యనర్థహేతువులగు నేకార్యములను విడిచిపెట్టవలెనో దానిని నెఱుంగరు వారియందు బాహ్యాంతరశుద్ధియు, ఆచారమును, నిజమును లేదు. (౭)

అసత్య మప్రతిష్ఠంతే జగదాహు రనీశ్వరమ్।
అపరస్పర సమ్భూతం కిమన్య త్కామహైతుకమ్॥ ౮॥

వారు జగత్తు వేదాదిప్రమాణము లేనిదనియు ధర్మాధర్మవ్యవస్థలు లేనిదనియు కర్తయగు నీశ్వరుఁడు లేనిదనియు స్త్రీపురుషుల యన్యోన్య సంయోగములచేఁ గలుగునది యనియు స్త్రీపురుషులయొక్క కామోద్రేకమే కారణముగాఁగలదనియు యితరమయిన కారణమేమి యున్నదనియుఁ జెప్పుదురు.— (౮)

ఏతాందృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః।
ప్రభవన్త్యుగ్ర కర్మాణః క్షయాయ జగతోఽహితాః॥

వారలుపైఁ జెప్పఁబడిన యీనాస్తికదృష్టిని యవలంభించి చెడిపోయిన స్వభావముగలవారును విషయములలోనే బుద్ధినిప్రవేశపెట్టు



వారును ప్రాణులకు హింసనుగలుగఁజేయఁదగిన కర్మములను జేయువారును జగత్తునకు శత్రువులై ప్రపంచముయొక్క నాశముకొఱకు పుట్టుచున్నారు.— (౯)

కామ మాశ్రిత్య దుష్పూరం దమ్భమాన మదాన్వితాః।
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ప్రవర్తన్తేఽశుచివ్రతాః॥

నింపశక్యముకాని యాశనవలనంబించి దంభ గర్వ మదములతోఁ గూడినవారును, మద్యము మాంసము మొదలగు నపరిశుద్ధములయిన వస్తువులను భుజించెడి వ్రతములు గలవారును, నవివేకముచేత దురాగ్రహము నవలంబించి చెడుపట్టుదలను బట్టి ప్రవర్తించుచున్నారు.— (౧౦)

చిన్తా మపరిమేయాంచ ప్రళయాన్తా ముపాశ్రితాః।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః॥ ౧౧॥

ఆశాపాశ శతైర్బద్ధాః కామక్రోధ పరాయణాః।
ఈహన్తే కామభోగార్థ మన్యాయేనార్థసఞ్చయాన్॥

అపరిమితమైనదియు మరణమువఱకు వెంబడించునదియునగు మనోరథపరంపరను బొందినవారును, శబ్దాది విషయానుభవము గొప్ప

దనిదలంచువారును, కామోపభోగమే పరమపురుషార్థము నింతకంటె నుత్తమసుఖములేదని నిశ్చయించుకొనినవారును, ఆశలనెడు ననేకములగు త్రాళ్లచేత కట్టఁబడినవారును, దురాశను కోపమును ముఖ్యాధారముగా నాశ్రయించినవారునగుచు కామభోగముకొరకయి యన్యాయమార్గముచేత ధనార్జననుగూర్చి యిచ్ఛించుచున్నారు.—()

ఇదమద్య మయాలబ్ధ మిమంప్రాప్స్యే మనోరథమ్।
ఇదమస్తీ దమపిమే భవిష్యతి పునర్ధనమ్॥ ౧౩॥

అసౌమయా హతశ్శత్రు ర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహ మహంభోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ॥
ఆఢ్యోఽభి జనవానస్మి కోఽన్యోఽస్తి సదృశోమయా।
యక్ష్యే దాస్యామి మోదిష్యఇత్య జ్ఞాన విమోహితాః॥
అనేక చిత్త విభ్రాన్తా మోహజాల సమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ॥ ౧౬॥

ఈకోరికయిప్పుడు నాచేత పొందఁబడినది ఈమనోరథమును బొందఁగలను గోవుభూమి హిరణ్యాదికమగు నీద్రవ్యము నాకుఁగలదు ఈధనముగూడ నాకు మఱియు కలుగఁగలదు జయింపరాని ఈశత్రువు నాచేతచంపఁబడెను మిగిలినశత్రువులనుగూడ చంపెదను నేనుసమస్త



భోగముల ననుభవించువాఁడను, నేనుదలంచినపనులను నెఱవేర్చుకొనుటకు శక్తుఁడను, బలవంతుఁడను, సుఖముకలవాఁడను, ధనవంతుఁడను, ఉత్కృష్టమైన కులములబుట్టినవాఁడను, నాతోసమానుఁడితరుఁడెవ్వండున్నాఁడు, యజ్ఞముచేసెదను, ద్రవ్యమిచ్చెదను, సంతోషింపగలను అని యీవిధముగా నవివేకమును మోహమునుగలవారును ననేక చిత్తభ్రాంతిని బొందినవారును అభిమానమనెడి వలచేత నావరింపఁబడినవారు నగుచు నపరిశుద్ధమైన నరకమునందు పడుచున్నారు.— (౧౬)

ఆత్మసమ్భావితా స్తబ్ధా ధనమాన మదాన్వితాః।
యజన్తే నామయజ్ఞైస్తే దమ్భేనా విధిపూర్వకమ్॥ ౧౭॥

అహంకారం బలం దర్పం కామంక్రోధం చ సంశ్రితాః।
మామాత్మ పరదేహేషు ప్రద్విషన్తోఽభ్య సూయకాః॥
తానహం ద్విషతఃక్రూరాన్ సంసారేషు నరాధమాన్।
క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు॥ ౧౯॥

తమ్మును దామే గౌరవించువారును, పెద్దలయెడల మర్యాదలేనివారును, ధనమువలన దురాభిమానమును మదమును గలవారును, అహంకారమును బలమును ధర్మాతిక్రమణబుద్ధివిశేషంబును స్త్రీయాశయును

క్రోధంబును నాశ్రయించినవారును, తమశరీరమందును ఇతరశరీరములయందునుండెడి నన్నుల్లంఘనము సేయువారును, సన్మార్గమునందుండెడి పెద్దల సుగుణములను సహింపఁజాలక దోషములను గల్పించువారును నగు నసురసంపదగలవారు దంభముతో తోఁచినట్లు ఖ్యాతికలుగుటకు కోరికలతో యాగములను జేయుచున్నారు. సాధువులయందు ద్వేషముగలవారును బాహ్యాన్తర శుచిత్వము లేనివారునగు నట్టిహీనప్రవృత్తిగల మనుష్యులను జననమరణ మార్గములయందు క్రూరవ్యాపారములు తఱచుగాఁగల నీచజన్మములయందెల్లప్పుడు నేనుంచెదను. ౧౯

ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మ ని జన్మని।
మామప్రాప్యైవ కౌన్తేయ! తతో యాన్త్యధమాంగతిమ్॥

వారలీశరీరమును విడిచినపిమ్మట ప్రతిజన్మయందు నతిశయజ్ఞానజనకములగు నీచకులములయందే జ్ఞానలవశూన్యులయి యీశ్వరుఁడనగు నన్నెన్నటికిని బొందఁజాలక ఒకదానికన్న మఱియొకటి మిగులనీచము గానుండు జన్మములనే పొందుదురు. (౨౦)

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః।
కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదే తత్త్రయం త్యజేత్॥



కామము క్రోధము లోభము ననుమూడువిధములగు నీయాసురసంపద, నరకమునకు ద్వారములు. ఇవితనకు నాశహేతువుగానున్నవి. ఆహేతువువలన నీమూటిని విడువవలెను.— (౨౧)

ఏతై ర్విముక్తః కౌన్తేయ! తమోద్వారై స్త్రిభిర్నరః।
ఆచర త్యాత్మనశ్శ్రేయ స్తతో యాతి పరాంగతిం॥ ౨౨॥

ఓజీవా! నరకమునకుఁగారణమైన నీమూటిచేతను. విడువఁబడిన పురుషుఁడు దనకు పురుషార్థమును జేసికొనుచున్నాఁడు. దానివలన మోక్షమును బొందుచున్నాఁడు.— (౨౨)

యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః।
నససిద్ధి మవాప్నోతి నసుఖం నపరాంగతిమ్॥ ౨౩॥

ఎవ్వఁడు శాస్త్రోక్తమైన విధినిషేధములను విడిచిపెట్టి తనయిష్టప్రకారము ప్రవర్తించుచున్నాఁడో, వాఁడు తత్త్వజ్ఞానమును బొందఁడు. అట్లుండ వానికి మోక్షమెక్కడిది?— (౨౩)

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాఽకార్య వ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్రవిధా నోక్తం కర్మకర్తు మిహాఽర్హసి॥

ఆ సూత్రములను చేయఁగూడినవానిని చేయరానివాని నేర్పరచుటయందు శాస్త్రము ప్రమాణము. శాస్త్రమునందుఁ జెప్పఁబడిన దానిని దెలిసికొని నీవీప్రస్తుతస్థితిలో యుద్ధరూపమగుఁ గర్మమును జేయుటకుఁ దగియున్నావు.— (౨౪)

ఇట్లు

దైవాసుర సంపద్విభాగ నిదిధ్యాస యోగమను

పదునాఱవ యధ్యాయము.

ముగిసెను.

ఓమ్‌తత్సత్.

---



శ్రీరస్తు.

## పదునేడవ యధ్యాయము.

---

### శ్రద్ధాత్రయవిభాగ నిదిధ్యాస యోగము.

అర్జున ఉవాచ.

యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః।
తేషాం నిష్ఠా తు కా కృష్ణ! సత్త్వమాహో రజస్తమః॥౧॥

జీవుఁడు ప్రశ్న చేయుచున్నాఁడు.

ఎవ్వరు శాస్త్రవిధిని విడిచిపెట్టి శ్రద్ధతో గూడినవారలయి పూజించుచున్నారో వారలయొక్క పూజా సాత్త్వికమా? రాజసమా? లేక తామసమా? (౧)

శ్రీభగవానువాచ.

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు॥ ౨॥

పరమాత్మ ప్రత్యుత్తరము చెప్పుచున్నాఁడు.

ప్రాణులయొక్క పూర్వజన్మవాసనచేఁగలిగిన యాశ్రద్ధ దేవపూజాదులఁగూర్చిన సాత్త్విక శ్రద్ధయనియు, యక్షరాక్షసులఁగూర్చిన పూజరాజసశ్రద్ధయనియు, ప్రేత పిశాచములఁగూర్చినపూజాతామస శ్రద్ధయనియు, మూఁడువిధములుగనున్నది. దానిని వివరించెద వినుము. (౨)

**సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత।**
**శ్రద్ధామయోఽయం పురుషో యోయచ్ఛ్రద్ధ స్సఏవసః॥**

సమస్తమయిన ప్రాణులకును వానివానియంతఃకరణమునకుఁదగిన శ్రద్ధ కలుగుచున్నది. ఈ జీవుఁడేదో యొక శ్రద్ధయేస్వరూపముగాఁ గలవాఁడు. ఎవ్వఁడెట్టి శ్రద్ధకలవాఁడో వాఁడట్టి శ్రద్ధకుఁదగినవాఁడే. (3)

**యజన్తే సాత్త్వికాదేవాన్ యక్ష రక్షాంసి రాజసాః।**
**ప్రేతాన్భూతగణాం శ్చాన్యే యజన్తే తామసా జనాః॥**

సత్త్వగుణముగలవారు దేవతలను, రజోగుణముగలవారు యక్షరాక్షసులను, తమోగుణముగలవారు ప్రేతపిశాచములను భూతగణములను పూజించుచున్నారు. (౪)



**అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపోజనాః।**
**దమ్భాహఙ్కార సంయుక్తాః కామరాగ బలాన్వితాః॥**
**కర్షయన్త శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః।**
**మాంచైవాన్త శ్శరీరస్థం తాన్విద్ధ్యాసుర నిశ్చయాన్॥ ౬॥**

శరీరమునన్నున్నట్టింద్రియ సమూహమును నుపవాసాదులచేఁ శుష్కింపఁజేయువారును, శరీరమునందంతర్యామిగానున్న నన్నును నాయాజ్ఞను నిరాకరించుచుండువారును, దంభాహంకారముతోఁ గూడినవారును నవివేకులునునగు నేప్రాణులు శాస్త్రముచేవిధింపఁబడనిదియు, తనకును నితరులకు బాధను గలుగఁజేయునదియునగు తపస్సును జేయుచున్నారో, వారిని యసురస్వభావముగలవారినిగా దెలిసికొనుము. (౫,౬)

**ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।**
**యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు॥ ౭॥**

సమస్తమయిన వానికిని ప్రియమయిన ఆహారముగూడ మూఁడువిధములుగలదిగా నున్నది. యజ్ఞంబును తపస్సును దానంబును మూఁడువిధములుగా నున్నవి. ఆభేదములను గూడవినుము. (౭)

ఆయు స్సత్త్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః।
రస్యాస్స్నిగ్ధా స్థిరాహృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః॥

ఆయుస్సును ఉత్సాహంబును బలమును నారోగ్యంబును సుఖంబును బ్రీతిని వృద్ధిబొందించుచున్నవియును రసముచమురు గ్గలిగినదియును దేహమునందు చాలాకాలమునుండునదియును, మనోహరంబులయినవియునగు భక్ష్యభోజ్యాద్యాహారములు సత్త్వగుణముగలవారల కిష్టములయినవి. (౮)

కట్వామ్ల లవణా త్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః।
ఆహారా రాజస స్యేష్టా దుఃఖ శోకామయ ప్రదాః॥ ౯॥

చేదుగను పుల్లగను ఉప్పగను మిక్కిలి వేడిగను కారముగను చమురులేనివిగను దాహమునుగలుగఁజేయునదిగానుండునవియు, శరీరమునకు కష్టమును మనోవ్యాకులత్వమును రోగమును గలుగఁజేయునవియునగు ఆహారములు రజోగుణముగల వానికిష్టములయినవి.

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్।
ఉచ్ఛిష్ట మపి చా మేధ్యం భోజనం తామసప్రియమ్॥౧౦॥



లెస్సగా నుడుకనిదియు సారములేనిదియు దుర్గంధముగలదియు వండినతరువాత నొక్కరాత్రి గడచినదియు నితరులు తినఁగా మిగిలినదియు భగవంతునికి నివేదితప్రసాదము కానిదియునగు ఆహారములు తమోగుణస్వభావముగలవారి కిష్టమయినవి. (౧౦)

అఫలాకాఙ్క్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే।
యష్టవ్యమేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః॥ ౧౧॥

యాగముచేయుట విధియేయని మనస్సును నిశ్చయముగా స్థిరపరచి శాస్త్రముచే నియమింపఁబడిన యేయజ్ఞము ఫలాపేక్షలేనివారిచేత నాచరింపఁబడుచున్నదో అది సాత్త్వికమయినది. (౧౧)

అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థ మపి చైవ యత్।
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్॥ ౧౨॥

ఓజీవా! ఫలమునపేక్షించియు దంభముకొఱకును యేయజ్ఞము చేయంబడుచున్నదో, ఆయజ్ఞమును రాజసమునుగాఁ దెలిసికొనుము.

విధిహీన మసృష్టాన్నం మన్త్రహీన మదక్షిణమ్।
శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥ ౧౩॥

అశాస్త్రీయమయినదియు యన్నదానములేనిదియు మన్త్రహీ-
నమయినదియు దక్షిణలనీయక చేయఁబడినదియు నమ్మకములేనిది
యునగు యజ్ఞమును తామసముగా చెప్పుచున్నారు. (౧౩)

**దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్।**
**బ్రహ్మచర్య మహింసాచ శారీరం తప ఉచ్యతే॥ ౧౪॥**

దేవతలను బ్రాహ్మణులను తత్త్వోపదేశగురువును జ్ఞానులందఱిని
పూజించుటయు శరీరపరిశుద్ధత్వము కలిగియుండుటయు మనఃపరిశు
ద్ధతయు పరస్త్రీ సంగమరాహిత్యంబును తనకుఁగాని పరులకుఁగాని
హింసను కలుగఁజేయకుండుటయు శరీరముచేఁ జేయఁబడఁదగిన
తపస్సని చెప్పఁబడుచున్నది. (౧౪)

**అనుద్వేగకరం వాక్యం సత్త్యం ప్రియహితం చ యత్।**
**స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥ ౧౫॥**

ప్రాణులకు దుఃఖముగలుగఁజేయనిదియు యథార్థమయినదియు
యిహపరలోకములయందలి ఫలముకొఱకయిన హితమగు వచనమును
వేదాధ్యయనము చేయుటయును అను నివివాక్కుచేత జేయఁదగిన
తపస్సని చెప్పఁబడుచున్నది. (౧౫)



**మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః।**
**భావసంశుద్ధి రిత్యేత త్తపోమానస ముచ్యతే॥ ౧౬॥**

మనస్సును మంచివృత్తిలో నిలుపుటయు మనస్సునాత్మ ధ్యా
నమునందుంచుటయు మనస్సును అన్యవిషయవ్యాపారములోనుండి
మరలించుటయు పరులతో వ్యవహరించునప్పుడు మోసముచేయక
యుండుటయు అనునది మనస్సుచేతఁజేయఁదగిన తపస్సని చెప్పఁ
బడుచున్నది. (౧౬)

**శ్రద్ధయా పరయా తప్తం తపస్త త్త్రివిధం నరైః।**
**అఫలా కాఙ్క్షిభిర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే॥ ౧౭॥**

ఫలాపేక్షలేనివారును నిశ్చలచిత్తులునగు పురుషులచేత శ్రేష్ఠమ
యిన నమ్మకముతో నాచరింపఁబడినదియు వెనుకఁజెప్పఁబడిన కా
యక వాచక మానసికమను మూఁడుతెఱంగులు గలదియునగు తప
స్సును సాత్త్వికమునుగాఁ జెప్పుచున్నారు. (౧౭)

**సత్కారమాన పూజార్థం తపో దమ్భేన చైవ యత్।**
**క్రియతే తదిహప్రోక్తం రాజసం చలమధ్రువమ్॥ ౧౮**

అశాస్త్రీయమయినదియు నన్నదానములేనిదియు మన్త్రహీనమయినదియు దక్షిణలనీయక చేయఁబడినదియు నమ్మకములేనిదియునగు యజ్ఞమును తామసముగా చెప్పుచున్నారు. (౧౩)

దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్।
బ్రహ్మచర్య మహింసాచ శారీరం తప ఉచ్యతే॥ ౧౪॥

దేవతలను బ్రాహ్మణులను తత్త్వోపదేశగురువును జ్ఞానులందఱిని పూజించుటయు శరీరపరిశుద్ధత్వము కలిగియుండుటయు మనఃపరిశుద్ధతయు పరస్త్రీసంగమరాహిత్యంబును తనకుఁగాని పరులకుఁగాని హింసను కలుగఁజేయకుండుటయు శరీరముచేఁ జేయఁబడఁదగిన తపస్సని చెప్పఁబడుచున్నది. (౧౪)

అనుద్వేగకరం వాక్యం సత్త్యం ప్రియహితం చ యత్।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥ ౧౫॥

ప్రాణులకు దుఃఖముగలుగఁజేయనిదియు యథార్థమయినదియు యిహపరలోకములయందలి ఫలముకోఱకయిన హితమగు వచనమును వేదాధ్యయనము చేయుటయును అను నివివాక్కుచేత జేయఁదగిన తపస్సని చెప్పఁబడుచున్నది. (౧౫)



మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః।
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే॥ ౧౬॥

మనస్సును మంచివృత్తిలో నిలుపుటయు మనస్సునాత్మ ధ్యానమునందుంచుటయు మనస్సును అన్యవిషయవ్యాపారములోనుండి మరలించుటయు పరులతో వ్యవహరించునప్పుడు మోసముచేయక యుండుటయు అనునది మనస్సుచేతఁజేయఁదగిన తపస్సని చెప్పఁబడుచున్నది. (౧౬)

శ్రద్ధయా పరయా తప్తం తపస్త త్త్రివిధం నరైః।
అఫలాకాఙ్క్షిభిర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే॥ ౧౭॥

ఫలాపేక్షలేనివారును నిశ్చలచిత్తులునగు పురుషులచేత శ్రేష్ఠమయిన నమ్మకముతో నాచరింపఁబడినదియు వెనుకఁజెప్పఁబ్బడిన కాయక వాచక మానసీకమను మూడుతెఱంగులు గలదియునగు తపస్సును సాత్త్వికమునుగాఁ జెప్పుచున్నారు. (౧౭)

సత్కారమాన పూజార్థం తపో దమ్భేన చైవ యత్।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్॥ ౧౮

పరులు తన్ను సాధువని చెప్పుటకొఱకును నమస్కారములు మొదలగునవి చేయుటకొఱకును అగ్రతాంబూలము పాదపూజ మొదలగువానిచే ద్రవ్యార్జనము చేయుటకొఱకును తన్ను మంచియోగియనియు భక్తివిశ్వాసములుగలవాఁడనియు నితరులనునట్లు నటించెడి దంభముచేతను నేతపస్సు జేయఁబడుచున్నదో నస్థిరఫలములను నవి గూడకలుగునో లేవోయని సందియమయినదియునగు తపస్సు రాజసతపస్సని చెప్పఁబడుచున్నది. (౧౮)

మూఢగ్రాహేణాత్మనోయ ద్పీడయా క్రియతే తపః।
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్ ॥౧౯॥

అవివేకకృతమయిన దురాగ్రహముచేగలుగు పట్టుదలచేతగాని, తన శరీరమును శుష్కోపవాసాదికముచేఁ గష్టపఱచుకొనుటచేతఁగాని నితరులయొక్క నాశముకొఱకుఁగాని యేతపస్సు చేయఁబచుడున్నదో అది తామసతపస్సని చెప్పఁబడుచున్నది. (౧౯)

దాతవ్య మితి యద్దానం దీయతే ఽనుపకారిణే।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్వికం స్మృతమ్॥౨౦॥



ఈశ్వరార్పణమను నిశ్చయముతో పుణ్యదేశములయందును, గ్రహణము మొదలగు పుణ్యకాలములయందును సత్పాత్రమునందును ప్రత్యుపకారముచేయ శక్తిలేని వానికొఱకే దానము నియ్యబడుచున్నదో ఆ దానము సాత్త్వికమని యెఱుంగుము. (౨౦)

యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్॥ ౨౧॥

ప్రత్యుపకారముకొఱకుగాని ఫలమును గోరికాని మనఃకేదముతోఁ గూడి యే దానమివ్వఁబడునో అది రాజసదానమని యెఱుంగుము. (౨౧)

అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే।
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్ ॥౨౨॥

అపరిశుద్ధమగు దేశమునందును అపుణ్యకాలములయందును సత్కారము లేనిదియు అమర్యాదతోఁ గూడినదియునగు దానము తామసదానమని చెప్పఁబడునది. (౨౨)

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్స్మృతః।
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥ ౨౩॥

పరబ్రహ్మమునకు-ఓమ్-అనియు, తత్-అనియు, సత్. అనియు మూడువిధములుగల నామోచ్చారణము నిశ్చయింపఁబడియున్నది. ఆనామోచ్చారణముచేత బ్రాహ్మణులును వేదములును యజ్ఞములును పూర్వము నిర్మింపఁబడినవి. (౨౩)

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః।
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్॥ ౨౪॥

ఆహేతువువలన శాస్త్రములయందుఁ జెప్పఁబడిన యజ్ఞదాన తపస్సులనెడి సత్కర్మములు యెల్లప్పుడును -ఓమ్- అని చెప్పిన పిమ్మట ప్రారంభింపఁబడినవి. (౨౪)

తదిత్యనభిసన్ధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్ష కాఙ్క్షిభిః॥ ౨౫॥

ముముక్షువులచేత- తత్. అనెడి బ్రహ్మాభిధానము నుచ్చరించి ఫలమును కోరక యనేకవిధములగు యజ్ఞములును తపస్సులనెడి కర్మములును దానకర్మములును జేయఁబడుచున్నవి. (౨౫)



సద్భావే సాధుభావేచ సదిత్యేతత్ ప్రయుజ్యతే।
ప్రశస్తేకర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే॥ ౨౬॥

ఓజీవా! కలదనెడి యర్థమందును మంచిదియనెడి యర్థమందును-సత్- అనెడి యీబ్రహ్మనామము ప్రయోగింపఁబడుచున్నది. ఆలాగుననే మంగళకరమయిన వివాహాది శుభకార్యమందును- సత్. అనెడి పదము ప్రయోగింపఁబడుచున్నది. (౨౬)

యజ్ఞే తపసి దానే చ స్థితి స్సదితి చోచ్యతే।
కర్మచైవ తదర్థీయం సదిత్యేవా ఽభిధీయతే॥ ౨౭॥

యజ్ఞము తపస్సుదానములయందును గలుగు తలంపు-సత్-అని జెప్పఁబడును. బ్రహ్మోద్దేశములయిన పూజాదులును వానికనుకూలమయిన కర్మములునుగూడ చెప్పఁబడుచున్నది. (౨౭)

అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్।
అసదిత్యుచ్యతే పార్థ! నచతత్ప్రేత్యనో ఇహ॥ ౨౮॥

అవిశ్వాసముతో చేయఁబడు హోమమును దానమును తపస్సును స్తుతినమస్కారాదులగు నితరకర్మమును యేదోఅది యస

త్తని చెప్పఁబడుచున్నది. చచ్చిన తరువాతను అశ్రద్ధతోఁ జేయఁబడిన కర్మములకు ఫలము లేదు. ఈ జన్మమునఁగూడ మంచిఫలము నిచ్చునది కానేరదు. (౨౮)

ఇట్లు.

శ్రద్ధాత్రయవిభాగ నిదిధ్యాస యోగమను

పదునేడవ యధ్యాయము.

ముగిసెను.

ఓమ్-తత్సత్

———





## పదునెనిమిదవ యధ్యాయము.



### మోక్షసన్న్యాసనిదిధ్యాసయోగము.

### అర్జున ఉవాచ.

జీవుఁడుప్రశ్న చేయుచున్నాఁడు.

**సంన్యాసస్య మహాబాహో! తత్త్వమిచ్ఛామి వేదితుమ్।**
**త్యాగస్య చ హృషీకేశ! పృథక్కేశినిషూదన!॥ ౧॥**

ఓపరమాత్మ! సన్న్యాసముయొక్కయు త్యాగముయొక్కయు యథార్థమును దెలియఁగోరుచున్నాఁడను. అనుగ్రహించి చెప్పుము.

### శ్రీభగవానువాచ.

**కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః।**
**సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః॥ ౨॥**

పరమాత్మ ప్రత్యుత్తరము చెప్పుచున్నాఁడు.

ఫలములను గోరి చేయఁబడు కర్మములయొక్క విడుచుటను స

సన్న్యాసమని పండితులు తెలుసుకొనుచున్నారు. సమస్తకర్మములయొక్క ఫలములను విడిచిపెట్టుటను త్యాగమునుగా విద్వాంసులు చెప్పుదురు. (౨)

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః।
యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యమితి చాఽపరే॥ 3॥

కొందఱు దోషముగల కర్మము విడిచిపెట్టఁదగినదియు, మఱికొందఱు యజ్ఞదానతపః కర్మములను విడువఁదగనిదియనియు చెప్పుదురు. (3)

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ!।
త్యాగో హి పురుషవ్యాఘ్ర! త్రివిధ స్సంప్రకీర్తితః॥ ౪॥

ఓజీవుఁడా! పైఁజెప్పఁబడిన త్యాగసన్న్యాసరూప పక్షద్వయవిషమున నావలన నిజమును వినుము. త్యాగము మూఁడువిధములుకలదిగాఁ జెప్పఁబడియున్నది. (౪)

యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥ ౫॥

యజ్ఞదానతపస్సులనెడి కర్మములు విడువఁదగినది కాదు. అవి



చేయఁదగినవే. ఈ కర్మలు వివేకములకు [illegible] [illegible]ఁజేయునవి. (౫)

ఏ తాన్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలానిచ।
కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మత ముత్తమమ్॥ ౬॥

ఓజీవా! పైఁజెప్పఁబడిన కర్మములు చేయవలసినవే అయితేనూ, అభిమానమును ఫలములయందాశయును విడిచి చేయఁదగినవని నాయొక్క నిశ్చయింపఁబడినదియు శ్రేష్ఠమయినదియునగు అభిప్రాయము. (౬)

నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే।
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః॥ ౭॥

జ్ఞానము కలుగక మునుపే మోక్షమును గోరువారికి యావశ్యకముగా విధింపఁబడి యుండెడి కర్మములయొక్క విడిచిపెట్టుట కూడదు. అవివేకము వలననైనను, ఆకర్మములయొక్క విడిచిపెట్టుట తామసగుణము కలవాని ప్రవర్తనయని చెప్పఁబడుచున్నది. (౭)

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్।
సకృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥౮॥

ఎవ్వఁడు దుఃఖమునుగలుగఁ జేయునదియని శరీరప్రయాస భీతిచేత యేకర్మమును విడుచునో, వాఁడు రజోగుణసంబంధమయిన త్యాగమునుజేసి జ్ఞానపూర్వకమగు త్యాగముయొక్క ఫలమగు మోక్షమును పొందనే పొందఁడు. (౮)

కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున!
సఙ్గంత్యక్త్వా ఫలంచైవ సత్యాగ స్సాత్త్వికో మతః॥ ౯॥

ఓజీవా! నియమింపఁబడిన యేకర్మము చేయఁబడవలసినదేయని తెలిసికొని యభిమానమును ఫలమును విడిచి చేయఁబడుచున్నదో అట్టిత్యాగము సత్త్వగుణసంబంధమయినదని నాయభిప్రాయము ()

నద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్న సంశయః॥ ౧౦॥

సత్త్వగుణప్రధానుఁడును ఆత్మజ్ఞానమునందు స్థిరబుద్ధిగలవాఁడును, సంశయమును బోఁగొట్టుకొనినవాఁడును సంగమును ఫలమును వదలినవాఁడును కామ్యకర్మమును ద్వేషింపఁడు; నిష్కామకర్మము నభిమానింపఁడు. (౧౦)

నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః॥
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే॥ ౧౧॥



కర్మములనే సంపూర్తిగా విడుచుటకు దేహాభిమానియైన అజ్ఞానికి యసాధ్యమయినదికదా. ఎవ్వఁడైతే కర్మఫలమునైన విడుచుచున్నాఁడో వాఁడు త్యాగియని చెప్పఁబడుచున్నాఁడు. (౧౧)

అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణఃఫలమ్।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్॥

దుఃఖకరమగు నీచజన్మము మొదలగునదియు సుఖకరమగు దేవతాజన్మము మొదలగునదియు సుఖదుఃఖకరమగు మనుష్యజన్మమునగు మూఁడువిధములయిన కర్మములయొక్కఫలము అజ్ఞానులకు మరణానంతరము కలుగుచున్నది. దేహాభిమానములను వదలిన పరమార్థసన్న్యాసులకో నొకానొకప్పుడైనను గలుగదు. (౧౨)

పఞ్చైతాని మహాబాహో! కారణాని నిబోధమే।
సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వ కర్మణామ్॥౧౩॥

సమస్త కర్మములయొక్క సిద్ధి, కర్మములను నశింపఁజేసెడి వేదాంతశాస్త్రమునందు చెప్పఁబడియుండును. కర్మమును చేయుటకు ముందుఁజెప్పఁబోవు నయిదును కారణములని నాచే తెలిసికొనుము. ()

అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధమ్।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్॥౧౪॥

అవియేవియనిన:— ఇచ్ఛా ద్వేష సుఖ దుఃఖ జ్ఞానాదులు ప్రకాశించుట కాశ్రయమయిన శరీరమును, అహంకారముతోఁ గూడుకొనియున్న ఉపాధిస్వరూపమయిన భోక్తయును, కర్మేంద్రియములయిదు జ్ఞానేంద్రియములయిదు మనస్సు బుద్ధి యనెడి పంద్రెండింద్రియములును, ప్రాణాపాన వ్యానోదాన సమానములనెడి పంచప్రాణములు మొదలగునవియును, అయిదవదియైన మాయను స్వాధీనమందుగల యీశ్వరుఁడును కారణములు. (౧౪)

**శరీర వాఙ్మనోభిర్యత్ కర్మ ప్రారభతే నరః।**
**న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః॥**

మనుష్యుఁడు మనోవాక్కాయములచేత శాస్త్రోక్తము గాఁగాని అశాస్త్రీయము గాఁగాని యేకర్మమును ప్రారంభించుచున్నాఁడో, ఆకర్మమునకు వెనుకఁ జెప్పఁబడిన అయిదును కారణములుగా నున్నవి. (౧౫)

**తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః।**
**పశ్య త్యకృత బుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః॥ ౧౬॥**

పైనఁజెప్పఁబడిన యయిదును కారణముగా నుండఁగా, నిరుపాధికుఁడుగాను సంగరహితుఁడుగాను నుండునాత్మను కర్తనుగా



నెవ్వఁడు తలంచుచున్నాఁడో ఆదుర్బుద్ధిగలవాఁడు సంస్కరింపఁబడని బుద్ధిగలవాఁడగుటచేత కర్మస్వరూపమునుగాని ఆత్మస్వరూపమును గాని నెఱుంగఁడు. (౧౬)

**యస్య నాఽహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే।**
**హత్వాపి స ఇమాంల్లోకా న్న హన్తి న నిబధ్యతే॥ ౧౭॥**

ఎవ్వనికి నేను గర్తననెడి తలంపులేదో, ఎవ్వనియొక్క యంతఃకరణము విషయములనంటదో వాఁడీలోకమునందుండు ప్రాణులను జంపియు జంపినవాఁడు కాఁడు. కర్మముచే బంధింపఁబడఁడు (౧౭)

**జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మ చోదనా।**
**కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మ సఙ్గ్రహః॥ ౧౮॥**

కర్మమును నడిపించుటకు హేతువైనది, తెలివియనియు తెలియఁబడఁదగిన వస్తువనియు ఉపాధిస్వరూపుఁడగు భోక్తయనియు, మూఁడువిధములుగలది. కర్మమున కాధారము యింద్రియములును క్రియకాధారమయిన వస్తువును జేయువాఁడగు జీవుఁడును అని మూఁడు విధములుగలదిగా నున్నది. (౧౮)

**జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః।**
**ప్రోచ్యతే గుణసఙ్ఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి॥ ౧౯॥**

గుణములయొక్క స్వరూపమును జెప్పు సాంఖ్యశాస్త్రమునందు జ్ఞానంబును కర్మంబును కర్తయును సత్త్వాదిగుణములయొక్క భేదమునుబట్టి మూడువిధములుగానే చెప్పఁబడుచున్నది. ఆ జ్ఞానాదులను గూడ యథాశాస్త్రిగా వినుము. (౧౯)

**సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే।**
**అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥ ౨౦॥**

వేఱువేఱుగానుండు సమస్తవస్తువులయందును యెడతెగక నిండియున్నట్టివస్తువు ఒక్కటియే యనియు, వికారరహితమయినదియనియు, యేజ్ఞానముచేత తెలిసికొనుచున్నాఁడో, ఆజ్ఞానము సత్త్వగుణమువలనఁ బుట్టినదని తెలియుము. (౨౦)

**పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్।**
**వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్॥ ౨౧॥**

సమస్తభూతములయందును వేఱువేఱుగానుండుటచేత జీవులను భిన్నరూపములుగా నుండువారనియు ప్రత్యేకమయిన లక్షణముగల వారనియు యేజ్ఞానము తెలిసికొనుచున్నదో, ఆజ్ఞానము రజోగుణము వలనఁ బుట్టినదని తెలియుము. (౨౧)



**యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్త మహైతుకమ్।**
**అతత్త్వార్థవ దల్పంచ తత్తామస ముదాహృతమ్॥ ౨౨॥**

దేహమునందుఁగాని ప్రతిమ మొదలగువానియందుఁగాని పరిపూర్ణమయిన వస్తువును చూచినప్పటివలెనే దేహమెంతో అంతేజీవుఁడనియు, ప్రతిమాదులు యెంతో అంతే యీశ్వరుఁడనియు తలంపుతోఁ గూడినదియును యెందుకీలాగున నుండవలెననుచో నందుకుఁదగిన హేతువులేకుండనున్నయదియు, వాస్తవముకాని విషయమును గలదియు, అల్పఫలమునిచ్చునదియునగు నేజ్ఞానముకలదో, అది తమోగుణమువలనఁ బుట్టినదియినియు యిట్టిదియే కేవలావివేకులకు గలుగు జ్ఞానమనియు నెఱుంగుము. (౨౨)

**నియతం సఙ్గరహిత మరాగద్వేషతఃకృతమ్।**
**అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే॥ ౨౩॥**

నిత్యమును జేయవలసిన యేకర్మము ఫలాపేక్షలేనివానిచేత తాను గర్తయనియభిమానములేకయును పుత్రాదులయందు ప్రీతియును శత్రువులయందు ద్వేషము లేకయును చేయఁబడినదో, ఆ కర్మము సత్త్వగుణమువలనఁ బుట్టినదని చెప్పఁబడుచున్నది. (౨౩)

యత్తు కామేప్సునా కర్మ సాహఙ్కారేణ వా పునః।
క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్॥ ౨౪॥

ఫలాపేక్షగలవానిచేతఁగాని నేనుకర్తయని అహంకారముగలవానిచేతఁగాని, అధికప్రయాసకరమగు యేకర్మము చేయఁబడుచున్నదో, ఆకర్మము రజోగుణమువలనఁ బుట్టినదని చెప్పఁబడుచున్నది. (౨౪)

అనుబన్ధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషమ్।
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే॥ ౨౫॥

తరువాతఁ గలుగఁబోవు శుభాశుభఫలమును దేహశక్తియొక్కయు ధనముయొక్కయు నాశమును ఇతరులకుఁ గలుగు కష్టమును, తన సామర్థ్యమును నాలోచింపక యవివేకముచేత యేకర్మ ప్రారంభింపఁబడుచున్నదో, అది తామసగుణమువలనఁ బుట్టినదియని చెప్పంబడుచున్నది. (౨౫)

ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే॥ ౨౬॥

విడువఁబడిన ఫలాపేక్షగలవాఁడును తానుగర్తయను నభిమానము లేనివాఁడును, ధైర్యమును పట్టుదలను గలవాఁడును, ఆరం



భించిన కార్యము నెఱవేఱినను నెఱవేఱకపోయినను మనోవికారము లేనివాఁడును నగు కర్మములనాచరించువాఁడు సత్త్వగుణప్రవర్తనగలవాఁడని చెప్పఁబడుచున్నాఁడు. (౨౬)

రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః॥ ౨౭॥

అభిమానముగలవాఁడును, కర్మఫలమునందాశగలవాఁడును, లుబ్ధుఁడును, పరులను హింసించువాఁడును, అనాచారుఁడును, కార్యసిద్ధియైనప్పుడు సంతోషమును, చెడినప్పుడు వ్యసనముగలవాఁడు నగు కర్మములనాచరించువాఁడు రజోగుణప్రవర్తనగలవాఁడని చెప్పఁబడును. (౨౭)

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే॥ ౨౮॥

మనోనిగ్రహము లేనివాఁడును, పెద్దలు చెప్పుమాటలను విననివాఁడును, జడప్రాయుఁడును, మాయను జేయువాఁడును, ఇతరులను దగాజేసి యవమానముచేయువాఁడును, సోమరియును, యేదోయొక వ్యసనముగలవాఁడును, పనులయందు దీర్ఘాలస్యముగలవాఁడునునగు కర్మమును జేయువాఁడు తామసగుణప్రవర్తనగలవాఁడని చెప్పఁబడును. (౨౮)

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు।
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనఞ్జయ॥ ౨౯॥

ఓజీవా! గుణములనుబట్టి మూఁడువిధములుగాను సంపూర్ణముగాను వేఱువేఱుగాను చెప్పఁబడఁగల వివేకపూర్వకమయిన నిశ్చయజ్ఞానముయొక్కయు, ధైర్యముయొక్కయు, భేదమునువినుము. (౨౯)

ప్రవృత్తించ నివృత్తించ కార్యాఽకార్యే భయాఽభయే।
బన్ధ మోక్షం చ యావేత్తి బుద్ధిస్సాపార్థ! సాత్త్వికీ॥ ౩౦॥

ఓజీవా! ధర్మమందు ప్రవృత్తిని, యధర్మమునుండి నివృత్తిని, కార్యాకార్యములను, భయాభయములను, బంధమును, మోక్షమునునే తెలివి తెలిసికొనుచున్నాదో, ఆ తెలివి సత్త్వగుణప్రధానమయినది.

యయా ధర్మ మధర్మంచ కార్యం చాఽకార్యమేవచ।
అయథావత్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ! రాజసీ॥ ౩౧॥

ఓజీవా! ఏ తెలివిచేత శాస్త్రోక్తమయినకర్మమును, శాస్త్రవిరుద్ధమును, చేయఁదగిన దానిని, చేయఁదగనిదానిని, ఉన్నది యుకర్మన్నట్లుగాక తెలిసికొనుచున్నాఁడో, ఆ తెలివి రజోగుణ ప్రధానమయినది. (౩౧)

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽవృతా।
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సాపార్థ తామసీ॥ ౩౨॥

ఓజీవా! ఏ తెలివి యవివేకముచేత కప్పఁబడినదై యధర్మమును ధర్మమనియు, సమస్తవస్తువులను విరుద్ధములుగాను తలంచుచున్నదో, ఆ తెలివి తమోగుణ ప్రధానమయినది. (౩౨)

ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియక్రియాః।
యోగేనాఽవ్యభిచారిణ్యా ధృతిస్సాపార్థ! సాత్త్వికీ॥ ౩౩॥

ఓజీవా! చిత్తైకాగ్రతచేత విషయములలోఁ బ్రవర్తింపని యేధైర్యముతోఁ గూడినవాఁడై మనస్సు ప్రాణము యింద్రియములు వీనియొక్క చేష్టలను విషయములలోనుండి త్రిప్పి ఆత్మధ్యానమందు నిలువఁబెట్టుచున్నాఁడో, ఆ ధైర్యము సత్త్వగుణ ప్రధానమయినది. (౩౩)

యయా తు ధర్మ కామార్థాన్ ధృత్యా ధారయతేర్జున!।
ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ ధృతి స్సాపార్థ! రాజసీ॥ ౩౪॥

ఓజీవా! ఏధైర్యముచేత ధర్మార్థకామముల ననుష్ఠించుచున్నాఁడో, అభిమానముచేత ఫలముననపేక్షించువాఁడగుచున్నాఁడో, ఆ

ధైర్యము రజోగుణప్రధానమయినది. (౩౪)

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ।
నవిముఞ్చతి దుర్మేధా ధృతిస్సాపార్థ! తామసీ॥ ౩౫॥

ఓజీవా! దుర్బుద్ధిగలవాఁడు నిద్రను భీతిని దుఃఖమ్మును ధిగులును మదించి యుండుటను నేధైర్యముచేత విడువకున్నాఁడో ఆ ధైర్యము తామసగుణప్రధానమయినది. (౩౫)

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ!।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి॥ ౩౬॥
యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్॥ ౩౭॥

మూఁడువిధములయిన సుఖమును నావలన వినుము. ఏ సుఖానుభవమందు గురూపదేశప్రకారముగా ననుష్ఠించెడి యభ్యాసమువలన నానందము నొందుచున్నాఁడో, జననమరణరాహిత్యదశకు పాత్రతను బొందుచున్నాఁడో, ఏసుఖము జ్ఞానవైరాగ్య ధ్యానసమాధులన భ్యసించుటకు ప్రారంభించునప్పుడు కుదరక విసుగెత్తి దుఃఖము నిచ్చును గనుక విషయమువలెనుండునో, పట్టుదలతో విడువక



నభ్యసించి అవి సిద్ధించినప్పుడు అమృతతుల్యమయినదిగా నగుచున్నదో, అట్టిస్వానుభవమువలన సమస్తపాపములును విముక్తము లగుటచేత మనోవిశ్రాంతిని గలిగించెడియాసుఖము సత్త్వగుణ ప్రధానముచేఁగలిగినదని చెప్పఁబడును. (౩౬-౩౭)

విషయేన్ద్రియ సంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥ ౩౮॥

అవివేకులచే ననుభవింపఁబడెడి యాప్రసిద్ధమయిన యేవిషయ సుఖము యింద్రియములు గలిసికొనుటవలన మొదట పరమసుఖము వలెనుండి యంతమందు (స్వస్త్రీ)విషయమునందు బలమును రూపమును జ్ఞాపకశక్తిని ధనమును ఉత్సాహంబును బోఁగొట్టును; పరస్త్రీ) విషయమునందు ముందుఁజెప్పినవియేగాక పాపఫలములయిన నరకములకును, ఇహమందనేక యసాధ్య రోగములకును హేతువగును కావున) విషమువంటి దగుచున్నదో, ఆ సుఖము రజోగుణ ప్రధానముచే గలిగినదని తలంపఁబడుచున్నది. (౩౮)

యదగ్రేచాఽనుబన్ధేచ సుఖం మోహన మాత్మనః।
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్॥ ౩౯॥

ఏసుఖము ప్రారంభమందును అంతమందును తనకు మోహమును

గలుగఁజేయునదియు నిద్రవలనను బద్ధకమువలనను వ్యర్థాలోచనవల నను పుట్టునదియు నగు ఆ సుఖము తమోగుణప్రధానమువలనఁ గలిగినదని చెప్పఁబడును. (౩౯)

న తదస్తి పృథివ్యాంవా దివి దేవేషువా పునః।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః॥ ౪౦॥

మాయవలనఁబుట్టిన యీ సత్త్వాదిమూడుగుణములచేత విడువఁ బడిన స్థావరజంగమాది రూపమయిన వస్తువేదిగలదో అదిమనుష్య లోకముననైనను స్వర్గాదిలోకములనైనను దేవతాలోకమునసైనను మరియెక్కడనైనను లేదు. (౪౦)

బ్రాహ్మణ క్షత్త్రియ విశాం శూద్రాణాంచ పరంతప।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః॥ ౪౧॥

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రజీవులకు ప్రకృతివలనఁబుట్టిన సత్త్వాదిగుణములచేత కర్మములు వేఱువేఱుగాఁ విభజించి చెప్పఁ బడినది. (౪౧)

శమో దమ స్తపశ్శౌచం క్షాన్తి రార్జవమేవ చ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మంకర్మస్వభావజమ్॥ ౪౨॥



అంతరింద్రియ నిగ్రహమును బాహ్యేంద్రియ నిగ్రహమును తప స్సును శుచిత్వంబును క్షమయును నిష్కాపట్యమును శాస్త్రజ్ఞాన మ్మును అనుభవజన్య స్వానుభవమును వేదములయందు నమ్మకమును అనాది స్వభావజన్యమయిన బ్రాహ్మణజీవునికి విహితములగు కర్మము లుగాను న్నవి. అనఁగా, ఈస్వభావముగల జీవుఁడే బ్రాహ్మణుఁడు. పూర్వకాలమునందు బ్రాహ్మణులముకిట్టి స్వభావముగలదు. తరువాత నది కారణాంతరము వలనఁ జెడిపోయినప్పటికి యావంశపరం పరనుబట్టి బ్రాహ్మణ్యము కలిగియున్నదిగాని నట్టియనుష్ఠానముమాత్ర మరుదు. (౪౨)

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనమ్।
దాన మీశ్వరభావశ్చ క్షాత్త్రం కర్మస్వభావజమ్॥ ౪౩॥

శూరత్వంబును కీర్తియును ధీరత్వంబును సామర్థ్యంబును యుద్ధ మునందు పాఱిపోకయుండుటయును దానంబును సమస్తజీవులను న్యాయముగా ధర్మపద్ధతి తప్పక నేలుటయును అనునీగుణములు గలవాఁడే క్షత్రియజీవుఁడు. (౪౩)

కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మస్వభావజమ్।
పరిచర్యాత్మకంకర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥ ౪౪॥

దున్నుటయు, పశువులను సంరక్షణచేటయు వర్తకముచేయుటయు ననునీ గుణములుకలజీవుఁడు వైశ్యుఁడు. శుశ్రూషరూపమగు కర్మముగల జీవుఁడు శూద్రుఁడు. అనఁగా మొదటమొదట గురువును జెంది శుశ్రూషచేయుటయే జీవునికి శూద్రత్వంబు. శుశ్రూషానంతరము జీవుఁడు మనస్సను భూమిని లెస్సగాఁదున్ని కామక్రోధాదిపశువులను అపమార్గములయందు ప్రవర్తింపకుండఁగాచి సంరక్షించుటయే జీవునికి వైశ్యదశ యనంబడును. పిమ్మట రాగద్వేషాదిదుర్గుణములతో యుద్ధముచేసిజయించి సద్గుణములనేలుటయే జీవునికి క్షత్రియదశ యనఁబడును. తుదకు మోక్షసిద్ధిని బొందుటయే జీవునికి బ్రాహ్మణదశ యని యెఱుంగుము. ఇట్లు ప్రతిజీవుఁడును యీ నాల్గుదశలను బొందకగాని జీవన్ముక్తుఁడు కానేరడు. (౪౪)

స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః।
స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు॥ ౪౫॥

తన తన వర్ణాశ్రమ విహితకర్మమునందు శ్రద్ధగలజీవుఁడు జ్ఞానయోగ్యతను బొందుచున్నాఁడు. తనకర్మమున నాసక్తి గలవాఁడే విధముగా జ్ఞానయోగ్యతను బొందుచున్నాఁడో, ఆ మార్గమును వినుము. (౪౫)



యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః॥ ౪౬॥

ఏయంతర్యామియగు నీశ్వరునివలన ప్రాణులకు ప్రవృత్తికలుగుచున్నదో, యెవనివలన యీ సమస్తమైన ప్రపంచమును వ్యాపింపఁబడియున్నదో, వానిని మనుష్యుఁడు శమదమాది యుక్తమయిన వేదోక్తకర్మములచేత ఆరాధించి జ్ఞానయోగ్యతను పొందుచున్నాఁడు. (౪౬)

శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ ౪౭॥

తనయొక్క వర్ణాశ్రమధర్మములు తనయొక్క యవివేకమువలన శాస్త్రోక్తముకానట్లు విరుద్ధములుగాఁ దోచినను, అనుష్ఠింపవలసినది. తన ధర్మము ఇతర వర్ణాశ్రమ ధర్మములకన్న శ్రేష్ఠమయినది. ఆయా సహజమయిన కర్మమును భగవదర్పణముగఁ జేయునెడల పాపమును బొందఁడు. (౪౭)

సహజం కర్మ కౌన్తేయ! సదోషమపి న త్యజేత్।
సర్వారమ్భాహి దోషేణ ధూమేనాఽగ్నిరివావృతాః॥

దున్నుటయు, పశువులను సంరక్షణచేటయు వర్తకముచేయుటయు ననునీ గుణములుకలజీవుఁడు వైశ్యుఁడు. శుశ్రూషరూపమగు కర్మముగల జీవుఁడు శూద్రుఁడు. అనఁగా మొదట మొదట గురువును జెంది శుశ్రూష చేయుటయే జీవునకి శూద్రత్వంబు. శుశ్రూషానంతరము జీవుఁడు మనస్సను భూమిని లెస్సగాఁదున్ని కామక్రోధాదిపశువులను అపమార్గములయందు ప్రవర్తింపకుండగాచి సంరక్షించుటయే జీవునికి వైశ్యదశ యనంబడును. పిమ్మట రాగద్వేషాదిదుర్గుణములతో యుద్ధముచేసిజయించి సద్గుణముల నేలుటయే జీవునికి క్షత్రియదశ యనఁబడును. తుదకు మోక్షసిద్ధిని బొందుటయే జీవునికి బ్రాహ్మణదశ యని యెఱుంగుము. ఇట్లు ప్రతిజీవుఁడును యీ నాల్గుదశలను బొందకగాని జీవన్ముక్తుఁడు కానేరడు. (౪౪)

స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః।
స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు॥ ౪౫॥

తన తన వర్ణాశ్రమ విహితకర్మమునందు శ్రద్ధగలజీవుఁడు జ్ఞానయోగ్యతను బొందుచున్నాఁడు. తనకర్మమున నాసక్తి గలవాఁ డే విధముగా జ్ఞానయోగ్యతను బొందుచున్నాఁడో, ఆ మార్గమును వినుము. (౪౫)



యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః॥ ౪౬॥

ఏయంతర్యామియగు నీశ్వరునివలన ప్రాణులకు ప్రవృత్తికలుగుచున్నదో, ఎవనివలన యీ సమస్తమైన ప్రపంచమును వ్యాపింపఁబడియున్నదో, వానిని మనుష్యుఁడు శమదమాది యుక్తమయిన వేదోక్తకర్మములచేత ఆరాధించి జ్ఞానయోగ్యతను బొందుచున్నాఁడు. (౪౬)

శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ ౪౭॥

తనయొక్క వర్ణాశ్రమధర్మములు తనయొక్కయవివేకమువలన శాస్త్రోక్తముకానట్లు విరుద్ధములుగాఁ దోచినను, అనుష్ఠింపవలసినది. తన ధర్మము ఇతర వర్ణాశ్రమ ధర్మములకన్న శ్రేష్ఠమయినది. ఆయా సహజమయిన కర్మమును భగవదర్పణముగఁ జేయునెడల పాపమును బొందఁడు. (౪౭)

సహజం కర్మ కౌన్తేయ! సదోషమపి న త్యజేత్।
సర్వారమ్భాహి దోషేణ ధూమేనాఽగ్నిరివావృతాః॥

ఓజీవా! తనతోఁగూడఁబుట్టిన స్వభావజన్యమయిన కర్మము దోషముతోఁగూడినదయినను విడువఁగూడదు. ధ్యానాభ్యాసము లేని మనుష్యుఁడు కర్మమును విడిచియుండుటకు సమర్థుఁడు కానేరఁడు త్రిగుణములతోఁగూడిన దోషసహితమగు సమస్తకర్మమును, పొగచే తకప్పఁబడిన నిప్పువలె దోషయుక్తములయినవే. (౪౮)

అసక్త బుద్ధిస్సర్వత్ర జితాత్మా విగత స్పృహః।
నైష్కర్మ్య సిద్ధిం పరమాం సన్న్యాసేనాఽధిచ్ఛతి॥౪౯॥

అన్నిటియందును తనదనెడి యభిమానము లేనివాఁడును, అంతఃకరణ నిగ్రహముగలవాఁడును, ఆశలేనివాఁడునగు ఆత్మజ్ఞాని శ్రేష్ఠమయిన కర్తృత్వ భోక్తృత్వ రహితసిద్ధిని సమస్తకర్మలను విడుచుట చేత పొందుచున్నాఁడు. (౪౯)

సిద్ధిం ప్రాప్తోయథా బ్రహ్మ తథాఽప్నోతి నిబోధమే।
సమాసేనైవ కౌన్తేయ! నిష్ఠాజ్ఞానస్యయా పరా॥ ౫౦॥

ఓజీవా! బ్రహ్మజ్ఞానముయొక్క పరిసమాప్తియేదో, అట్టిజ్ఞానసిద్ధిని పొందినవాఁ డెట్టి జ్ఞాననిష్ఠచేత బ్రహ్మమును బొందునో, అట్టివిధమును నావలన సంక్షేపముగా వినుము. అనఁగా, తన శరీరమును దెలిసికొనుటకు ప్రమాణాంతరమెట్లక్కఱలేదో అట్లే, తన్ను (ఆత్మను) దెలిసికొనుటకు ప్రమాణమక్కఱలేదు. కాబట్టి యాత్మజ్ఞానమునుగూర్చి ప్రయత్నమక్కఱలేదు. ఆత్మకానిదాని (తాను కాని యింద్రియములను దాననుటయును) ఆత్మయనుకొనుటను, (అహంకారమును) తనది (ఆత్మది) కానిదాని (పుత్రమిత్రకళత్ర ధన కనకవస్తువాహనాదులను) తనదనుకొనుటను (మమకారమును) మానుటయందే ప్రయత్నముఁ జేయవలసినది. (౫౦)



బుద్ధ్యా విశుద్ధయాయుక్తో ధృత్యాత్మానం నియమ్యచ।
శబ్దాదీ న్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్యచ॥
వివిక్తసేవీ లఘ్వాశీ యత వాక్కాయ మానసః।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥౫౨॥
అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్।
విముచ్యనిర్మమ శ్శాన్తో బ్రహ్మభూయాయకల్పతే॥ ౫౩॥

నిర్మలమయిన మనస్సుగలవాఁడును, పట్టుదలతోఁగూడిన సద్వివేకముచే అంతకరణమును స్వాధీనపఱచుకొనువాఁడును, శబ్దాదివిషయములను ఆశను ద్వేషమును విడిచిపెట్టినవాఁడును, ఏకాంతస్థలంబుల నివసించువాఁడును, మితాహారముగలవాఁడును, వాక్కును శరీరమును మనస్సును స్వాధీనముచేసికొనినవాఁడును, ఐహిక మంత్రజ

పానుష్ఠానాదులచే వ్యర్థముగాఁగాలహరణము చేయక యెల్లప్పుడును సమాధ్యభ్యాసము చేయువాఁడును, ఇహపరభోగములయందాశ లేనివాఁడును, నేననునహంకారమును కామక్రోధాదులతోఁగూడిన సామర్థ్యము దుర్మార్గప్రవర్తన విషయాసక్తి ద్వేషము అభిమానము వీనిని విడిచినవాఁడును, మమత లేనివాఁడును, పరమోపశాంతిని పొందినవాఁడునగువాఁడు సాయుజ్యమును బొందుటకు సమర్థుఁడగుచున్నాఁడు.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాఙ్క్షతి।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥ ౫౪॥

జీవన్ముక్తుఁడును, ఉపశాంతమయిన మనస్సు గలవాఁడును నొకదానిఁగూర్చి దుఃఖింపఁడు; లేనిదానిని గోరఁడు. సమస్తప్రాణులయందు సమబుద్ధిగలవాఁడై భూతదయాళువై సమస్తము బ్రహ్మమనెడి భావమగు భక్తిని బొందును. (౫౪)

భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్॥౫౫॥

ఎవ్వఁడు, పైనఁజెప్పఁబడిన భక్తిచేత మాయ మొదలగు నుపాధులతోఁగూడినట్లుండువాఁడును, ఉపాధిశూన్యుఁడును, అఖండమయినవాఁడును, సర్వవ్యాపియును, నేనేయని యథార్థముగాఁదెలిసికొను



చున్నాఁడో, అట్టిజీవుఁడను పేరుగలతానే అవిద్యానివృత్తియయియీయఖండబ్రహ్మమగుటచేత క్రొత్తగాఁబొందిన దేమియు లేక జ్ఞానమునకు సంపూర్ణఫలమగు నఖిద్యాసవృత్తిని బొందినాఁడని యెఱుంగుము. ఇట్టివాఁడే పరమానందస్వరూపియగును. (౫౫)

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః।
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్॥౫౬॥

సమస్తకర్మములను నిష్కామముగా నెల్లప్పుడు నేయువాఁడు నాయందు నియమింపఁబడిన మనస్సుగలవాఁడై నాయనుగ్రహము వలన నిత్యమయినదియు జననమరణ వికారములేనిదియునగు మోక్షమును, నిష్కామకర్మముచే చిత్తశుద్ధిని తద్ద్వారా జ్ఞానమును పిమ్మట మోక్షమును పొందునని యెఱుంగుము. (౫౬)

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః।
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ॥ ౫౭॥

కాఁబట్టి ఓజీవా! ఇహపరసుఖసాధనములయిన సమస్త కర్మఫలములను వివేకముగలబుద్ధిచేత నాయందు సమర్పించి, నాలో నైక్యము నొందుటయే యుత్తమమయిన స్థానమని సిద్ధాంతముగలవాఁడై

చిత్తైకాగ్రతను జెంది యెల్లప్పుడు నాయందు ధ్యాసముగలవాఁడవై యుండుము. (౫౭)

మచ్చిత్త స్సర్వ దుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి।
అథ చేత్త్వమహంకారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి॥ ౫౮॥

అట్లుండినయెడల నీవు నాయనుగ్రహముచేత సమస్తదుఃఖములను దాఁటఁగలవు. అట్లుకాక నీవు నేనే సకలము తెలిసినవాఁడు నాకంటె తెలిసినవాఁ డెవ్వఁడ నెడి. అహంకారముచేత నేను చెప్పినమాటలను విన వేని తప్పక చెడిపోదువు. (౫౮)

యద్యహఙ్కార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే।
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి॥ ౫౯॥

ఒకవేళ నేనే తెలిసినవాఁడు, ఈకృష్ణుఁడు పరియాలోచన లేక ప్రాణిహింసారూపమయిన యుద్ధమందు ప్రేరణచేయుచున్నాఁడు, అందువలనకలుగు పాపములను ఆలోచించలేదను నహంకారమును జెంది యుద్ధము చేయనని తలంతువేని, నీయొక్క యీ నిశ్చయము నిలువఁజాలదు, వ్యర్థమగును. ఏలన, రజోగుణముగఁ బరిణమించియుండు మాయ నిన్ను అవివేకముచే కప్పి తప్పుదారిని కలుగఁజేయకమానదు. అందువలన నీవు చెడుదువు. (౫౯)



స్వభావజేన కౌన్తేయ! నిబద్ధః స్వేన కర్మణా।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్య స్యవశోఽపి తత్॥ ౬౦॥

ఓజీవా! నీ ఈ మోహము పూర్వజన్మకర్మవిశేషమువలన గలిగినదియు నీయొక్క స్వధర్మమయినదియునగు నీ యధ్యాయము 43-వ-శ్లోకమునందుఁ జెప్పఁబడిన శౌర్యము మొదలగు కర్మములచేత కట్టఁబడినవాఁడవై నీవు బంధువులు మొదలగువారలనెడి మోహమగు నవివేకముచేత నేయుద్ధమును చేయుటకిచ్ఛింపవో ఆయుద్ధమునుగూడ పూర్వజన్మకర్మమునుబట్టి పరాధీనుఁడవై, స్వధర్మమును చేయవలసిన దారిని దప్పి అశాస్త్రీయమగు కర్తృత్వ భోక్తృత్వాదులతో ముందు జేయఁబోవుచున్నావు. (౬౦)

ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి।
భ్రామయ న్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥

ఓజీవా! కాఁబట్టి అనేకవిధపనులను జేయుటకు శక్తినికలుఁజేయు యన్‌జిన్‌అను యంత్రమువలె, కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములు పంచప్రాణములు అంతఃకరణము మొదలగు సమస్తమునకును సమస్తభూతములకును శక్తిని కలుగఁజేయు జగన్నియామకుఁడగు పరమేశ్వరుఁడు సమస్తభూతములయొక్క హృదయమందుండి

సమస్తప్రవృత్తి నివృత్తులకుమూలమయిన జ్ఞానోత్పత్తికి స్థానమయి యున్నాఁడు. (౬౧)

**తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।।**
**తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥**

అట్టి పరమేశుని యన్నివిధములచేతను రక్షకునిఁగాఁ బొందుము. ఆ యీశ్వరప్రసాదమువలన (స్వానుభవమువలన) సమస్తవిషయములనుండి నివృత్తిపొందిన చిత్తమగు మనోవిశ్రాంతిరూపమయిన సమస్తదుఃఖనివృత్తియనఁబడు సర్వకర్మనివృత్తి యను శాశ్వతమయిన మోక్షమును నవిద్యానివృత్తిని పొందఁగలవు. (౬౨)

**ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।**
**విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు॥ ౬౩॥**

ఈవిధంబున రహస్యముకన్న నతిరహస్యమయిన కర్మజ్ఞానభక్తివైరాగ్యాది సాధనమయిన యీగీతాశాస్త్రము నాచేత నీకుఁజెప్పఁబడినది. కాఁబట్టి ఓ జీవా! ఈ గీతాశాస్త్రమును జక్కఁగా పరిశీలించి నీవే సాధనము నవలంబించుటకుఁ దగుదువో దానిని నీవే యాలోచించుకొని యేవిధమైనయనుష్ఠానము కలిగియుండుట మంచిదని తలంచుచున్నావో ఆప్రకారము చేయుము. (౬౩)



**సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః।**
**ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్॥ ౬౪॥**

ఇట్లు పరమాత్మయగు శ్రీకృష్ణమూర్తి జీవుఁడగు నర్జునునికిఁ జెప్పి నీయిష్టప్రకారము చేయుమని చెప్పినను, వానియిష్టప్రకారము వదలలేని పరమాత్మఁ డిట్లనియె:—

ఓజీవా! నీయిష్టానుసారముగా నీవు నడుచునెడల చూచి చూడనట్లూరకొనలేని అత్యంత ప్రియుఁడవై నీవున్నావను కారణమువలనను, నీకనుకూలమైనది నీకు తెలియదుగనుక నట్టి యనుకూలమైనదానిని మఱలనీకొఱకుఁ జెప్పెదను. సమస్తరహస్యములకంటె నతిరహస్యమయినదియు సర్వోత్తమమయినదియనగు నాయొక్క సిద్ధాంతవాక్యమును వినుము. (౬౪)

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।**
**మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే॥ ౬౫॥**

నీకుఁజెప్పఁబోవు హితవాక్యములు నీశ్లోకముతోను వచ్చే66-వ-శ్లోకముతోను సరి. పిదప నీయిష్టము.

నీవు అశాస్త్రీయమైన పనులుచేయకుము. చేయదగినశాస్త్రీయమయిన వానిని చేయునప్పుడు నీవు కర్తృత్వభోక్తృత్వములుంచుకొనక

నాయందుమనస్సుగలవాఁడుగను, నాయందుభక్తిగలవాఁడుగను, అంతర్యామిగనుండు నన్నారాధించువాఁడుగను, మనోవాక్కాయకర్మములనన్నిటిని నాకుసమర్పించినదను సూచకముగు నమస్కారముగలవాఁడుగను కమ్ము. అట్లైనచో నాలో నైక్యముపొందఁగలవు. నాకత్యంత యిష్టుఁడవగుదువు. అనఁగా, నీవే నేను, నేనే నీవుగాఁ గలవు. కాఁబట్టి నీకొఱకు, ఇదిసత్యము, సత్యము, సత్యము, అని ముమ్మాటికి ప్రతిజ్ఞచేయుచున్నాఁడను. (౬౫)

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥

కర్మములచేతనే ధర్మాధర్మములు కలుగును గనుక, సమస్తకర్మముల సంబంధమునువిడిచి, అ. 2, శ్లో 58-68లోను, అ-5, శ్లో 9-లోను ఇదివరకే నీకు జెప్పియుండు ప్రకారము, నీవుకర్తయు భోక్తయు కానివాఁడని దెలిసికొని అ-5-శ్లో-10-చెప్పఁబడినట్లు యావత్తు నాకు సమర్పించి, సమస్తభూతముల లోను వెలుపలను నిండియుండు సమస్తములోను సమముగానుండు అంతర్యామిస్వరూపమనియు తనకన్న వేఱుగా మఱియొకటిలేదనియు, కనఁబడునదంతయు నామరూపము లేయనియు, అట్టినామరూపములకు ప్రత్యేకమైనఉనికి తనకన్న వేఱులేదనియు, ఎట్లు బంగారముతో చేయఁబడిన ఆభరణములు



వేఱువేఱురూపములను పేళ్లగలిగియుండినను, అవి బంగారముతన్న వేఱెట్లు కానేరదో, అట్లే తనస్వరూపమనియు తెలిసికొని చంపువాఁడు, చంపఁబడునది, అనునీ మొదలగు భ్రాంతినిఁ బోఁగొట్టుకొనిన నిశ్చయముగల నిన్ను, బంధమయిన సమస్తపాపరూపమగు కర్మముల నుండి విడిపించి స్వానుభవమును గలుగఁజేసెదను. సంశయింపకుము, అందువలన దుఃఖింపకుము, (౬౬)

ఇదం తే నాఽతపస్కాయ నాభక్తాయ కదాచన।
నచాఽశుశ్రూషవే వాచ్యం నచమాం యోఽభ్యసూయతి॥

ఓజీవా! ఈగీతాశాస్త్రమ్ము, జనన మరణరూపమగు సంసారము నుండి తప్పించుకొనవలెనను వ్యాకులత్వము లేనివానికిని, అది యుండినను గురువునందును నీశ్వరునియందును భక్తిలేనివానికిని ఈ రెండుగుణములుండినను కర్మేంద్రియము జ్ఞానేంద్రియము మొదలగువానిని స్వవిషయములయందు ప్రవృత్తింపజేయుటయను శుశ్రూష లేనివానికిని, ఈ గీతాశాస్త్రమందవివేకివలె నాత్మస్తుతి చేసికొనినవాఁడేకద్దా యీ కృష్ణమూర్తియనినన్నును తదుపదేశగురువులను దూషించువానికిని, చెప్పఁదగినది కాదు. (౬౭)

య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః॥

ఎవ్వఁడతిరహస్యమయిన యీ గీతాశాస్త్రమును నిజమయిన నా భక్తునికి చెప్పఁగలఁడో, అట్టివాఁడు నాయందు శ్రేష్ఠమయిన భక్తినిచేసి సమస్తసందేహములును లేనివాఁడై తప్పక నాలో నైక్యమునే పొందఁగలఁడు. (౬౮)

**న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః।**
**భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి॥ ౬౯॥**

మనుష్యులలో నెవ్వారలు నిజమయిన స్వానుభవము నొంది, నా నిజభక్తులవిషయమయి యీ గీతార్థము నుపదేశించు వానికంటె నాకు మిక్కిలి యిష్టమును జేయువాఁడొక్కఁడును లేనే లేదు. నాకతనికంటె అతిప్రియుఁడు భూమియందు కలుగఁబోఁడు. (౬౯)

**అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః।**
**జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టస్స్యామితి మే మతిః॥ ౭౦॥**

ధర్మమార్గమునుండి తొలఁగని మన యిద్దరియొక్క ఈ సంభాషణ రూపమయిన గ్రన్థము నెవ్వఁడు అర్థముతో గురుముఖముగా పఠించి యథాప్రకార మనుష్ఠింపకలఁడో, వానిచేత అనుభవజ్ఞానమనెడి యుత్తమమయిన చిత్తైకాగ్రతయనెడు జ్ఞానయజ్ఞమువలన నే నారాధింపఁబడినవాఁడనగుదు నని నాయొక్క నిశ్చయము.



**శ్రద్ధావాననసూయశ్చ శృణుయా దపి యో నరః।**
**సోఽపి ముక్తశ్శుభాన్లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్॥**

ఎవఁడు ఆస్తిక్యబుద్ధిగలవాఁడుగను, అసూయలేనివాఁడుగను నుండి యర్థజ్ఞానములేకున్నను, ఈ గీతాశాస్త్రమును శ్రద్ధతో వినునో, అట్టివాఁడు సమస్తపాపములచే విడువఁబడినవాఁడై, అగ్నిహోత్రము మొదలగు పుణ్యకర్మములను చేసినవారలకుఁ గలుగు పుణ్యలోకములను పొందును. (౭౧)

**కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా।**
**కచ్చిదజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే ధనఞ్జయ!?॥ ౭౨॥**

ఓ జీవా! నాచే నిదివఱకుపదేశింపఁబడిన యీ గీతాశాస్త్రము, నీచేత నిశ్చలమయిన మనస్సుతో వినఁబడినదిగదా? నీయొక్క యవివేకముచేఁ గలిగిన మోహము పోయినదిగదా? (౭౨)

అర్జున ఉవాచ.

**నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత।**
**స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ॥ ౭౩॥**

జీవుఁడు ప్రత్యుత్తరము చెప్పుచున్నాఁడు.

ఓ పరమాత్మా! నీ యనుగ్రహమువలన నాచేత ఆత్మస్వరూపానుసంధానము పొందఁబడినది. నావాండ్రు వారి నేలాగు జంపుదు నను భ్రాంతిరూపమయిన సంసారమనెడి యనర్థకమునకుఁ గారణమయిన అజ్ఞానము పోయినది. అ. 1, శ్లో 28. మొదలు, 45 వఱకును నావలనఁ జెప్పఁబడినదియు, నాకుఁ గలిగియుండునదియునగు సమస్తభ్రాంతియును పోయినది. నిస్సందేహుఁడనై యున్నవాఁడను. నీ యొక్క యాజ్ఞను నెఱవేర్చెదను. (౭౩)

సంజయ ఉవాచ.

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః।
సంవాద మిమమశ్రౌష మద్భుతం రోమహర్షణమ్॥ ౭౪॥

అవివేకముతో వివేక మిట్లనియె:—

నేనీ విధముగా మహాత్ముఁడగు శ్రీకృష్ణమూర్తియొక్కయు, ఇట్టి యుపదేశమువలన నిర్మలమయిన జ్ఞానమును బొందినవాఁడగుటచే మహానుభావుఁడగు జీవునియొక్కయును, అత్యాశ్చర్యకరమయినదియు, తలంచునప్పుడెల్ల పులకరింతను గలుగఁజేయునదియునగు, నీ గురుశిష్య సంభాషణను వింటిని. (౭౪)



వ్యాస ప్రసాదా చ్ఛ్రుతవా
నేతద్గుహ్య మహం పరమ్।
యోగం యోగేశ్వరా త్కృష్ణాత్
సాక్షాత్కథయత స్స్వయమ్॥ ౭౫॥

శుద్ధాంతఃకరణముయొక్క యనుగ్రహమువలన, రహస్యమయినదియు శ్రేష్ఠమయినదియు నగు జ్ఞానయోగమును దెలియఁజేయు నీ గీతాశాస్త్రమును, స్వయముగా జీవునికిఁ జెప్పినవాఁడును, సమస్తయోగులకు నీశ్వరుఁడు నగు పరమాత్మవలన నేను స్వయముగా విన్నవాఁడ నైతిని. (౭౫)

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతమ్।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః॥

ఓ యవివేకమా! ఆశ్చర్యకరమయినదియు, పరలోకసాధనమయినదియు నగు జీవాత్మ పరమాత్మలయొక్క యీ గురుశిష్య సంభాషణంబును దలఁచి దలఁచి మాటిమాటికిని యానందించుచున్నాను. ౦

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః।
విస్మయో మే మహాన్ రాజన్! హృష్యామి చ పునః పునః॥

ఓ యవివేకమా! పరమాత్మయొక్క మిక్కిలి యాశ్చర్యకరమయిన యా విశ్వరూపమును దలంచి దలంచి నా కధికముగు నాశ్చర్యము కలుగుచున్నది. మాటిమాటికి నానందించుచున్నాఁడను. (౭౭)

యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతిర్మమ॥ ౭౮॥

ఎచ్చట యోగీశ్వరుఁడైన పరమాత్మయు, ఎచ్చట వైరాగ్యము గల జీవుఁడు నున్నారో, అచ్చట మోక్షరాజ్యంబును, సమస్తమును స్వాధీనమగు జయమును, సమస్తమును తానుగాఁజూచెడు ఐశ్వర్యంబును, "ఏకమేవాద్వితీయమ్," ఒకటేతప్ప రెండవది లేదను భావంబును దప్పక కలుగు నని నాయభిప్రాయము. ఇది నిశ్చయము. అనఁగా, ఇట్లువివేకము వినినపిమ్మటనైన, ఆయవివేకము అహంకారమమకారములను వదలి, పరమాత్మను శరణుచొచ్చి దుర్గుణములను వదలి సద్గుణములతోఁ జేరునేమో యని వివేకముయొక్క తలంపు.

ఇట్లు మోక్షసన్న్యాస నిదిధ్యాసనయోగమను

పదునెనిమిదవ యధ్యాయము

సమాప్తము.

ఓమ్, తత్, సత్.

—oo:o:oo—

శ్రీకృష్ణపరమాత్మార్పణమస్తు.

